

# రావిశాస్త్రిగారి ధర్మేతిహాసం

## మూడు కథల బంగారం నవల-విమర్శ



ముదిగొండ వీరభద్రయ్య



# రావిశాస్త్రిగారి ధర్మేతిహాసం

(మూడు కథల బంగారం నవల - విమర్శ)

ముదిగొండ వీరభద్రయ్య




1995

యువ భారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001.

Ravi Sastri Gari Dharmetihasam
(Mudu Kathala Bangaram Novel - A critical evaluation)
by Dr. Mudigonda Veerabhadriah,
Reader in Telugu, University of Hyderabad, Hyderabad.

A Yuvabharathi Publication
Under Self Financing Sheme.

Publication No : 157

Copies : 500

Year of Publication : 1995

Price : Rs. 35/-

ముఖచిత్రం : శీలా వీర్రాజు

ప్రాప్తిస్థానం :

1. యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ,
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు,
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

2. ముదిగొండ సత్యసాయిబాబా
5-20, శ్రీ సత్యసాయి నికుంజం,
5వ వీధి, శ్రీ వేంకటేశ్వరకాలనీ,
సరూర్‌నగర్, హైదరాబాదు-500 035.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ వాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380.
ఫోన్లు: 611413, 660547.

---

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంతో ముద్రితం. ఈ పుస్తకంలోని అభిప్రాయాలతో తెలుగు విశ్వవిద్యాలయానికి, యువభారతికి ఎలాంటి సంబంధమూ లేదు.

# అంకితం

విమర్శకులలో ఎవరెస్టు శిఖరం
విద్వాంసులలో మేరు నగం
అరవయ్యేళ్ళ జి. వి. సుబ్రహ్మణ్యంగారు—

నిరంతర సాహిత్య కృషీవలుడు
హృదంతర సాయిధ్యాన మగ్నుడు
అరవయ్యేళ్ళ జి. వి. సుబ్రహ్మణ్యంగారు—

సాహిత్యాకాశంలో నవ్య సంప్రదాయ సూర్యుడు
రస విమర్శలో ధర్మవీర ప్రతిపాదకుడు
అరవయేళ్ళ ఆచార్యవర్యులు—

మా గురువర్యులు జి. వి. సుబ్రహ్మణ్యంగారు,
ఇంకో అరవయ్యేళ్ళు సాహిత్యసేవ చేసేటట్లుగా
భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారు
వారిని ఆశీర్వదించి అనుగ్రహించాలని నమస్కరిస్తూ
ప్రార్థిస్తూ, సుబ్రహ్మణ్యంగారికి ఈ గ్రంథాన్ని
సగౌరవంగా సమర్పిస్తున్నాను.

—ముదిగొండ వీరభద్రయ్య

# గ్రంథస్వీకర్త

# ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తెలుగు సాహిత్య క్షేత్రంలోని అగ్ర శ్రేణి విమర్శకులలో ఒకరు. తిరుపతి వేంకటకవుల సాహిత్యంపై రాసినా, విశ్వనాథ శిల్ప విమర్శపై రాసినా, శ్రీశ్రీ పురాణ ప్రతీకలమీద రాసినా వారి సునిశిత మేధాశక్తి జిజ్ఞాసువులను ఆశ్చర్య పరుస్తుంది. రససిద్ధాంతంమీద సాధికారులు వారు. 1961 నాటికే వారి 'వీర రసము' గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతి ప్రకటించింది. నిన్నమొన్న రాసిన 'ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం' అన్న గ్రంథానికి కేంద్రసాహిత్య ఎకాడమీ పురస్కారం కూడా లభించింది. అట్లా వారికృషి బహుధా గుర్తింపుని పొందింది. 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' అన్న వారి ఇటీవలి బృహద్గ్రంథం సాహిత్య చరిత్రను ప్రక్రియాపరంగా ఎట్లా అధ్యయనం చేయాలో దారులు వేసింది.

ఇంతటి మహా విద్వాంసునికి శిష్యుణ్ణి కావడం నా అదృష్టం. 1958 లో వారు ఈ మొలకకి జలదానం మొదలు పెట్టారు. అది ఇంకా ఆగలేదు. ఆ చెట్టుకి పూసిన పువ్వు ఈ ప్రస్తుత గ్రంథం. ఇంతకుముందు 'విమర్శ మౌలిక లక్షణాలు' అన్న గ్రంథాన్ని వారికి అంకితం ఇచ్చాను. సంతృప్తి లేదు. సంతృప్తి కోసం ఇప్పుడదే పని మళ్ళీ చేస్తున్నాను.

విశ్వవిద్యాలయాలలో ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారిలాంటి ఆచార్యులు చాలా కొద్దిగానే కనబడ్తారు. సామర్థ్యాన్ని వారు గుర్తించినట్లుగా చాలా తక్కువమంది గుర్తిస్తారు. ప్రొఫెసర్ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి నుంచి వచ్చిన గొప్ప లక్షణం ఇది. అధ్యాపనంలో అరవయ్యేళ్ళు నిండినప్పటికీ వారు అలసిపోకపోవడం విశేషం. వారు వెళ్ళని ఊరు లేదు. సాహిత్యోపన్యాసం చేయని వేదిక లేదు ఢిల్లీ నుంచి కాలికట్ దాకా వారి సాహిత్యోపన్యాసం జరగని పెద్ద ఊరు లేదు. ప్రతి సెమినార్‌లోనూ ఏదో కొత్త అంశం చెప్పకుండా వారు ఉండలేదు

బహుముఖ ప్రజ్ఞాశాలి నాటికలు రాశారు. వేయించారు. కథలు, నవలలు రాశారు. కవిత్వం రాశారు. అన్నింటికీ మించి అమృతహృదయులు. ఇతరులను గురించి పల్లెత్తు నిందావాక్కు అనడం నేనింత వరకు చూడలేదు. నాకాయన ఆదర్శ పురుషుడు. ఆయన వెలిగించిన అనేక దీపాలలో ఒకటి ఇది. ఋణగ్రస్తుణ్ణి. తీర్చలేని ఋణం. వారికి మేలు జరగాలని మనసారా ఆ దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను.

—ముదిగొండ వీరభద్రయ్య

# ఆమోదం

సంగీతంకోసం సరస్వతీదేవి స్వరాలను సంగతి చేసుకొన్న వీణ
సాహిత్య ప్రసంగంలో విరించి విచిత్ర సృష్టిగా మారిందేమో!
అనిపిస్తుంది వీరభద్రయ్య మనసులో మెదలినప్పుడెల్లా.

అతడు ఉన్మత్తకోకిలగా గానం చేస్తాడు
అతడు నిబద్ధ సాహితీవేత్తగా నిక్కచ్చిగా మాట్లాడతాడు.

దాదాపు మూడు దశాబ్దాలక్రితం అతడు నాకు దగ్గరయ్యాడు
కాళిదాసు శాకుంతలంలోని జన్మాంతర సౌహృదాల జవ్వాజి వాసనలాగా
విలుబుత్తూరులోని మన్నారు కృష్ణుని పణ్యారాల పుణ్యసుగంధంలాగా
లోనారసి చూచే సాహిత్య రసికత్వానికి విమర్శ మౌలిక సూత్రంలాగా
కమలంలా వికసించే కళాతత్త్వ శాస్త్రం వెదజల్లే పరాగరాగమాలికలాగా
సత్యసాయి సేవామార్గంలో నినదించే ప్రేమ సంగీతంలాగా
గుండెల్లో పులకించటం భక్తితో పరవశించటం,
వివేచనతో విస్తరించటం, ఆలోచనతో ఆవరించటం
ఆనందంతో పడగలెత్తటం - అతని జీవితం అందించిన అనుభవహేల.
విద్యార్థినుండి విద్వాంసునిదాకా ఎదిగిన వీరభద్రయ్య
నిటారున నిలిచి ఉన్నాడు నేడు నీడ పడని దీపంలా.

ఆనాడు నేను వీరరసంతో ముస్తాబవుతున్నప్పుడు
ఓరుగల్లు స్నేహధారలతో అక్షరాభిషేకం చేశాడు.
నేను మండుతునే ఉన్నాను - అతనూ మండుతూనే ఉన్నాడు
నేను రసలోకాల్లో తిరిగి తిరిగి క్రొత్త రసాయనాలు తెచ్చాను
అతడు మార్క్సును పుక్కిటపట్టి ప్రపంచాన్ని జల్లెడపట్టాడు.
సాహిత్య అకాడమీ పురస్కారంతో గురుపీఠమెక్కి నాకూ
గుర్తింపు తెచ్చాడు.

వీరభద్రయ్య ప్రత్యర్థుల డొక్కల్లో బల్లెం
విద్యాదాతలైన గురువుల కాళ్లకడుగు పళ్లెం.
ఆయన నేమన్నా పరవాలేదు కాని
ఆయన నమ్మిన విలువలమీద నోరు చేసుకోవద్దు.
అగ్నిపర్వతంలా బ్రద్దలౌతాడు - అయినా, లావాకు బదులు
అనంత సత్యాలను అమృతధారలుగా పొంగులు వారుస్తాడు.

ఆవేశం వచ్చినపుడు నిజంగా వీరభద్రుడు
ఆ యెదుట ఎంత దక్షుడైనా గొర్రెతలను వంచుకపోవలసిందే–
అతని గుండెలో కూర్చున్న గురువు శివుడు
వీరభద్రుడుంటే శివుని మూడో కంటికి సెలవు.
కంఠంతో గర్జించే సింహం, కన్నీరుతో కరిగిపోయే హిమఖండం
మెత్తని మనసున్న మనోహర వజ్రం.
అతనితో మాట్లాడటం ఒక ఎడ్యుకేషన్
అతనితో అధ్యయనం ఒక మెడిటేషన్.
బడబాగ్నిలా బాధలెన్ని దహించినా నిండు పున్నమి మున్నీరు
సాధక బాధకాలెన్ని ఉన్నా సాహిత్యమంటే గగనానికెగసే మిన్నేరు
నాకు శిష్యుడు కావడం నా అదృష్టం
నా సహాచార్యుడు కావడం అతని అదృష్టం.
అతడు గొంతెత్తి క్లాసులో పద్యం ఆలపిస్తుంటే
మోరలెత్తిన గోవుల మధ్య వేణుగోపాలుడు జ్ఞాపకం వస్తాడు.
అతడు నాతో నమ్రంగా మాట్లాడుతుంటే
ఎప్పటి శిష్యసంప్రదాయమో నవ్యసంప్రదాయంగా అవతరించి నట్లుంటుంది.
వీరభద్రయ్య విమర్శ మౌలిక లక్షణాలను అంకితం చేసినప్పుడు
విద్యార్థి గురుదక్షిణ ఇచ్చుకొన్నట్లు ఇంపు గొల్పింది.
మరి నా షష్టి పూర్తికి ఈ పునరంకిత మేమిటి?
అవును....
మా యిద్దరి స్నేహబంధానికి ఇదొక ఆధునిక ధర్మేతిహాసం!
వీరభద్రయ్య అందించిన ఈ నవలానుశీలనం
నన్ను చిరకాలం జీవింపచేసే కావ్యకళోపాయనం!
అందుకు భగవాన్ శ్రీ సత్యసాయి ఆశీస్సులు
అతనికి ప్రేమ ఫలాలుగా అందాలని
ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.
ఆత్మీయు దందించే అక్షరపదాన్ని
ఆనందంగా ఆమోదిస్తున్నాను—

—జి.వి. సుబ్రహ్మణ్యం




# మూడు పదుల యువభారతి
# మూడు కథల బంగారం

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోనటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది" - అనే లక్ష్యంతో యువభారతి రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్యస్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంలో ముప్పైఏళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. ఆలోచనలకు అక్షరాకృతి యువభారతి ప్రచురణ!

ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన మహాకవుల రచనలనే కాక, ఆధునిక సాహిత్య నిర్మాతలైన రచయితలను, కవులను, వారి రచనలను గురించి సామాన్య ప్రజానీకానికి అందుబాటులో ఉండేటట్లు సమీక్షాత్మక విమర్శ ప్రచురణలను వెలువరించడంలో యువభారతి గణనీయమైన సేవ చేసింది; చేస్తున్నది.

డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు యువభారతి సభ్యులు; ఉపాధ్యక్షులుగా పని చేసినవారు. యువభారతి సాహిత్య కార్యక్రమాలను రూపొందించటంలో నిర్మాణాత్మకమైన పాత్ర నిర్వహిస్తున్నారు. వారు సెల్ఫ్ ఫైనాన్సింగ్ పథకం క్రింద ఈ గ్రంథాన్ని ప్రచురిస్తున్నారు యువభారతి సాహిత్యోద్యమానికి మరొక ఊపు నందిస్తున్నారు.

ఇప్పుడు తెలుగులో శక్తిమంతమైన సాహిత్య విమర్శను వ్రాస్తున్న కొద్దిమంది విమర్శకులలో డాక్టర్ వీరభద్రయ్యగారొకరు సామాజిక సిద్ధాంతాలు, సాహిత్యకళాతత్త్వ సిద్ధాంతాలు, విమర్శక మౌలిక సూత్రాలు మొదలైన అరుదైన విమర్శరంగాలలో ప్రామాణిక ప్రస్థానాలను సాగిస్తున్న ప్రజ్ఞామూర్తి డాక్టర్ వీరభద్రయ్యగారు ఆధునిక నవలా రచయితలమీద వారు సాగించే సమీక్షలు ఎందరి కనుబొమలనో ఎత్తి పరిశీలింపజేస్తుంటాయి. ఆధునిక రచయితల్లో రావిశాస్త్రిగారిది సమున్నతస్థానం. వారి 'మూడు కథల బంగారం' నవలపై ప్రామాణిక విమర్శ పద్ధతిలో సమీక్ష సాగించి, దానిని రావిశాస్త్రిగారి ధర్మేతిహాసంగా వ్యాఖ్యానించటం ఈ రచనలోని ప్రత్యేకత. ఒక విశిష్ట రచన మీద ఒక విశిష్ట విమర్శ

యువభారతి ప్రచురణగా వెలువరించటానికి అంగీకరించినందుకు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారికి మా కృతజ్ఞతలు

హైదరాబాదు,
1-6 1995.

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

# కృతజ్ఞతలు

* ఈ గ్రంథాన్ని అంకితం తీసికోవడానికి తమ ఆమోదాన్ని వాత్సల్య పూర్వకంగా తెల్పిన గురువర్యులు ఆచార్య జి వి. సుబ్రహ్మణ్యం గారికి నమస్సులు.
* కోరగానే ఈ పుస్తకానికి 'అంతరాయానికి క్షమాపణలు' అన్న పేరుతో తమ అభిప్రాయం రాసి ఇచ్చిన విద్వాంసులు, ప్రముఖ కథకులు, సంపాదకులు, మిత్రవాక్య రచయితగా లోకమిత్రులూ అయిన శ్రీ వాకాటి పాండురంగరావు గారికి నమస్సులు.
* ముద్రణకు కొంత ఆర్థిక సాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయానికీ, ఉపకులపతులైన ఆచార్య పేర్వారం జగన్నాథం గారికీ నమస్సులు.
* నా యీ రచనా వ్యాసంగానికి ఎంతగానో ప్రోత్సాహాన్ని యిస్తున్న హైదరాబాద్ విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య రవ్వా శ్రీహరి గారికి నమస్సులు.
* అందమైన ముఖచిత్రాన్నీ, రేఖా చిత్రాలనూ గీసి ఇచ్చిన సాహితీ మిత్రులు, కళాకారులు అయిన శ్రీ శీలా వీర్రాజు గారికి కృతజ్ఞతలు.
* ప్రచురించిన యువభారతికి, సాయం చేసిన డా॥ బి. జయరాములు గారికీ, డా॥ జి. విద్యానాథ్ గారికీ కృతజ్ఞతలు
* సకాలంలో అచ్చేసి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి క్లిష్టమైన ఫస్ట్ ప్రూఫులు చూసి నా శ్రమనెంతో తగ్గించిన శ్రీ కె.పి. బాబుగారికీ, కృతజ్ఞతలు.
* కావాల్సిన సాయం చేసిన పరిశోధక విద్యార్థి ఒ భాస్కర్‌కి ఆశీస్సులు.

—వీరభద్రయ్య

# అంతరాయానికి క్షమాపణలు!

మనసు ఆకాశం. ప్రశ్నలు నక్షత్రాలు. ఆ నక్షత్రాల మిణుగురు పురుగుల నందుకుని, కిందకు దింపుకుని వాటి వెలుగుల సమాధానాలతో మొదట తనలోని చీకటిమూలలను వెలిగించుకుంటాడు రచయిత అనే అన్వేషి. ఈ కాంతిలో నా చుట్టూవున్న ప్రపంచంలోని అంధకారాన్ని అంత మొందించాలి అనుకుంటూ, అక్కడెక్కడో పేర్లు తెలియని రెండూళ్ళమధ్య, రైలుపట్టాల ప్రక్కగా అర్ధరాత్రివేళ ఎర్రలాంతరూ, పచ్చలాంతరూ చూపించే మార్గదర్శిలా బయలుదేరుతాడు. చెడుకు ఎర్రదీపమూ, మంచికి పచ్చదీపమూ చూపాలి అని బయలుదేరినవాడికి ఏది మంచో, ఏది చెడో తెలిసే వుంటుంది, వుండాలి.

ఈ విచక్షణ, వివేచన కలవాడే 'నవుడూ' మానవుడూ! అయితే ఈ మంచిచెడ్డలనేవి దేశాన్నిబట్టి కాలాన్నిబట్టి మారుతాయా? అట్లా మారుతు న్నట్టయితే వాటిని కనుక్కోవడం ఎట్లా అన్నది చాల చిక్కుప్రశ్న. అట్లా మారేవి వుంటాయి. మారకుండా నిలకడగా వుండి - ఇదుగో ఈ గీతకావలిది చెడు, ఈవలిది మంచి అని సర్వకాలాల్లో సర్వదేశాల్లోనూ స్పష్టంగా చెప్పే రేఖ వుందే - దానిపేరే ధర్మం. అట్లా విభజించినప్పుడు అది గీత. నీ తప్పొప్పు లను తూకం వేస్తున్నప్పుడు అది త్రాసు. ఆ గీతను పదే పదే దాటినప్పు డొకనాడు హఠాత్తుగా నిన్ను కాటువేసేవ్వుడది త్రాచు. అట్లాకాక ఆ విచక్షణ నీ అంతరంగంలో భాగమై, నీ రక్తంలో రక్తమై ప్రవహించినప్పుడు, తప్పడుగు వేయకుండా నిన్నది సదా కాచు!

'ఒరులేవి యొనరించిన తనకు అప్రియం అన్పిస్తుందో అది నువ్వు ఆ ఒరులకు చేయకు - అదే ధర్మ శిఖరాలకు ఎవరెస్టు' అంది ఈ దేశం ఆరేడు వేల సంవత్సరాలనాడు. **Man's inhumanity to man makes countless thousand to mourn** - అని ఆక్రోశించాడు ఆంగ్లకవి రాబర్ట్ బర్న్స్ (1759-96)—

"ఓ అగ్రజాతుల పెద్దలారా! మీరు నడిచే శవాలు! మీరు భస్మమయి మాయమయి పొండి! మీరట్లా పోగా మిగిలిన ఖాళీలో నవభారతం ఉదయిస్తుంది.

రైతు నాగలినుండి, జాలరి గుడిసెనుండి, చర్మకారుని కాలినుండి, వీధిచిమ్మే వారి చీపురు నుండి ఆ నవభారతం ఉదయిస్తుంది - 'అని ఘోషించినవాడు స్వామి వివేకానంద "చెమట విలువని ఖాతరు చేయని తులువా, నీ అంతమే మానవాళికి శుభోదయం" అని కనులెర్ర చేసి దేశాల సరిహద్దుల చెరిపి ఆకలి కోపాన్ని శివుడి మూడో కన్నుగా మార్చ యత్నించినవాడు కార్ల్‌మార్క్స్.

స్వార్థంమీద, దౌష్ట్యంమీద పోరాటం నాటికీ నేటికీ సాగుతూనే వుంది. తెలుగు నాట ఆ మూగవాని ప్రక్కన నిలబడి, బడుగు మానిసికి అండగా రచనా శతఘ్నులను పేల్చిన మహాకవి శ్రీశ్రీ కాగా, మహా కథకుడు రావిశాస్త్రి. ఇద్దరి కోపమూ ఇరవయ్యో శతాబ్దానిది; ఆ కోపాన్ని అక్షర రూపాలుగా మార్చిన ఆల్కెమీ మాత్రం ఏడువేల ఏళ్ళ నాటిది

'నాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పదిచుంబనలో ప్రాణావసానవేళా జనితం, బ్రహ్మానంద జనితం........నైవేద్యం' గా బయలుదేరిన కవీశ్వరుడు, 'కనకదుర్గాచండ సింహమై' 'పాలికాపు నుదుటి చెమట, కూలివాని గుండె చెరువు, బిచ్చగాని కడుపు కరువు . ' తరపున 'కలకత్తా కాళిక నాలికగా' పలికాడు పలికించాడు.

ఏ మంచికి హాని కల్గిస్తున్నా మో, ఏ చెడుకు దోహదం చేస్తున్నా మో అన్న జాగ్రత్త ఎల్లవేళలా రచయితకూ వుండి తీరాలి అని చెప్పిన రాచకొండ విశ్వనాథశాస్త్రి ఆయన స్వంత మాటల్లో - "ఇంట్లో పడి కొట్టుకుంటున్న కథను వీధిలోకి" లాక్కొచ్చారు.

'పిపీలికం', 'పాతదే కథ' సృష్టిలో సారాకథలు, 'నిజం', రత్తాలు - రాంబాబు రాసిన రావిశాస్త్రి అనే జాస్మినే 'తెల్లంచు జరీచీర', మామిడిచెట్టు, కార్నర్ సీటు, వెన్నెలా—రాశారు కాని, మొదట పేర్కొన్న కథలను మాత్రమే పేర్కొని, వాటిలో "ఫ్యూడల్ వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ వర్గ దోపిడీలను వాస్తవిక దృక్పథంలో ప్రదర్శించి", "స్వంత ఆస్తి అనే వేయిపడగల పాము మళ్ళీ తలెత్తకుండా సాంతం సమసిపోయేలా" - "స్పష్టమైన సామాజిక అవగాహనతో లక్ష్యశుద్ధితో" రాస్తున్న రచయిత రావిశాస్త్రి అంటూ ఎరుపెత్తి ఎలుగెత్తి చాటేవాళ్ళ చప్పుళ్ళే ఎక్కువగా వినబడి మరొక రావిశాస్త్రి మరుగున

పడ్డాడు. అలాగని ఆయనలోని సమగ్రతను, మానవత్వాన్ని, 'అదర్‌నెస్'ను చూడనివాళ్ళు చెప్పనివాళ్ళు లేరనీ కాదు.

చూడండి సాక్ష్యాలు!

* "సంకుచితమైన పరిధిలో దేంట్లోనూ ఇమడలేని వ్యక్తిత్వం కలవాడు రావిశాస్త్రి. ఏ సూత్రాలూ ఆయన్ను బంధించలేవు...." "ఇప్పటికీ దేవుడు వున్నాడనే నమ్మకం పూర్తిగా పోలేదేమో - అంటూ - భగవంతుణ్ణి ప్రార్థించి కాని నిందించి కాని ప్రయోజనం లేదని తెలుసుకున్నానంటారు.

—పురాణం సుబ్రహ్మణ్య శర్మ.

* శాస్త్రి అనతి కాలంలో చడీ చప్పుడూ లేకుండా కథక సామ్రాజ్యంలో సింహాసనం ఎక్కి కూచున్నాడు. నలభై ఏళ్ళయినా శ్రీశ్రీ అలాగేవున్నాడు. ఎంచేత అని నామట్టుకు నేనే ప్రశ్నించుకున్నాను. పాక్షికవాదులైన రచయితలు ఒకే దృష్టితో చూస్తారు. పక్షవాతంలాటిది పాక్షికవాదం. ఒకే కాలు మీద నడవడం, ఒకే కన్నుతో చూడ్డం, ఒకే చేతితో పని చెయ్యడం. ఈ బాధపళ్ళేక శాస్త్రి బయటపడ్డాడు. రెండు కాళ్ళ మీద నడవాలనీ, రెండు చేతుల్తో పన్జెయ్యాలనీ....

—అబ్బూరి వరదరాజేశ్వరరావు

* "శబ్దాలూ ధాతువులూ స్మరిస్తూ స్వరిస్తూ సంస్కృతం చదువుకున్నాడు. (రావిశాస్త్రి) మల్లినాథుడి వ్యాఖ్యకి వేదంవారి తెలుగు సేత చదివి చదివించేవాడు మా అందరికీ అవిచ్చి మరీ చదివించేవాడు. కృష్ణకర్ణామృతంలో శ్లోకాలు రక రకాల ఒరవడులలో చదివి చదివి మెచ్చుకునేవారు. బూజుని వెక్కిరించి దులిపిపారేసే కవనాన్ని మెచ్చుకునే పండితుడు. శ్రీ కాళహస్తీశ్వర శతకం కమ్యూనిస్టు మేనిఫెస్టో Wonderful poems అంటాడు. ఆయనకు కంఠతా వచ్చును ఆ రెండూ—

—ఎం రామకోటి

* జాతకాలమీద మీకున్న నమ్మకానికీ మార్క్సిజానికీ ఎట్లా పొత్తు కుదురుతుందీ అని అడిగితే —"ఏమో Occult ని కూడా తనలోకి ఇముడ్చుకునేంతగా మార్క్సిజం విస్తరించవచ్చును కదా?" అన్నారు రావిశాస్త్రి (నవం '70, ఢిల్లీ)

—వాకాటి పాండురంగరావు

* ''పదహారో శతాబ్దపు షేక్స్పియర్ పాత్రలు ఇప్పుడు మనలో సమకాలికుల్లా తోచవూ? అలాగే రావిశాస్త్రి పాత్రలు కూడా కలకాలం బతుకుతాయి. క్షుద్రమైన తాత్కాలిక రాజకీయాల్ని, సంకుచిత సిద్ధాంతాల్ని, ఇరుకైన నీతుల్ని అతిక్రమించి జీవిస్తాయి. తను మానసిక ఆవరణని ఛేదించుకుని విశ్వంలోకి ప్రసరించే దర్శనం రావిశాస్త్రికి వుంది- అప్పారావుగారి లాగే, చలంగారిలాగే, ప్రపంచ సాహిత్యంలో గొప్ప రచయితలందరిలాగే.... 'బ్రాహ్మల్లో కూడా మహాత్ములుంటారు' అన్నాడు బైరాగి. మార్క్సిస్టుల్లో కూడా మహాత్ములుంటారు, అననా?"

—ఇస్మాయిల్

* '' 'రావి' గారికి సిద్ధాంతాలకన్న తనచుట్టూవున్న మనుషులు, వాళ్ళతో చనువు, వాళ్ళమీద చచ్చేటంత ఇష్టం, లేక వెటకారంతో కూడిన అయిష్టం ఎన్నో వున్నాయి. తన సిద్ధాంతాలను రుజువుచేయడానికి వీలయిన నమూనాలుగా ఆ మనుషుల్ని మాత్రం ఆయన మలచడు. వాళ్ళని పూర్తిగా అవగాహన చేసుకోవడంతో వాళ్ళ ప్రవర్తన వివరించి చెప్పడంలో మార్క్సిస్ట్ తాత్త్వికప్రభావం ఉండొచ్చు కాని మనుషుల మధ్య జరిగే సంఘటనలు ఆయన కథలలో కీలకమైన సంఘటనలు జీవితంలోంచి ఏరుకున్నవేగాని తాత్త్విక సూత్రాలకు అనుగుణంగా మలిచినవి కావు.''

—పాలగుమ్మి పద్మరాజు

—అనగా, రావిశాస్త్రి రెండు కళ్ళతో జీవితాన్ని చూచాడని, మెదడులోని రెండు అర్ధభాగాల్లోనూ (ఎడమ సగభాగం తర్కాన్ని, వివరాలను గ్రహిస్తుందనీ; కుడి సమగ్రతను, సంపూర్ణతను తెలుసుకుంటుంది అని ఆధునిక విజ్ఞానం ఉవాచ....) అనుభవాలను స్వీకరించి విశ్లేషించాడు, రెండు చేతులతోనూ కథలూ, నవలలూ రాసి తెలుగు భాషను సుసంపన్నం చేశాడు అనే కద! అయితే— వేగుంట మోహన్ ప్రసాద్ అతి అందంగా సెలవిచ్చినట్లు- "ఈ విమర్శక సామాజిక వాస్తవిక శిఖామణులు నకిలీ ఫేక్ స్పూరియస్ స్మగుల్డు దొంగ కోడి సోషలిస్టు మొహాలు పెట్టి వాళ్ళ జీవితాలలో లేని ఆశించని ఆచరించని ఊహించని కుట్లు కూడా కనపడని దొంగ మొహాలేసుకొని విమర్శా స్వకుచ ప్రయోగాలు చేసుకుంటారు.... అతని కలంలో రత్తాలు రత్నమవుతుంది. మానవత్వపు కలలు కనీసం కలకాలమైనా నిజమవుతాయి.... అనంత పాపి పాదాలముందు ఫాదర్ జోసిమాలా కరుణలో పడిపోయినా అంతం లేని ఆ ప్రేమ కమ్యూనిజానికి వ్యతిరేకమూ కాదు"— అన్న విషయాన్ని గ్రహించక గ్రహిం

చినా అంగీకరించే అంతరంగ భద్రత లేని ఒంటి కంటి చూపువారు రెండందాల రావి చెట్టును ఉత్తరించి, కత్తిరించి విరిగిపోయిన నినాద ప్రేంకుల కుండలో వుంచి పెంచుకుంటామంటారు కానీ అది కుదరదు.

రావిశాస్త్రి రచనలన్నిటా అంతర్లీనంగా ప్రవహించే అపార కృపావాహిని రసస్రోతస్విని కమ్యూనిజం కడవలతో ఎత్తి పోస్తే తరిగేవి కావు. కారణం ఆయన రచనలు ఆయనవి, ఆయన రక్తానివి, ఆ రక్తంలో జీర్ణించుకుపోయిన జన్యుకణాలవి, ఆ జన్యుకణాలలోని డి.ఎన్.ఏ.లలో వేలాది సంవత్సరాలనుండి కాపురం చేస్తున్న ఆశయాల ముద్రల అతి తాజా అవతారాలవి. అంచేతే- రావిశాస్త్రిని పునరధ్యయనం చేయవలసి వుంది. ఆ మహానుభావుడి పూర్ణ రచనా స్వరూపాన్ని, దాని ఆత్మను ఆవిష్కరించవలసివున్నది ఆయన్ను 'తమవాడు'గా భావించేవారు 'బలహీనతలు' అనీ 'వైరుధ్యాలు' అనీ నిరసిస్తున్న, కొట్టి పార వేస్తున్న రావిశాఖా పత్రాల పచ్చదనాన్ని నిండుగా ఎత్తి చూపించవలసి వుంది. దానికిదే పదునైన అదను.

అది ఎట్లన్నన్?

1984 లో అచ్చయిన జెకోస్లొవేకియన్ రచయిత మిలన్ కుందేరా నవల 'ది అన్‌బేరబుల్ లైట్‌నెస్ ఆఫ్ బియింగ్'లోని ఈ వాక్యాలను ఆంగ్లంలోనే చదువుదాం- "Any one who thinks that the Communist regimes of Central Europe are exclusively the work of criminals is overlooking a basic truth: the criminal regimes made not by criminals but by enthusiasts convinced they had discovered the only road to paradise. They defended that road so valiantly that they were forced to execute many people. Later it became clear that there was no paradise, that the enthusiasts were therefore murderers."

'భూతల స్వర్గానికి ఏకైక మార్గం' కనుగొన్న వారి పితృ దేశమయిన రష్యాలో 1945 లో అప్పటి నేతయిన స్టాలిన్‌ను విమర్శించాడన్న నేరంపై ఎనిమిదేళ్ళ కారాగారవాసమూ, ఈ దారుణాన్ని నిరసించడానికి (అక్కడ

మానవ హక్కుల సంఘాలూ, ప్రగతిశీల ప్రజాస్వామ్యవాద ప్రొఫెసర్లూ వుండే వారు కాదు!) 1970 లో నోబెల్ బహుమతి రాగానే దేశబహిష్కరణకు గురి అయిన విశ్వమానవుడు, విశిష్టనవలాకారుడు, మేధావి అలెగ్జాండర్ సొల్జెనిత్సిన్ తన 'తల్లి దేశాన్ని' చూచి కంటతడి పెడుతూ రాసిన 'ది కన్‌స్ట్రక్టింగ్ రష్యా' (1990 లో మాస్కోలోనే అచ్చయింది.)— "ఏడు దశాబ్దాలబాటు మార్క్సిస్టు లెనినిస్టు స్వర్గం అన్న ఎండమావుల వెంట పరుగెత్తడంతో మన జనాభాలో మూడవ వంతు కోల్పోయాము. వారిలో సగం మందిని హత్య చేశారు. సగం మందిని 1941 - 45 ల మధ్య జర్మనీతో జరిపిన యుద్ధంలో కోల్పోయాము.... ఆనాటి సౌభాగ్యమంతా పోగొట్టుకున్నాము. రైతులను సమూలంగా నాశనం చేశాము'' అంటూ కంటతడి పెట్టాడు.

మరొక కమ్యూనిస్టు కోట చైనాలో అక్కడి కమ్యూనిస్టు పార్టీ జనరల్ సెక్రటరీ జియాంగ్ జెమిన్ జూన్ 9, 1992 న జరిగిన పార్టీ సమావేశంలో— "కామ్రేడ్ డెంగ్ ప్రవేశ పెట్టిన ఆర్థిక సంస్కరణలను దెబ్బతీసేందుకు కొందరు 'వర్గ సంఘర్షణ' గురించి మాట్లాడడం విడ్డూరంగా వుంది. ఇట్లా వర్గసంఘర్షణ గురించి మాట్లాడే వారికి సోషలిజం పట్ల సరయిన అవగాహన లేదు. అశాస్త్రీయమైన ఈ ధోరణితో ఆర్థిక ప్రగతిని దెబ్బతీయజూచే వామపక్ష వాదుల పట్ల మనం జాగ్రత్తగా వుండాలి" అంటూ 'వర్గసంఘర్షణ' అన్న సమాసం గతకాలపు చెత్త బుట్టకు చెందినది - అని స్పష్టం చేశారు.

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ అగ్రనేతలలో ఒకరయిన శ్రీ చంద్ర రాజేశ్వరరావు ('ఈనాడు' దిన పత్రిక, ఫిబ్రవరి 1990)— "కార్మిక వర్గ నియంతృత్వం అనే అంశం చర్చలో వుంది. ఒకే నమూనా సోషలిజం అసాధ్యం. మార్క్సిజం బైబిల్, ఖురాన్ వంటిది కాదు అంటూనే, ఇన్నాళ్ళూ (దానిని) బైబిల్, ఖురాన్‌ల లాగానే పరిగణిస్తూవచ్చాము.... పై నుంచి ఆర్డర్ల ద్వారా ఇకపై సోషలిజం మనజాలదు. మేధావులకు శాస్త్రజ్ఞులకు మరింత స్వేచ్ఛ నిచ్చే చొరవ అవసరం. నేడు సోషలిజంకు రోజులు చెల్లాయి. రాజకీయంగా చూచినా ప్రస్తుత సోషలిస్టు దేశాలలో బంధుప్రీతి, అవినీతి చోటుచేసుకున్నాయి. అదే ప్రజాస్వామ్యంలో పాలకులు భయపడతారు. ఆ భయం లేనందువల్ల సోషలిస్టు దేశాల్లో బ్యూరోకాట్ల ఇష్టారాజ్యం సాగింది" అని 'confess' చేశారు; తిలా పాపం తలా పిడికెడు చేసి వదలించుకోయత్నిందారు.

కమ్యూనిస్టు మేధావి, పెద్దలు శ్రీ ఏటుకూరి బలరామమూర్తి విశాలాంధ్ర 40 వ (1992) వార్షిక సంచికలో—" భారతదేశ ప్రత్యేక సంస్కృతి, సంప్రదాయాలు, చరిత్ర, సామాజిక పరిణామ గతిపై తగినంత పట్టు పిరికి (కమ్యూనిస్టులకు) లేదు.... మత విశ్వాసం వేరు, మతమౌఢ్యం వేరు, రాజకీయాలలో మతాన్ని చొప్పించడం వేరు—" అంటూ హితవు పలికారు.

1995 ఫిబ్రవరి 5 న 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో అచ్చయిన వార్త ప్రకారం మార్క్సిస్టు కమ్యూనిస్టు కురువృద్ధుడు ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్- 'మతం మత్తుమందు' అని కార్ల్‌మార్క్స్ అన్న వాక్యాన్ని సందర్భం నుంచి విడగొట్టి, దానిని విపరీతంగా పెంచి, అతిశయోక్తులతో ప్రచారం చేశాము. ఇందువలన చాలా నష్టం కల్గింది....ఇక ముందు కమ్యూనిస్టు నేతలు మత గురువులతో కలిసి పనిచేయాలి—" అన్నారు.

కనుక కమ్యూనిస్టులకు సైతం కనువిప్పు కలుగుతున్నదా ఏమిటి అని ఆశ్చర్యపడడం మానేసి బైబిలులో వర్ణించిన prodigal sons 'చక్కని రాజమార్గంమీదకు రావడాన్ని హర్షిస్తూ - పైన ఉటంకించిన కామ్రేడ్ నేతలు తమ తలపుల తలుపులు బార్లా తెరిచిన తర్వాత వీచిన ఆలోచనల సారాంశాలు చూద్దాము.

i) అందరము సమానంగా, హాయిగా, ఆకలి లేకుండా జీవించగల స్వర్గానికి కమ్యూనిజం చేసిన కోట్లాది హత్యలు దారికానే కాదు.
ii) రష్యాలో కమ్యూనిజం సాధించింది సర్వనాశనం.
iii) కత్తిలేని కమ్యూనిజం కన్నా కత్తులున్న ప్రజాస్వామ్యమే మేలు.
iv) వర్గ సంఘర్షణ అశాస్త్రీయం; ఆర్థిక ప్రగతి కావాలంటే అవశ్య వర్జనీయం.
v) మత విశ్వాసం అంతసులువుగా తోసివేయదగినది కాదు.
vi) 'మంచి' కమ్యూనిస్టు, 'దొంగ' కాని మతగురువూ కాంక్షించేది సర్వమానవాళి శ్రేయస్సే కనుక వారు ఇద్దరూ కలిసి పనిచేయాలి.

ఈ 21 శతాబ్దపు నవజీవన బృందావనపు మేనిఫెస్టో రూపురేఖలను వివరిస్తూ 'పబ్లిక్ ఇంటరెస్ట్' (1992) అన్న పత్రికలో ప్రచురించిన తన 'The Post Capitalist World - అన్న వ్యాసంలో పీటర్ ఎఫ్. డ్రక్కర్ ఇట్లా అన్నాడు.

i) కమ్యూనిజం ఆర్థికంగా అపజయం పాలయింది. అంతేకాదు. సంపదకు బదులు దారిద్ర్యాన్ని సృష్టించింది. అది నూతన మానవుడిని సృష్టిద్దామని బయలుదేరి, అసూయ, అపనమ్మకం, అధికార వ్యామోహం నియంతృత్వం, రహస్య మంతనం, అసత్యం, దొంగతనం, నిందారోపణం వంటి అసురీ గుణాల వికారుడిని సృష్టించింది.

ii) రానున్న సమాజం సోషలిస్టు సమాజం కాదు, కేపిటలిస్టు సమాజమూ కాదు రానున్నది ('Knowledge Society') మేధోపర సమాజం.

iii) ఆ సమాజంలో ఉత్పత్తికి ప్రధాన ఆధారం, భూమి శ్రామిక వర్గమూ కాదు; మేధ (Knowledge) అవుతుంది. మేధా పరమైన ఉద్యోగాలు, సేవలందించే ఉద్యోగాలు - వాళ్ళే కేపిటలిజం అనంతరం రాబోయే సమాజానికి నిర్ణేతలు, పాలకులు, నిర్వాహకులు.

iv) ఆధ్యాత్మికమైన పెరుగుదల, మంచితనం, సచ్ఛీలంవంటి ఆంతరంగిక ప్రకృతి కల మానవుడిని రూపొందించగల కొత్తమతం కావాలి.

డ్రక్కర్ నిరసించిన ఆ సుగుణముల రాశి అయిన బంగారిగాడు, బంగారయ్యగా, బంగారుబాబుగా మారడం ప్రధాన ఇతివృత్తంగా రచించిన రావిశాస్త్రి రచన 'మూడు కథల బంగారం'– 21వ శతాబ్దంలో అవతరించనున్న నవమానవుడిని కనడానికి పడవలసిన పురిటి నొప్పుల సంపుటి. ఇది తెలుగులో రాసినప్పటికీ విశ్వ మానవుడి పరిణామక్రమ రూపకల్పనే. ఇది 1982 లో రాసినప్పటికీ 2002 తర్వాతి కాలానికి చెందే మహా రచనే! దానికి ఈ వసుధైక గుణం, కాలాన్ని కాలితో తన్నే బలం ఎట్లా వచ్చిందంటే– ఈ కథను నడిపించిన 'ధర్మం' అన్న గుణం వల్లనే అని కొత్త సులోచనాల బేహారి, ఆలోచనల నైమిశాల విహారి డా॥ ముదిగొండ వీరభద్రయ్యగారు బల్లలు గుద్ది, ఢంకాలు బజాయించి చెప్పారీ విమర్శా గ్రంథంలో. రావిశాస్త్రిగారి పాత్రలచిత్రణలో, కథాక్రమ పరిణామంలో, ఉపమాన ఉపమేయ ప్రయోగాలలో వున్న 'ధర్మ చింతన' అన్న ముడి వస్తువును విడి విడిగా తీసి మన ముందుంచిన ఈ విమర్శనా గ్రంథం చాల సాహసోపేతమైనది. నేటి సమయానికి అత్యంతము అవసరమైనది, కొంత మందికి అప్రియమే అయినా సత్యం గనుక దానిని చెప్పి తీరాలి అన్న పట్టుదలను పాండిత్యాన్ని ప్రతిబింబించేదీను .... నిజం తన ప్రక్కన వుందని

తెలిసిన వారిలో వుండే నిబ్బరం ఈ రచన పుటపుటలో పొటమరించడంలో అబ్బురం ఏమీలేదు. కొన్ని కుక్కుటాల(చూడు వేగుంట కామెంట్) feathers ని ruffle చేస్తే చేయవచ్చు గాక సువిశాల గగన విహారి అయిన గరుత్మంతుడంత రావిశాస్త్రి అంతరాంతరాలను ఎక్స్‌రే తీశారు ముదిగొండ వారు.

"అమాయకుల్ని బాధపెట్ట కూడదు, అది మహా పాపం. ఇతరులను బాధించి భాగ్యవంతులు కావడం అధర్మం. పాపం అన్నది అధర్మాచరణకు మూలం. అడ్డదారి తొక్కి తాను అన్యాయంగా ముందుకు రావడం పాప ఫలితా లలో ఒక పక్షం. దీన్ని సాధించడంకోసం ఇతరులను వికలురుగా చేయడం, వాళ్ళ శక్తిని ఊడబెరికివేయడం, వాళ్ళని కాపాడవలసిన వ్యవస్థను అవినీతి పాలు చేసి ధర్మం యొక్క విశాలభిత్తికను కకావికలు చేయడం పాపంయొక్క రెండవ పక్షం" అని భారతదేశపు యుగ యుగాల అవగాహన ప్రకారం వ్యక్తి - సమా జాల మధ్యవున్న సాలె పురుగు నేత దారాల వంటి సంబంధాల్ని ఉటంకించిన వీరభద్రయ్య - "ఈ ధర్మ దృష్టిని అంతర్లీనంగా కళాత్మకంగా ఈ ధర్మేతి హాసంలో ఇమిడ్చి శాస్త్రిగారు దీనిని అగ్రశ్రేణి నవలగా రూపొందించారు. దీనిలో అంతర్లీనంగా ధర్మదృష్టి ఎంతో గాఢంగా బలిష్ఠంగా వున్నప్పటికీ అది ఎక్కడా వాచ్యం చేయబడలేదు దాన్ని 99% కళాత్మకంగానే తీర్చిదిద్దినా రామచంద్రయ్య పాత్రముఖతః మాత్రమే వాచ్యంగా చెప్పించారు -" అని వివరించారు. రచయిత చెప్పకుండా చెప్పిన దానికి సాక్ష్యాధారాలతో ఎత్తి చూపించడంలో కృతకృత్యులయ్యారు.

"పరమేశ్వరుడు పాపుల్ని క్షమించి రక్షించడమే చూసేను కాని, ఆ పాపుల పాదాలక్రింద నలిగిపోయినవాళ్ళని ఆ లోక రక్షకుడు లేవనెత్తడం నేను ఇంతవరకు చూడలేదు అని రామచంద్రయ్య ఒకచోట చెప్పడంకూడా ఈ నవల సాధించిన ధర్మమన్న ప్రయోజనాన్ని కాపాడేదే" అంటారీ డాక్టరుగారు.

నువ్వొకడిచేతిని నరికిన నాలుగేళ్ళ తర్వాత అది పావం అన్న అవగా హన కలిగి అది పెరిగి, నువు కుంగి కుమిలి, పశ్చాత్తావపడితే ప్రాయశ్చిత్తం చేసుకుంటే— నా మనస్సు బరువు (అదే పాపభావన) తగ్గుతుందేమో - కాని నా ఈ చర్య ఫలితంగా అవతలివారి శరీరంమీద ఇంకోచేయి చిగురించదు

కదా! అంటే 'ధర్మస్థాపనకు యుద్ధం చేసేవాడా! అన్యాయం భరించలేనివాడా! ఆదర్శజీవీ! మహాత్మా! మానవుడా! వాడి చేయి నరకకుండా వుండడమే దారి! పాపానికి ఒడిగట్టకపోవడమే మార్గం - ధర్మం తప్పకపోవడమే శరణ్యం. ఇది నీ మనసులో నాటుకోవాలి. అప్పుడే పాపం నివారించబడుతుంది. అనగా మానవుడిపై ఎంత గురుతరమైన బాధ్యత వుందో తెలిసివస్తుంది. అందుకనే పెంపకం, పిట్టకథలు, బోధనలు, సూక్తులు, విద్యలు - అన్ని 'cloud - hidden where abouts unknown' అని టావోయిస్టు అలెన్‌వాట్స్ అన్న ఆ సూక్ష్మాతి సూక్ష్మమూ, సులభగ్రాహ్యమూ, ఆచరణలో క్లిష్టమూ అయిన ధర్మాభిముఖంగా మనసు, మాట, చేత, సదా వుండాలి అనే ఈ జాతి ఘోషిస్తూ వుంది. అదేమాట సరికొత్తగా రావిశాస్త్రి నవలలో కనపడడం అంటే ఆనందంతో స్వాగతం పలకవలసిన సందర్భమే! 'నిర్మాణ శిల్పం', బంగారం- రచయిత ఉద్దేశ్యం, 'బంగారయ్య ఆత్మవిమర్శ' 'ప్రయోజనాత్మకమైన వర్ణనలు' ఆకర్షకమైన అలంకారసృష్టి అంటూ వేర్వేరు అధ్యాయాలలో ఆచార్య ముదిగొండ వీరభద్రయ్యగారు వివరించిన విశేషాలు వారు తీసుకున్న ప్రధాన ఇతివృత్తాన్ని పరిపుష్టం చేస్తున్నాయి. విమల పాత్ర ఎంత విశిష్టమైనదో, ఎందుకు విశిష్టమైనదో సాధికారంగా చూపారు. ఈ నవ్యసృష్టి తెలుగు సాహిత్య విమర్శలో ఒక Quantum leap గా భావిస్తున్నాను.

ఆఖరున అసలాయన - అదే రావిశాస్త్రి గారి మాటలు కొన్ని మననం చేద్దాము.

'అబ్బూరి నా ఆదిగురువు' అన్న వ్యాసంలో తన పదవయేట (1932) సెకెండ్ ఫారమ్‌లో తన తరగతిలో చేరిన రాజేశ్వరరావుతో సంభాషణ ఇట్లా జరిగింది:

"దేవుడు లేడు, నీకు తెలుసా?" అని అడిగాడు రాజేశ్వరరావు.

"అదేమిటి దేవుడు లేడు అంటున్నావు?" అన్నాను.

"దేవుడు లేడు" అన్నాడు. మళ్ళీ చాల అధికారపూర్వకంగా తనకా విషయం స్పష్టంగా తెలిసినట్లుగా మాట్లాడితే నేను దేవుడులేడని చాల భయపడిపోయాను. తల్లి తండ్రి లేనివాడిలాగ ఫీల్ అయిపోయాను. అప్పుడు ప్రహ్లాదుడు గురించి రహస్యంగా ఒక చిన్న కథ రాస్తున్నాను. అది రాయడం మాని వేశాను" అని రాశారు రావిశాస్త్రి (వరదస్మృతి - 497 పుట).

'Dear Rajeswara Rao' అంటూ 13-4-93న విశాఖ నుంచి రాసిన ఉత్తరంలో "I wish that there should be God or Gods above us so that I can pray him or them for you to get well sooner than later" అని (వరదస్మృతి - 443 పుట.) రాశారు రావిశాస్త్రి.

1932లో ప్రహ్లాదుడి కథ రాయడం మానేసినా ఆ బుదతదు ఈ అరవై ఏళ్ళకాలమూ శాస్త్రిగారి లోలోపల గూడుకట్టుకొనియే యుండెనా ఏమి-అన్పించక మానదు. అసలీ బంగారయ్యది (ముసలి) ప్రహ్లాదుడుగా మారిన హిరణ్యకశిపుడి కథ కాదుకదా - అన్పించక మానదు.

"ఆయనకు కర్ణుడంటే ఇష్టం!" అని రాశాడు 'రావి'కి అప్తుడయిన ఆకెళ్ళ కృష్ణమూర్తి....కమ్యూనిస్టు పక్షపాతుల్లో రావిశాస్త్రి కర్ణుడా? అన్పిస్తుంది.

"ఔను. కర్ణుడే" అంటాడు మళ్ళీ.

"కాదు. ఆయన అర్జునుడూ ప్లస్ శ్రీకృష్ణ పరమాత్మ" అని 'మూడు కథల బంగారం' చెబుతుంది అంటున్నారు వీరభద్రయ్యగారు.

**The case rests, my Lords!**

22/మే/95 —వాకాటి పాండురంగరావు

భాగ్యనగరం

# విషయసూచి

# ధర్మేతిహాసం – మూడు కథల బంగారం

రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు అల్పజీవి నుంచి ఇల్లు అన్న నవల దాకా, ఏ నవలకు ఆ నవల ఒక విశిష్ట రచనగా సృష్టించారు. ఆయన వామపక్ష అతివాద రచయితల సంఘంలో ముఖ్యుడుగా ఉండడం, నవలల్లో (కథలలో కూడా) వారు మార్క్సిజంవైపుకు మొగ్గి రాయడం వలన ఆయనను మార్క్సిస్టు రచయిత గానే చెప్పాలి. ఐతే, వారి ప్రధాన నవలలైన అల్పజీవి, రాజు - మహిషి, గోవు లొస్తున్నాయి జాగ్రత్త, రత్తాలు - రాంబాబు, మూడు కథల బంగారం, సొమ్ములు పోనాయండి, ఇల్లు అన్న నవలల్లో మార్క్సిజం వాచ్యంగా ఎక్కడా కన్పించదు.

అల్పజీవిలో వస్తువు ఆత్మన్యూనతాభావం. ఈ రకమైన మనస్తత్వం కల్గిన సుబ్బయ్య అన్న పాత్రయొక్క భయాన్ని, అందులోంచి అతడు బైటకు రావాలనుకొని చేసిన ప్రయత్నాన్నీ చిత్రించడంవల్ల ఈ నవల, రావిశాస్త్రిగారి తక్కిన నవలలతో పోలికలేనిది. రాజు-మహిషి అసంపూర్ణమైన నవల సమాజ చిత్రణ ఎంతో వాస్తవికంగా ఉన్న నవల ఇది నాలుగు భాగాలుగా ఉన్న రత్తాలు-రాంబాబు కూడా ఇలాంటి నవలే. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' అన్న రచనకు మరిడి మహాలక్ష్మి లేక గుర్రపు కళ్ళెం అన్న పేర్లు కూడా ఉన్నాయి. కిరీటిరావు అనే దుష్టపాత్ర పెద్దనాయన యొక్క క్రూరజీవితం ఈ రచనకు వస్తువు.

గోవులొస్తున్నాయి జాగ్రత్త రచనలో వర్గ స్పృహ ఉన్నది. పీడిత పీడక వర్గాల ప్రతినిధులైన పాత్రలు ఈ రచనలో ఈ స్పృహ కలిగివున్నట్లు చాలా స్పష్టంగానే పాఠకులకు తెలుస్తుంది. రాజయోగి పెదనాయన పీడకవర్గ పాత్రే అయినప్పటికీ స్పష్టంగా కిరీటితో ఈ రచనలో ఇట్లా అంటాడు:

"అంచేత, కిరీటీ, బతుకునుబట్టి ఎవరికైనాసరే ఆ బతుక్కు తగిన గుండెలుండాలి. బతుకుల్నిబట్టి జాతులేర్పడతాయి. జాతులంటే కులాలు కాదు. జాతులు బతికేమార్గంబట్టి ఏర్పడ్డ జాతులు!...." (పు. 365)

ఇరు వర్గాలవారికీ తమ తమ వర్గాలమీద సానుభూతిని దేశాల ఎల్లలు కూడా దాటి కల్గివుంటారనీ, మధ్యతరగతివాళ్ళు మాత్రం మాటలకు శ్రామిక వర్గంతో ఉన్నా, చేతలకు పీడకులతోనే ఉంటారనీ మరొక చోట ఈ రచనలో కిరీటిరావంటాడు (పు. 381). ఐతే, ఈ రచనలో ఒక రాక్షస ప్రవృత్తి, దాని దుష్ఫలితాన్ని చూపినంత వివరంగా, వర్గ వ్యవహారం చూపబడలేదు. శ్రామిక వర్గం ఏకం కావడానికి కూడా సానుభూతి తప్ప ఆర్థిక వ్యవహారాల పీడన హేతువు కావడమన్నది బొత్తిగా చూపబడలేదు. ఈ రచనలో రావిశాస్త్రిగారి వైఫల్యాన్ని సతార్కికంగా శ్రీ వల్లంపాటి వెంకటసుబ్బయ్యగారు తమ అనుశీలన గ్రంథంలో (72-74 పుటలు) నిరూపించారు.

మార్క్సిస్టుగా గుర్తింపు పొందిన రావిశాస్త్రిగారి ఈ రచనలో వర్గ స్పృహ, వర్గ చైతన్యం, వర్గ సంఘర్షణలు శాస్త్రీయమైన పునాదులపై అగుపించవు. సొమ్ములు పోనాయండి నవల కూడా ఇలాంటిదే. మొత్తం రచయిత యొక్క సమస్త వ్యక్తిత్వాన్ని తీసికొంటే రావిశాస్త్రిగారి మార్క్సిస్టు దృక్కోణానికి 'ఇల్లు' అన్న నవల ఒక కొరకరానికొయ్య. వర్గాలు, వాటి స్వభావాలు, సామాజిక రంగంలో వాటి భేదాలు చెప్పాల్సిన మార్క్సిస్టు ఈ ఇల్లు నవల ద్వారా వాటికి పూర్తిగా వ్యతిరేకమైన కులాలు, వాటిల్లోని శాఖలు, ఆ శాఖల వారికి 'జన్మతః' వచ్చే నైసర్గిక స్వభావాలను తెలిపాడు!

మార్క్సిజం క్షుణ్ణంగా తెలిసిన రావిశాస్త్రిగారు రచనల్లో మార్క్సిజాన్ని బలహీనంగానే చిత్రించారు. ఎక్కడైనా సందర్భం ఉన్నా లేకపోయినా నక్సలిజంపై సానుభూతిని చూపినప్పటికీ అవి కళలో భాగం కాలేకపోయాయి. మూడు కథల బంగారంలోనూ, ఇల్లులోనూ అలాంటివి ఒకటి రెండు దొరుకుతాయి. తాను సృష్టిస్తున్న రచనకు అవి బొత్తిగా సంబంధం లేకుండా ఉన్నవి. అంటే - అవి జీవం పోసుకోలేదన్నమాట.

ఇక మరి మహా రచయితగా తిరుగులేని స్థానం సంపాదించిన రావిశాస్త్రి గారిలో ప్రధానంగా కన్పించేది ఏమిటి? నేటి కాలపు వ్యవస్థలోని పాలనా యంత్రాంగంలోని అమానుషత్వమూ, సమాజంలో వేళ్లూరిన అవినీతి, అధర్మ స్థితీ, పోలీసు వ్యవస్థ యొక్క సంపూర్ణ పతనమూ వారి చిత్రణలో చోటు చేసికొని వారిని ఒక విశిష్ట రచయితగా చేసినవి. వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారన్నట్లు రావిశాస్త్రిగారి పాత్రలు వాచాలురు. కాల్పనిక కవుల, ఒక్కొక్కచోట ప్రాబం

ధికమైన కవితా వర్ణనలు వారి రచనల్లో ఉంటాయి. అయితే ఈ వాచాలత్వమూ, కవిత్వ రీతి రచన మూడు కథల బంగారంలో చక్కగా ఇమిడిపోయినాయి. వారి నవలలన్నింటిలో ఈ మూడు కథల బంగారం శ్రేష్ఠమైందిగా ఈ రచయిత భావిస్తున్నాడు. ఇందులోని శిల్పం ప్రయోజనకరమైంది. రావిశాస్త్రిగారి ప్రతిభ ఈ నవలా రచనలో అదుపులో ఉన్నది. సాధారణంగా ఈ అంశంలో వారి ఇతర నవలల్లో బలహీనత కన్పిస్తుంది. గోవులొస్తున్నాయి జాగ్రత్త రచనలో కిరీటిరావు అన్న దుష్టపాత్రతో కథ చెప్పించడం వల్ల వ్యతిరేక ఫలితాలొచ్చాయి. కాని, ఈ మూడు కథల బంగారంలో చెడిపోయిన పాత్ర అయిన బంగారయ్యతో కథ చెప్పించడం వల్ల సత్ఫలితాలే వచ్చాయి ఈ నవలలోని వర్ణనలు ఈ నవలని కావ్యస్థాయికి చేర్చాయి

రావిశాస్త్రిగారి ఉత్తమోత్తమ సృష్టి ఈ నవల అని కాస్త విశ్లేషణాత్మకంగా చూస్తే ఎవరికైనా తోస్తుంది. మార్క్సిస్ట్ అయినప్పటికీ వర్గద్వేషం కల్గిన వారుగా శాస్త్రిగారు కొన్ని రచనల్లో కన్పించరు. 'తప్పు' అన్న కథ ఇందుకు ఉదాహరణ తన కన్యాయం చేసి, దానివల్ల చావులకు కారణమయిన ఒక లాయరూ, ఒక డాక్టరూ చేతికిచిక్కి, సహజంగానే వారు చచ్చిపోతున్నప్పటికీ, వారిని అలా చావనీయకుండా వారిచే బాధితుడైన పేదపాత్ర మనస్సులో చేసి కొన్న విచికిత్సలో రావిశాస్త్రిగారి హృదయం ఉందనిపిస్తుంది. ఆ పేదపాత్ర నర్సయ్య ఇట్లా అనుకుంటాడు - ''మిమ్మల్ని నేనెందుకు రక్షించాలి? మీ చావు బతుకుల మధ్య దూరి నలిగి మిమ్మల్ని బైటకు బ్రతుకులోకి నేనెందుకు లాగి మీకు సాయపడాలి? మీకు నేను సాయపడను. మిమ్మల్ని ఛస్తే రక్షించను. ఈ సమయంలో నేనుతప్ప మీకు మరో దేవుడు లేడు. మనిషి లేడు. మిమ్మల్ని రక్షించేశక్తి ఇప్పుడు ఇక్కడ నాకుంది మీ ఇళ్ళు, మీ మేడలు, మీ ధన కనక వస్తు వాహనాలు, మీ సంసారాలు కడిగేసి, ఊడ్చేసి మీ మాన ప్రాణాలతో సహా మీ సర్వస్వం సమస్తం నాకు సమర్పిస్తారా? సమర్పిస్తేనే సాయం చేస్తాను. నా శక్తికి నా యిష్టంవచ్చిన విలువ కట్టుకుంటాను అదిస్తేనే మీకు నా సాయం. నేనేం తప్పు చేయటంలేదు. మీరు నా విలువ నాకివ్వలేరా? ఇవ్వకపోతే ఊళ్ళోకి వెళ్ళి ఇంకోణ్ణి తెచ్చుకోండి.' ఆ చీకట్లో అట్లాంటి ఆలోచనలేవో అస్పష్టంగా నరసయ్య మనస్సులో మెదిలాయి. అలా మెదలటమే అతనికి సిగ్గనిపించింది! 'ఛా! తప్పు' అనుకొన్నాడతను.'' (బాకీకథల సంపుటంలో తప్పుకథ-పు. 79)

సామాన్యుడైన పాలెకాపులో తన కుటుంబానికి నష్టం చేసినవారిమీద కూడా ద్వేషం, కసి, హింసాభావం కల్గకుండా దివ్యమైన సంస్కారాన్ని చూపుతున్న రావిశాస్త్రిగారి అసలైన కవి హృదయం ఎక్కడున్నదో స్పష్టపరుస్తున్నది.

రావిశాస్త్రిగారు మానవ ధర్మాన్ని ఆలంబనం చేసికొని రచనలు చేశారు. అందుకు ఈ మూడు కథల బంగారం మంచి ఉదాహరణ పాత్ర చిత్రీకరణలో కాని, మూడు కథలను ఒక్క జీవితంగా అల్లటంలోని నిర్మాణ శిల్పంలో కాని, పాఠకునికి స్పష్టమైన అనుభవాన్ని కల్గించడంలో కాని, ఉప కథలను మూల కథలకు ఆసరాగా నిలపడంలో కాని, సందేశంలో కాని - ఎందులో చూసినా కొరత లేని రచన ఇది.

ఇరవయ్యవ శతాబ్దపు ఉత్తరార్ధంలోని తెలుగు సమాజాన్ని లోతుల్లోకి చూసి చిత్రించిన రచన ఇది. అటు మధ్యతరగతి, ఇటు పతిత సమాజమూ ఎట్లా బ్రతుకుతున్నదీ తెలుసుకోవడానికి ఈ నవల ఎంతగానో తోడ్పడుతుంది. పోలీసు వ్యవస్థనుంచి, ఆసుపత్రి వ్యవస్థదాకా ఎన్నెన్నో రకాల సాంఘిక పరిపాలనా విభాగాలలో భ్రష్టత ఎట్లా చోటు చేసుకొన్నదీ ఈ నవలద్వారా తెలిసికోగల్గుతాము. అందుకే ఈ నవలలోని ఇతివృత్తం నిజంగా ఇతిహాసమే. ఇవేళ మన బ్రతుకులు ఇట్లానే జరుగుతున్నాయి. మహా ప్రతిభావంతుడు కాబట్టి శాస్త్రి గారి చిత్రణను ఎంతో సామర్థ్యంతో చేశారు. ఈ నవలకు పరమార్థం ధర్మ ప్రతిష్ఠాపనే. అవినీతికరమైన బుద్ధిమీద, అన్యాయార్జితంమీద ఈ నవలలోని ప్రధాన పాత్ర విమల గొడ్డలివ్రేటు వేసింది. దొంగ ధర్మాల్ని విరుద్ధామంటూ ఆమె తర్వాతి పాత్ర, ఆమె ప్రభావాన్ని పడనిచ్చుకొన్న పాత్ర, బంగారయ్య అంటంతో ఈ నవల ముగుస్తుంది. పాప పుణ్యాలలో పుణ్యం, నీతి అవినీతులలో నీతి, మంచి చెడ్డలలో మంచి, మానవతా అమానుషత్వాలలో మానవత్వం అన్నవి ధర్మంయొక్క దశాలు. ఈ అన్ని దశాలతో ఈ నవలా కుసుమాన్ని సృజించారు శాస్త్రిగారు.

శాస్త్రిగారు తన మాటలుగా ఏమి చెప్పినప్పటికీ, వారి ఇతివృత్త సంయోజనంలో అధర్మపరుడు తొలగింపబడడమో, సంస్కరింపబడడమో, ధర్మం కోసం పూనుకొనే వాడుగా మారడమో కన్పిస్తున్నది. మూడు కథల బంగారంలో బంగారయ్య అలాంటివాడు.

'దా, దొంగ ధర్మాలన్నీ విరుద్దాం, మంచి ధర్మానికి నారి బిగిద్దాం, సారిద్దాం' (మూడు కథల....పు. 329)

అని బంగారయ్య బైరాగి నాయుడి చెయ్యి పట్టుకుని నడిపిస్తూ తన మనసులో తాననుకొంటాడు

దొంగ ధర్మాలని విరువక పోయినప్పటికీ, మంచి ధర్మానికి ప్రయత్నించక పోయినప్పటికీ నష్టం కలిగేది సమాజానికే కాని ఆ ధర్మానికేమీ నష్టం కల్గదు. అందుచేత మనిషిని ధర్మముఖంగా ప్రేరేపించి, చైతన్యవంతుణ్ణి చేయడంకోసమే గొప్ప రచయిత రచన చేస్తాడు. శాస్త్రిగారు మూడు కథల బంగారం నవలలో చేసిందీపనే. అందుకే ఈ నవల మంచి నవల మాత్రమే కాకుండా చాలా గొప్ప నవలగా కూడా ఎదిగింది.

సొమ్ములు పోనాయండి, రాజు - మహిషి, గోవులొస్తున్నాయి జాగ్రత్త నవలల్లో కూడా ధర్మదృష్టే ప్రధానం. కాని అదే దృష్టి ఈ నవలలో శిల్పరీత్యా చక్కగా పోషించబడింది. అందుకే మూడు కథల బంగారం నవలని ధర్మేతిహాసంగా ఈ రచనలో అనుశీలిస్తున్నాను.

* * *

మూడు కథల బంగారంలో ఒకే పాత్ర మూడు కథల్లోనూ మూడురకాల సాంస్కృతిక నేపథ్యంలో కన్పిస్తాడు. ఒక కథలో బంగారిగాడుగా వ్యవహరిస్తూ ఇట్లా అంటాడు—

"నాలాంటి దొంగలం దేవుడు జెప్పినసరే మంచికి మారం అని జెప్పడవే నా అసలు ఉద్దేసం! దొంగలు కూడ మంచికి మారిపోతుంటారని దొరలైపొయ్యిన దొంగలు సెప్పతుంటరు. అది దొంగమాట అని జెప్పడానికే ఇదంత సెప్పిచ్చేను." (పు. 160) ఇట్లా అన్నప్పటికీ ఈ బంగారిగాడు బంగారయ్యగారుగా రూపాంతరం చెంది విమల వల్ల మార్తాడు. ఐతే, ఇతడు మంచికి మారిం తర్వాతి కథ ఈ నవలలో కన్పించదు. అది కేవలం సూచన మాత్రమే.

ఒక నికృష్ట పరిస్థితిలో ఒక మనిషి బంగారం (అంటే ఐశ్వర్యం) సంపాదించనిదే ఈ లోకంలో కుదరదని నిర్ణయించుకొని, ఆ సంపాదనకోసం ఎంతటి అధర్మపరుడవుతాడన్నది చూపడానికే ఈ నవల. ఐతే, అలా ఎంత అధర్మపరుడైనప్పటికీ అతనిలో దాగి ఉన్న 'మానవత్వం' అనే అంశాన్ని వెలికితీసి

చూపించడానికే శాస్త్రిగారీ నవలలో తమ ప్రతిభను వాడారు. ఆ మానవత్వమే అతణ్ణి ధర్మంవైపుకి ప్రేరేపించింది.

వియత్నాం విమల సాహచర్యం, సాన్నిధ్యం, ప్రభావాలవల్ల బంగారయ్య గారు మంచికి మారి మంచి ధర్మాలకోసం కృషి చేయడానికి నిర్ణయించుకొన్నప్పటికీ, బాహిరమైన ఉద్దీపనాలకన్నా అతని స్వీయమైన విచికిత్స కూడా అతణ్ణి మంచికి తిప్పింది. బంగారయ్యలో ధర్మ దృష్టి కల్గడానికి శాస్త్రిగారు చేసిన సృష్టే ఈ నవలకు ఊపిరి పోసింది. అతనిలో ధర్మ దృష్టికి శాస్త్రిగారు సృష్టించిన పాత్రలూ, సన్నివేశాలన్నింటిలోనూ చాలా సహజమైనదీ, బలమైనదీ బైరాగి నాయుణ్ణి బంగారిగాడిచేత మోసపోయేట్లు చేసిన సన్నివేశం. బంగారయ్యగా రూపాంతరీకరణం చెందిన చివరి కథలోనూ ఈ బైరాగినాయుడు మానసికంగా అతణ్ణి వెన్నాడ్తాడు. నవల ముగింపులో బైరాగినాయుడే ప్రత్యక్షమవుతాడు. రచయిత యొక్క హృదయంలోనూ ఇదే కీలక సన్నివేశం అనడానికి ఇంతకన్నా వేరే సాక్ష్యం అక్కర్లేదు.

దరిద్రుడూ, మంచివాడూ అయిన బైరాగి నాయుణ్ణి మోసం చేస్తుంటే బంగారిగాడికి హృదయం కదిలిపోయింది.

నాయుణ్ణి వర్ణిస్తూ శాస్త్రిగారు—

—''బిడ్డ బతుకోసం పాతిరొచ్చేం సెరుపుకున్న తల్లిలాగ్గ ఉన్నాడా బైరాగి నాయుడు.''

—''ఆడుజూస్తె ఆదినివుడు అన్నట వడుక్కుం టన్నట్టు ఆడున్నడు'' [పు. 142] [ఇవి సూర్రావు పెద్దు అనడం విశేషం.]

బంగారిగాడి సద్బుద్ధికీ, బైరాగినాయుని దివ్యలక్షణ వర్ణనకూ పాఠకుడు కదిలిపోతాడు. మనిషిలో ఉండే మానవత్వాన్ని అంతగా దర్శించి బంగారత్రయాన్ని (ఒక్కడే) సృష్టిస్తారు శాస్త్రిగారు. దీని పరమార్థం తనపాత్రను ధర్మోన్ముఖం చేయడమే. నేరం చేస్తున్నప్పుడు ఆయా పాత్రలెంత క్రౌర్యం కల్గిఉంటారో ఎంతో ప్రతిభావంతంగా చూపిన శాస్త్రిగారు అలాంటి పాత్రల్లోనే ఒక పాత్ర ఇట్లా దివ్యలక్షణాన్ని చూపడాన్ని కూడా ఎంతో సామర్థ్యంతో వర్ణించారు. ఇంత నేర ప్రవృత్తి ఉన్న బంగారిగాడితో బైరాగినాయుణ్ణి మోసం చేస్తూ సూర్రావు అన్నమాటలివి—

—"మనం ఈ సీను జరిపిచ్చినాక్క, పెద్దసీను మరి ఇంకోటి జరిపిచ్చినప్పుడు అప్పుడు ఈడి అయిదేలేగాదు మరొక అయిదేలేసి ఈడికి ఇచ్చిస్సిద్దాం'' [పు. 142]

తర్వాత సూర్రావుకి ఈ మంచితనం నిల్వకపోయినా, ఈ సన్నివేశ బలం అలా నేరప్రవృత్తి ఉన్నవాళ్ళల్లోనూ మానవతాదృష్టి, ధర్మదృష్టి కలిగేట్లు చేసింది. ఇది బంగారిగాడులో ఎక్కువ ప్రభావాన్ని వేసింది. బైరాగినాయుని వెంట ఉన్న అతని కూతురుని చూసి 'సిలక పిట్ట సిన్న పిల్లగ మారినట్టుంది ఆ పాప' (పు 143) అని అనుకొన్న బంగారిగాడు, మోసగింపబడ్డాక బైరాగి నాయుడు ఏడుస్తున్న ఆ కూతుర్ని ఎడం చెయ్యి పుచ్చుకొని పోతుంటే ఆ ఏడుపు సన్నగా వినబడ్తుంటే బంగారిగాడు—

—"ఆ సయ్యిం కాలం, దెబ్బతిన్న ఏదో పిట్టో ఎదో పువ్వో ఏడ్చుకు పోతాపోతా ఉన్నట్టు అనిపించింది నాకు...." (పు. 146) అని అంటాడు. ఇట్లా అనిపించడమే (ఫీలింగ్) అతణ్ణి చివరికి ధర్మోన్ముఖుణ్ణి చేసింది. అతని మనస్సులో విపరీతమైన సంఘర్షణ జరిగింది, అతని మాటల్లోనే చెప్తే—

—"బైరాగినా యిడి ఆపరేసన్ మేం జేసిం తర్వాత నాకు మనసు ఇకలంవై పొయ్యి సెదిరిపొయ్యింది....బైరాగి నాయిడి బతుకు బద్దలైస్సి నన్ను అందలం ఎక్కిచ్చే దేవుడు ఎట్లాటి దేవుడు?....పాపం పెంచడవేంగాని నీతిని పెంచడా ఈ దేవుడు అనిపిచ్చింది నాకు. బైరాగి నాయిడి బిడ్డ యేడుపు నా మనసుని ముక్కల్సేసింది. దేవుడే ఉంటే ఆ బిడ్డ అలా ఎందుకేడాల? దేవుడు ఆ యేడుపుకి ఏటి సమాదానం జెప్తాడు? ఆ యేడుపుని ఎలా సల్లారుస్తాడు?" (పు. 150). అతని మనస్సు వికలం కావడం మంచికే; అతనిలో ధర్మబుద్ధి కక్కడే ప్రాతిపదిక.

అతనిలో నేర బుద్ధికి అతని బంగారంలాంటి చెల్లెల్ని అతని చిన్నబావ బంగారపు దుద్దులకోసం చంపేయడం కారణం అయ్యింది. తన చెల్లెల్ని చంపినవాణ్ణి చంపడం అన్న దానికోసం అతడు పూనుకోకుండా, బంగారం (ఐశ్వర్యం) సంపాదించడం కోసం నేరాల్ని చేయడాని కతడు పూనుకోవడం శాస్త్రిగారి విశేషమైన తీర్పు, అతని చెల్లెలి హత్య తర్వాత అతనికి అతని చెల్లెలిపై ఉన్న ప్రేమ అతని మానవతా లక్షణాన్ని తెల్పుతుంది. అతడెన్ని

పాడు పన్లు చేసినప్పటికీ అతని హృదయంలోని ఈ ప్రేమే అతణ్ణి ధర్మంవైపుకి తోసింది. బైరాగినాయుడి కూతురి ఏడ్పుకూడా అతని జీవుడిలో ఏదో వేదనని కల్గించింది నవల చివరిదాకా ఈ వేదన ఉపశమించకపోవడం ఈ నవలా రచన లోని వైశిష్ట్యం. చిట్టచివరి సన్నివేశంలో విమలను కొండమీద ఎవరో దొంగ హత్య చేశాక ఒక 'ముసలి' బంగారయ్యని అడగుతాడు. ఆ సన్నివేశం ఇలా ఉంది.

''ఏటి బాబూ తగువు? బంగారవేఁనా?''

తలెత్తి చూసేను.

అతను చాలా ముసలివాడు, చాలా నీరసంగా ఉన్నాడు. కట్టుకున్న పంచె పేలికలై పోయింది. చొక్కా లేదు. పేలికలే అయినప్పటికీ తలకి పగిడీ ఉంది. అతను చెడిపోయిన చక్రవర్తిలా ఉన్నాడు. **అతణ్ని ఎక్కడో ఎప్పుడో చూసి నట్టుగుర్తు''** (322&323). బైరాగి నాయుడేనని చెప్పకుండా ఇట్లా శాస్త్రిగారు చెప్తున్నారన్న మాట బైరాగి నాయుణ్నే కాకుండా ఇతరులని చాలా మందిని బంగారి గాడు మోసం చేశాడు కదా - వాళ్ళెవ్వరూ అతనిలో ధర్మదృష్టి కలిగించలేదు. వియత్నాం విమల కూడా నిజానికి అతనిలో ధర్మదృష్టి కలిగించలేదు. ఆమె మీద అతనికి కల్గిన ప్రేమవల్ల ఆమె తనకు దక్కాలంటే తానామెకిష్టమైన పద్ధతిలో నడచుకోవాలి కాబట్టి- మొదట్లో - అతడు ధర్మమార్గాన్ని అనుసరించం ప్రారంభించాడు. నిజానికి అతనిలో ధర్మం వైపుకి సహజంగా పరివర్తనం రావడానికి హేతువు బైరాగి నాయుడూ, అతని చిట్టికూతురూ!

దారిద్ర్యం వల్ల కలిగే బాధలు బంగారిగాడికి (బంగారయ్యకి) తెలుసు. దారిద్ర్యం వల్లనే చిన్నప్పుడు తమ జీవితం ఘోరంగా దెబ్బ తిన్నది. దారిద్ర్యం వల్లనే మంది పంచల్లో తాము చిన్నప్పుడు బ్రతకాల్సివచ్చింది. అప్పుడే బంగారం కోసం తన చెల్లెలు హతమైంది. ఆ దారిద్ర్యాన్ని పోగొట్టుకోవడం కోసం తను తప్పుడు దారి తొక్కాడు. పాపపుణ్యాలు తెలిసికోగల్గే కుటుంబ నేపథ్యం తనకి ఉండీ దారితప్పేదతను. తను 'దూదిపులి' (ఒక పాత్ర) లాంటివాడు కాదు. అతణ్ణి గురించి బంగారిగాడు చెప్తూ-

I "పాపం జేస్తే తప్ప మరిఁక్క బతుకే లేనోళ్ళకి పాపం అంటే ఏటో తెల్దు. గొడ్ల కమేలాల గొడ్లని నరికేవోడికి అలా నరకడం పాపం అంటె ఆడికి

ఏటి తెలుస్ది? అది తప్పని జెప్తె ఆడు ముందు నీకు తోలు ఒలిసేసి ఆ తరాత ఆడి పన్లోకి ఆడు బోతాడు.

II. పాపం అని దెలిసీ కూడ దేసెంల శిన్నోల్ని నిత్తెవూ( దోసుకునీ పెద్దలున్నప్పుడు దేసంల దూదిపుల్లాటి శిన్న శిన్న దొంగలు పావం అంటె ఏటొ తెలకండా నిత్తెవూ( పాపాల్జేస్తుంటరు." (155)

ఇంత వివేకం ఉన్నవాడితను. మరీ బంగారు బాబు (బంగారిగాడు బంగారయ్యగారు) పాపం చేస్తే తప్ప బతుకే లేనివాడా?

ఒకటో బంగారం కథ చివరలో అతడిట్లా అనుకొన్నట్లుగా శాస్త్రిగారు రాస్తారు:

—"బంగారానికి మా చెల్లి బలై పోయింది. బంగారం అది మా నాన్న కష్టం. బంగారం అది మా చెల్లి అందం. అది మా చినబావ దుర్మార్గం. బంగారం అది నా జీవితానికి నాశనం. బంగారం బంగారం బంగారం!!! ....ఆ దినం బంగారం నా జీవితానికి నాందీవాక్యం." (86) తన తండ్రి డబ్బుకి కష్టపడ్డం, తల్లి మెళ్ళో పుస్తెలమ్మాల్సిరావడం మొ॥న చిత్రణ అంతా అతడి మనస్సులో ధనాన్ని గురించి, దాని అవసరాన్ని గురించి పడిన అంశాన్ని ధ్వన్యాత్మకంగా తెలుపుతుంది.

ఐనా పాపం చేస్తే తప్ప మరింక బ్రతుకులేనివాడని చెప్పలేం. ఐతే II వ అంశంలోని మాటల్లో దేశ పరిస్థితిని శాస్త్రిగారు అతని ద్వారా సూచిస్తున్నారు. చిన్న చిన్న సంపాదనలున్నవాళ్ళని దోచుకునే పెద్దలు కల్గిస్తున్న సాంఘికమైన ఒత్తిడి ఇతడిమీద పనిచేసింది. అందువల్ల ఇతడు నేరస్థుడైనాడు.

కాని, ఇంతకన్నా దుస్థితిలో వియత్నాం విమల నేరస్థురాలు కాలేదు.

నేరస్థుడయి ఉండీ అతనిలోని మానవత్వం బైరాగి నాయుడి సంఘటనతో పైకి ఉబికింది.

నేరస్థురాలు కాకుండా, పరమ నీతిపరురాలయి ఉండి కూడా అధర్మ నేపథ్యం ఉందన్న అంశాన్ని మరచిపోలేక తన భర్త అయిన బంగారయ్యను తన మరణానంతరంకూడా జైలుకి పంపించే ఏర్పాటు చేసింది విమల!

ఇద్దరిలోనూ ధర్మదృష్టే పనిచేస్తున్నది. ఐతే, బంగారయ్యలో బైరాగి నాయుడు ఉద్దీపనం కల్గించడమన్నది కళాత్మకంగానూ, మానవ నైజపులోతులు తెలిసిన మహా రచయిత తీర్పుగానూ విశదమవుతుంది.

జీవితానికి ఎదురు తిరిగి ధర్మంతో తన వ్యక్తిత్వాన్ని కాపాడుకొన్నది విమల ఆమెకి అందువల్ల ఎవరి ప్రేరణా అవసరం రాలేదు. కాని, బంగారి బాబు జీవితానికి లొంగిపోయాడు అందువల్ల ఆ ఊబిలోంచి బైటపడడానికి ఆంతరికంగా ప్రేరణ కల్గించింది బైరాగినాయుడి సన్నివేశం బాహిరంగా ప్రేరణ కల్గించింది వియత్నాం విమలతో సంఘటనలు.

ఇట్లా భ్రష్టుడుగా, పతితుడుగా మారిపోయిన బంగారయ్యలో రావిశాస్త్రి గారు దివ్యమానవ దర్శనం చేశారు ఆ దర్శనం ఫలితంగానే అంతటి భ్రష్టుడిలోనూ 'ప్రేమ' ఉద్భవించడాన్ని గమనించారాయన. అదే అటు విమల, ఇటు నాయుడుల ఉత్ప్రేరకాల సాఫల్యానికి దారి తీయిస్తుంది.

ఐతే, బైరాగినాయుడి ప్రేరణ పరోక్షమైంది. అది బైటనుంచి కల్గించిన ప్రేరణ కాదు. బంగారయ్యలో సహజంగా ఉండిన ధర్మం మీద ప్రేమను అది ఉద్దీపింపజేసింది.

పరిస్థితుల ప్రాబల్యం వల్లనే బంగారుబాబు నేరస్థుడుగా, పరోక్ష క్రౌర్యం కలవాడుగా మారినప్పటికీ అతనిలో ఉండిన దివ్యలక్షణాన్ని పట్టుకొని, దాన్ని ఎత్తిచూపి, తన రచననంతా ధర్మం వైపుకి మళ్ళించగలిగారు రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు.

బైరాగి నాయుడి చిన్నకూతురున్ని అతడు 'నీలకపిట్ట సిన్నపిల్లగ మారినట్టుంది. ఆ పాప' (143) అని అనడం, 'దెబ్బతిన్న ఎదో పిట్ట ఎనో పువ్వో ఏడ్చుకు పోతాపోతా ఉన్నట్టు అనిపిచ్చిఁది నాకు ఆ బిడ్డ యేడుపు యింటుంటే!' (146) అని అనడమూ అతడి పితృ హృదయాన్ని ప్రేమ గుండెనీ తెలుపుతోంది. అలాంటి గుండెనే కదా ధర్మానికి పునాది.

జైలునుంచి విడుదలయి బైటకువచ్చాక—
"దార్లో ఒక ముసలాయన నన్ను ఆపేడు.
'ధరమం చెయ్యి బాబూ' అన్నాడు.
నేను ఆగి చూసి అప్పుడు అతనెవరో పోల్చేను,

దేవుడి మెట్టమీద వంగొని నిలబడి 'బంగారం కోసం మనిషి పడని కష్టం లేదు, మనిషి చెయ్యని పాపంలేదు' అని చెప్పింది అతనే, అతను నన్ను ధర్మం చెయ్యమని అడుగుతున్నాడు! సర్వనాశనం అయిపోయినవాడు, ఎవరివల్లనైతే సర్వనాశనం అయిపోయేడో వాణ్నే ధర్మం చెయ్యమంటున్నాడు!" (329)

ఇక్కడ బంగారం కోసం కష్టపడ్డవాడు నాయుడు, దానికోసం పాపం చేసినవాడు బంగారయ్య. ధర్మం తప్పడం వల్లనే బంగారయ్య నాశనమయి పోయాడు బైరాగి నాయుడు నాశనమైనట్లు కన్పిస్తున్నా అంతకన్నా ఎక్కువ నాశనమైపోయింది బంగారయ్యే. నాయుడు అందుకే ధర్మం చెయ్యి అని చెప్ప గలిగే ఉన్నత స్థాయిలో ఉన్నాడు. అట్లా చెప్పిందాన్ని విని తనను తాను విమ ర్శించుకొని ధర్మం ఏదో గ్రహించే స్థితికి బంగారయ్యను చేర్చినవాడు నాయుడు. బంగారయ్య బావగారైన రామచంద్రయ్య పాత్ర ధర్మాన్ని గురించి ముఖతః చెప్పగా, ధర్మానురక్తిని కల్గించడంలో సన్నివేశ సంఘటనల ద్వారా ప్రేరేపిం చిన పాత్ర ఈ బైరాగి నాయుడిది.

* * *

మూడు కథల బంగారం నవలను ధర్మమనే ప్రయోజనం కోసం రచించ డంలో రావిశాస్త్రిగారు ఆలంబనంగా తీసికొన్న మరొక పాత్ర బంగారుబాబు బావ పాత్ర. బంగారుబాబు తండ్రి చనిపోయి దిక్కులేక ఈ బావ ఇంటికి తన తల్లితోనూ, చెల్లితోనూ చేర్తాడు. అతణ్ని గురించి బంగారుబాబు ఆ పరిస్థితిలో అన్నమాట ('భగవంతుడు మమ్మల్ని చూడలేదు, మా బావే మమ్మల్ని ఆదు కున్నాడు........అతని పాత ఇంటి పంచని తడిపక్షులు చేరుకున్నట్టు మేం చేరు కున్నాం. నేనెప్పుడు భగవంతుణ్ని తల్చుకున్నా అతడు నాకు మా బావ రూపంలోనే కనిపిస్తాడు' (63, 64). ఇక్కడ రావిశాస్త్రిగారు దేవుడి విషయాన్ని విచిత్రంగా తెచ్చారు. భగవదస్తిత్వం మీద శాస్త్రిగారికి సదసత్సంశయమా? అనిపిస్తుంది కాని, దైవాన్ని ధర్మంగా ఆయన ఒప్పుకుంటున్నట్లే అనిపిస్తుంది. బంగారిగాడి కథలో అతనితో శాస్త్రిగారిట్లా అనిపిస్తారు:

—'దేవుడూసు ఒచ్చిఁది గాబట్టి సెప్పుతన్నాను. దేఁవుడిమీది నమ్మకం నాకు సిన్నప్పుడే పొయ్యింది కానైతే పెద్దలు సెయ్యిఁచ్చిన చిన్నప్పటి అల వోటుమీద ఎద్దైన గుడి అవుపిస్తె ఓ దండం పారేస్తంటాను దేఁవుడికి' (147) బంగారుబాబు చిన్నప్పుడు అనుభవించిన విషాదపరిస్థితుల కారణంగా అతను

దేవుడిని ఒక మూర్తిగా, ఒక 'వ్యక్తి'గా నమ్మలేకపోయాడు. కాని పాపం పుణ్యం, మంచి చెడూ, నీతి అవినీతి ఇత్యాది సదసత్తులలో సత్‌ని మొత్తంగా అతడు భగవంతునిగా భావించాడని చెప్పవచ్చు. తన భావని అతడు మూర్తీభవించిన సత్పురుషునిగా నిర్ణయించుకొని, అతణ్ని భగవంతుని రూపంగా భావించాడు. బంగారుబాబు త్రయం మీద ఈ బావ పాత్రకున్న ధర్మ ప్రభావం అలాంటిది. ఈ పాత్ర ఒకటో కథలోనూ, మూడవ బంగారం కథలోనూ వస్తుంది. ఈ పాత్రకు ఫలాని పేరని 258 వ పుటలో కాని మనకు తెలీదు. 174 వ పేజీలు ఈ పేరు వస్తుంది కాని, బంగారయ్యకీయనే బావగారని తెలీదు. శాస్త్రి గారి పాత్రకు పెట్టిన పేరు రామచంద్రయ్య ఈ నవలలో. రామచంద్రుణ్ని ధర్మ సూచనకు వాడుకొన్నారు శాస్త్రిగారు. (ఈ విషయం తర్వాత చర్చకు వస్తుంది.) దాన్లో భాగంగానే ఈ బావ పాత్రకీ పేరు పెట్టారు రచయిత. విమల బంగారయ్యను వివాహం చేసికోవడానికి అంగీకరించడంలో ఈ రామచంద్రయ్య మీద ఆమెకు కల్గిన గౌరవమే పనిచేసిందంటే ఈ పాత్ర ఎంత ధర్మమూర్తో గ్రహించవచ్చును. ఎట్టి పరిస్థితిలోనూ ధర్మానికి అర అంగుళం కూడా అటూ ఇటూ జరగని విమలకే ఆదర్శంగా నిల్చిన పాత్ర ఈ రామచంద్రయ్యది. మెత్తగా, సాత్వికుడుగా తీర్చబడిన ఈ పాత్ర ముఖ్య సన్నివేశాలలో ఆ రామ చంద్రుని అంత కఠినంగానూ ఉండగలడన్నట్లుగానే శాస్త్రిగారు చిత్రించారు. ఈ పాత్ర ముఖ కవళికల్ని వర్ణిస్తూ రచయిత—

—"బాధలు పడినప్పటికీ నీతి తప్పకుండా నిజాయితీగా. నిశ్చలంగా ఉండగలిగిన వాళ్ళల్లో అదొక విధమైన తేజస్సు ఉంటుంది. గుండె జబ్బు పడి లేచేక మా ముసలి బావలో ఆ తేజస్సు ఎక్కువయింది" (258) అని అంటారు. ఇందువల్లనే ధర్మం అన్నది ఆధ్యాత్మిక సంబంధమైనదని వ్యాసం మొదట్లో రాశాను. ఇట్లాంటి వాళ్ళే లోకానికి ఆదర్శం కాగల్గినవాళ్లు, నాయకులు కావాల్సినవాళ్లు - అని శాస్త్రిగారి హృదయం. అందుకే హృద్రోగంలోంచి లేచి విశ్రాంతి తీసికోనంటున్న రామచంద్రయ్యతో విమల—

—''ఇలా నేను చెప్తున్నానంటే అది మీ ఒక్కరి మంచికోసమే చెప్పడం లేదు లోకంలో మీలాంటి మంచివాళ్ళు నాలుక్కాలాలు నిలబడి ఉండడం లోకానికి మంచిది. అందుకూ చెప్తున్నాను'' (259)

అని అంటుంది. దేనికీ ఉద్యమించకుండా, కేవలం తనవరకు తాను చెడుని కానీ పాపాన్నీ కానీ చేయకుండా ఉండే పాత్ర ఎట్లా తన ప్రభావాన్ని వేయగల్గుతుంది? ఉత్తముడి యొక్క ప్రభావం ఆధ్యాత్మికమే కాని, భౌతికం కాదు. ఒకడి ఉత్తమ శీలసంపదే కన్పించని విధంగా అతని చుట్టూతా ఉండే వాళ్ళమీద సత్ప్రభావాన్ని వేస్తుందని శాస్త్రిగారు నమ్ముతున్నట్లుగా అన్పిస్తుంది పై మాటల్ని చదువుతుంటే.

విమల పాత్రను బ్రహ్మనైనా ధిక్కరించే మొండి పాత్రగా తీర్చిన శాస్త్రిగారు ఆమెలో సాధారణ స్త్రీలలో కన్పించని వ్యక్తిత్వస్పృహని నింపారు. అలాంటి పాత్రకూడా రామచంద్రయ్య కిచ్చిన విలువకి బంగారయ్యే ఆశ్చర్య పోయాడని ఈ క్రింది మాటలు తెల్పుతాయి:

—''నేను కాని మా బావకాని ఊహించని విధంగా తను అలా చేస్తుందని మాకు చిన్నమెత్తు వార్నింగైనా లేకుండా, అకస్మాత్తుగా మోకరిల్లి మా బావ పాదాల్ని రెండు చేతుల్తోనూ తాకి, ఆ చేతులు కళ్ళకి అద్దుకొని, లేచి నిలబడి, తడికళ్ళతో నావైపు చూసి నవ్వి, మరేమీ మాట్లాడకుండా గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది'' (259).

ఈ వర్ణన ఈ నవలలో ఆదర్శాన్ని ప్రతిష్ఠాపించే పాత్రగా తీర్చబడిన విమలకు కూడా మరోవ్యక్తి ప్రేరణ ఉందని చెప్పడానికే.

ఇంతకీ నవలలో విమలా రామచంద్రయ్యల మధ్యన జరిగిన సంభాషణలు లేనేలేవు బంగారుబాబుని గురించి రామచంద్రయ్య విమలతో ప్రస్తావించిన విషయం పరోక్షంగా మాత్రమే ఉంది. బంగారయ్యతో అనుపల్లి సన్నివేశంలో రామచంద్రయ్య మాట్లాడిన మాటలే రామచంద్రయ్య ధర్మపక్షపాతాన్ని గ్రహించ డానికీ, బేరీజు వేయడానికీ ఆధారాలు. ఇదికాకుండ ఒకటోకథలో అతని ప్రవర్తన, కష్టాలలో కూడా అతడు చూపించిన కారుణ్యం, మానవత, నైతికత అన్నవి కూడా ఆ పాత్ర ధర్మమూర్తిగా మనకు కన్పించడానికి హేతువులు.

"అందుకే మా బావంటే గౌరవం" అని బంగారయ్య అన్నప్పుడు "మీ బావంటే నీకు గౌరవం లేకనేపోతే నువ్వంటే నాకు ఏ గౌరవం కూడా లేనే లేకపోను బంగారూ!" [267] అని విమలచేత శాస్త్రిగారనిపించడం ఈ నవలలోని ముఖ్యపాత్రల త్రిభుజాన్ని వ్యాఖ్యానించడమే. ఈ త్రిభుజంలో

అడుగురేఖ రామచంద్రయ్యనే. దానికి ఒకవైపు నుంచి విమల, మరొకవైపు నుంచి బంగారయ్య లేచి, ఆదర్శ కేంద్రంలో పైన కలుస్తారు.




రామచంద్రయ్యే ఆశ్రయం ఇయ్యకపోయివుంటే మొదటి కథలోనే బంగారుబాబు బ్రతుకు ముగిసి ఉండేది. ధర్మాన్ని రక్షించుకుంటూ మనుగడ సాగించుకోకపోతే విమల, పురుషుల కామానికి దగ్ధమయి, వ్యక్తిత్వంలేని బానిస అయి ఉండేది. బంగారయ్యని చేబట్టడానికి రామచంద్రయ్య తనకు తెలిసినంత వరకు అతని పూర్వజీవితాన్ని గురించి చెప్పి ఉండడమే. ఆ కథనం ద్వారా బంగారయ్యలో మౌలికంగా ధర్మానురక్తి ఉందని ఆమె గ్రహించ గల్గడమే.

రామచంద్రయ్య ఈ ధర్మేతిహాసానికి పునాది అంటున్నాం. అతడి ఆచరణ, అతని మాటలీ విషయాన్ని స్పష్టపరుస్తాయి. బంగారయ్యతో మహానుభావుడైన రామచంద్రయ్య అన్న ఈ కింది మాటల్ని పరిశీలించండి:

—"లోకంలో బాధ ఉంది. బుద్ధుడే చెప్పేడు ఆ మాట. మరింక ఈ బతుకులో నువ్వూ బాధలు పడ్డావు, నేనూ బాధలు పడ్డాను. అయితే బాధలు పడ్డవాళ్ళంతా ఆ మిషతో పాపాల్లోకి దిగి పోనక్కర్లేదు" (261). మరేం చెయ్యాలి? ఏం చెయ్యాలంటే విమలలాగా ఎదిరించి బ్రదకాలి. ధర్మాన్ని పట్టుకొని బ్రదకాలి. అందుకే శాస్త్రిగారా పాత్రను సృష్టించారు. అంతేకాకుండా, "లోకంలో పాప పుణ్యాలు నిర్ణయించడానికి నేనేం భగవంతుణ్ణి కాను ....

అసలు నేనే భగవంతుణ్నయితే ఈ లోకంలో ఇంత పాపాన్నీ దరిద్రాన్నీ, దౌర్భాగ్యాన్నీ సృష్టించనే సృష్టించను" (261)—

అని అంటాడు. పాపపుణ్యాలు ఏవో నిర్ణయించకుండా పాపం చేయవద్దని ఎట్లా ప్రబోధిస్తున్నాడీయన? ఒకళ్ళకి బోధించాల్సిరావడంవల్ల తాను అహంకారి అని అనుకోకుండా ఉండడం కోసం వినయంతో అన్న మాటలివి. పాప పుణ్యా లెవ్వరో శాసించి అనుసరించేట్లు చేయడం కన్నా, ప్రతివ్యక్తీ తన ఆత్మ ప్రేరణ తోనే ధర్మానుసరణం చేయాలి. ఇతరులకు దారిద్ర్యం, దౌర్భాగ్యం మన ఏ పనుల వల్ల కలుగుతుందో అదే పాపం. అదే అధర్మం శాస్త్రిగారి హృదయంలో ఇట్లా ఉందని మనం గ్రహించవచ్చును. బైరాగినాయుడి ఘట్టంలో సరిగ్గా ఇదే అంశం బంగారిగాడిలో అవ్యక్తంగా స్ఫురించినట్లుగా ఉంది. విఫలమయిన తన మొదటి వివాహఘట్టంలో విమల తాను బలికాబోతూనే తనలో వెలిగించికొన్న సత్యం ఇది.

ఐతే బుద్ధుడు తన తొలి జీవితంలో బాధల్ని చూశాడు కాని, పడలేదు. బాధలు పడుతున్న పాత్రలు ఎట్లా ప్రవర్తిస్తాయి? అంటే - సచేతనంగా జీవితాన్ని అనుభవిస్తున్న పాత్రలు బాధలకెట్లా స్పందిస్తాయి? బంగారుబాబు లాగానా? విమల లాగానా? రామచంద్రయ్య చూపించి, అంగీకరిస్తున్న మార్గం విమలది. శాస్త్రిగారి రచయితృ హృదయం ఈ రామచంద్రయ్యలోనే ఉంది.

రామచంద్రయ్య ప్రకారం పాపాల్లోకి దిగడం ఒట్టి మిష. దిగకుండా కూడా వ్యక్తి మానవ ధర్మాన్ని పట్టుకొని జీవించగలుతాడు. పాపాల్లోకి దిగడం-దిగకపోవడం అన్న రెండింటిలో ఏది ఉత్తమమో చెప్పనక్కర్లేదు. బంగారు బాబు బుద్ధిపూర్వకంగానే పాపాల్లోకి దిగినవాడు. విమల బుద్ధిపూర్వకంగానే పాపకూపంలో పడకుండా ఎదిరించి, ఉన్నతంగా నిల్చింది. రామచంద్రయ్య బంగారుబాబుతో ఇలా అంటాడు:

— I. "....నువ్వు ఇతరుల్ని బాధించేవు. అమాయకుల్ని బాధించే వాళ్ళని మాత్రం నువ్వు బాధిస్తే నేనంత పెద్దగా విచారించకపోదును. కాని, నువ్వు కొందరు దుర్మార్గుల్నే కాకుండా ఎంతోమంది అమాయకుల్ని కూడా బాధించేవు. అందుకే నేను విచారిస్తుంటాను. కానైతే ఇతరుల్ని బాధపెట్టి నువ్వు భాగ్యవంతుడివయేవు." (261)

— II. "ఒరే బంగారుబాబూ, అమాయకుల్ని బాధపెట్టడం అది అన్యాయం కాదా, అది మహాపాపం కాదా? పాపవేఁవదు! నువ్వేకాదు, నేనేకాదు ఎవరు పాపాలు చేసినా ఆ పాపాలన్నీ చివరికి ఏమైపోతాయి?" (262)

పై రెండు అంశాల్లోనూ ధర్మాన్ని గురించి పాపంమీది వివేచనవ్యాజంగా మౌలికాంశాల్ని ప్రతిపాదించారు.

(1) అమాయకుల్ని బాధపెట్టకూడదు. అది మహాపాపం. అలా చేసే అధికారం ఎవ్వరికీ లేదు. ఎవ్వరు పాపం చేసినా చివరికి వాటి ఫలితం ఏమిటి? అదెవ్వరికి దక్కుతుంది? పాపం చేసినవాడికా? తత్పర్యవసానాన్ని అనుభవించిన వాడికా?

(2) అమాయకుల్ని బాధించకూడదు. వాళ్ళని బాధించేవాళ్ళని బాధించితే తనకంత పెద్ద విచారం లేదు. ఇతరుల్ని బాధించి భాగ్యవంతులు కావడం అధర్మం.

వెరశి ఎవ్వరినీ బాధించకూడదన్నదే రామచంద్రయ్య ఆదర్శం. అమాయకుల్ని బాధించేవాళ్ళని బాధించడం కాస్త ఫర్వాలేదు. ఐశ్వర్యాన్ని సంపాదించడానికి అధర్మం మూలంలో ఉండకూడదు.

పాపం అన్నది అధర్మాచరణకు మూలం. పాపం కేవలం ఆలోచనవరకే పరిమితమయి ఉండేది కాదు. పాపచింతన ఆచరణలోకి వస్తేనే ఇతరులకు బాధ. మానవ ధర్మాన్ని తప్పించుకొని అడ్డుదారి తొక్కడం, ఇతరులకన్నా ప్రగతిపథంలో తాను అన్యాయంగా ముందుకి రావడం అన్నది పాపం యొక్క ఫలితాలలో ఒక పక్షం.

ఈ మొదటి పక్షాన్ని సాధించడం కోసం ఇతరులను వికలురుగా చేయడం, వాళ్ళ 'శక్తి'ని ఊడబెరికి వేయడం, వాళ్ళని కాపాడాల్సిన వ్యవస్థను అవినీతి పాలుచేసి ధర్మం యొక్క విశాల భిత్తికను కకావికలు చేయడం పాపం యొక్క రెండవ పక్షం. ఈ పక్షమే ఆ ఇతరుల్ని బాధిస్తుంది. దుఃఖితుల్ని చేస్తుంది. తిరుగబడేట్లు చేస్తుంది. ఈ పాపి తాను చెడడమే కాకుండా, తన స్వార్థానికి అడ్డం వచ్చే వ్యవస్థను కూడా చెరచడం వల్ల, సమాజానికి వినాశాన్ని తెచ్చిపెడ్తాడు. తత్సిద్ధికోసం వ్యవస్థకు మూలస్తంభాలైన రక్షణ, న్యాయవ్యవస్థలను కుంటుపరుస్తాడు.

మరి ఆ వ్యవస్థలలోని వాళ్ళు ఎందుకు ఈ పాపియొక్క జాలంలో పడాలి? మనిషిలోఉండే రెండు పక్షాలు - దైవ, అసురీ - పక్షాలు విచిత్రమైనవి. పూనికతోనే సిద్ధించేది దైవపక్షం. ఊరకనే ప్రలోభపెట్టగలిగేది అసురీ పక్షం. బంగారు (త్రయం) బాబులు అట్లా ప్రలోభంలో పడి తాత్కాలికంగా అసురీ పక్షంలో నిలిచారు. దీన్లోంచి పైకి తేవడం కోసమే ధర్మ దృష్టిని అంతర్లీనంగా కళాత్మకంగా ఈ ధర్మేతిహాసంలో ఇమిడ్చి శాస్త్రిగారు ఈ నవలను అగ్రశ్రేణి నవలగా రూపొందించారు. ఈ నవలలో అంతర్లీనంగా ధర్మ దృష్టి ఎంతో గాఢంగా, బలిష్ఠంగా ఉన్నప్పటికీ అది ఎక్కడా వాచ్యం చేయబడలేదు. దాన్ని 99% కళాత్మకంగానే తీర్చిదిద్దినా. రామచంద్రయ్య పాత్ర ముఖతః మాత్రమే వాచ్యంగా చెప్పించారు శాస్త్రిగారు. విమల ఇంకంటాక్స్ అధికారులచేత ధర్మం కోసం తన భర్తమీదికే తన మరణానంతరం రెయిడ్ చేయించగా, పాత బంగారుత్రయం రక్షకభటశాఖ మొత్తాన్ని అధర్మం కోసం ఊడిగం చేయించారు! పుణ్యపాపాలను ధర్మంకోసం విచిత్రమైన, విశిష్టమైన రీతిలో గొప్పగా చిత్రించారు శాస్త్రిగారు.

పై ఉటంకింపులో ఉన్న 'ఆ పాపాలన్నీ చివరికి ఏమైపోతాయి?' అన్నది పాపం మీద రామచంద్రయ్య స్పష్టమైన నిర్ణయం తీసికోవడానికి ఆధారమైన సోపానం. పాపంచేస్తే దాని దుష్ఫలితాన్ని అనుభవించేవాడు ఒకడుంటాడు. వాడి విషయంలో పాపంచేస్తే సుఖపడేవాడు మరొకడుంటాడు. ఈ చేసిన పాపం ఏమైందిక్కడ? అన్నది ప్రశ్న. పాపఫలం ఒకణ్ని చెరిచింది. పాపం చేసినవాడి కేమీ కాలేదు. మరి పాపం చేసినవాడికిక నిష్కృతి లేనే లేదా? చేసిన పాపం నుంచి వాడు తప్పించుకోనే లేడా? దైవాలకు దండం పెట్టి, మొక్కులు మొక్కి పాపాన్ని పోగొట్టుకోలేడా? ఇక్కడే మహారచయితగా శాస్త్రిగారు రామచంద్రయ్య ద్వారా గొప్పసందేశాన్ని వివేచనాత్మకంగా ఇచ్చారు.

—''ఆ చేసిన పాపాలన్నింటినీ ఏ దేవాలయంలోకో, ఏ చర్చిలోకో ఏ మశీదులోకో మనం తీసుకుపోయి పశ్చాత్తాపపు కన్నీటితో మనం కడిగేసుకో వచ్చు. కాని, అంతమాత్రంచేత మనం చేసిన పాపాలవల్ల పైవాళ్ళకి కలిగిన ఫలితాలు మాత్రం ఎన్నటికీపోవు నేను నీ చెయ్యి నరికేసి ఆ తరువాత భద్రాచలం పోయి భగవంతుడి పాదాలమీద నా తల ఆన్చి నీ చెయ్యి నరికేసిన

పాపాన్ని నేను దించేసుకోవచ్చు. కాని అంతమాత్రంచేత నీ ఒంటికి మరో కొత్త చెయ్యి చిగురించదు కదా!" (262.)

తత్త్వశాస్త్రాలు, మత గ్రంథాలు, వేదాంతం ఈ సమస్యని ఒక్కొక్క దృక్కోణం నుంచి చూసి ఒక్కో సమాధానం ఇచ్చాయి. పాపం మనస్సుకే కాని శరీరంది కాదన్నారు. పశ్చాత్తాపంచేత చిత్తశుద్ధి కల్గడంలో పాపం కడిగి వేయబడ్తుందన్నారు. అట్లాకాదు - చర్చిగోడల మీద రాస్తున్నట్లుగా - నీ పాపం నిన్ను పట్టుకొనును అన్న పద్ధతి ఉన్నది. నీ పాపాలను చిత్రగుప్తుడు తన చిట్టాలో రాస్తాడు - కాబట్టి తప్పు చేయవాకు అని అన్నారు. పాపం చేయవాకు కాని, చేసినప్పటికీ ఇదిగో ఈ గ్రంథాన్ని శ్రద్ధగా ఒక మండలం రోజులు పారాయణం చెయ్యి, అది పోతుందని ఫలశ్రుతి చెప్పే అనేక మత గ్రంథాలు ఉన్నాయి. ఈ నేపథ్యంతో చూస్తే పాపాన్ని గురించి శాస్త్రిగారు చెప్పించింది కొత్తదీ, ప్రయోజనవంతమైనదీ, తార్కికమైనదీ కూడాను. పాపంచేసి దండాలు దస్కాలతోనో, పశ్చాత్తాపంతోనో పోగొట్టుకుంటే చేసినవాడికది పోయినట్లు గుర్తేమిటి? వాటి పాపం వల్ల పైవాళ్ళకి కలిగిన ఫలితాలు పోతాయా? రామచంద్రయ్య మాటల్లోనే చెప్పాల్సివస్తే—

—"నా తమ్ముడు నీ చెల్లిని చంపేసి జెయిలు పాలయేడు....వాడు.... జెయిల్లో సాధు జంతువై పోయి ఆరేడేళ్ళల్లో విడుదల సాధించుకొని, బైటికివచ్చేక కాశీకిపోయి సన్న్యసించి, గుండు చేయించుకొని గంగలో మునిగి ఇప్పుడు ఏరుషికేశంలోనో ఏ స్వాములవారికో శుశ్రూష చేస్తున్నాడు. అంతా బాగుంది. అయితే- వాడి పాపాలన్నీ గంగతోపాటు బంగాళాఖాతంలోకి పోయి అక్కడ మునిగి పోయి ఉండొచ్చు. కాని, అందువల్ల నీ చిన్నారి చెల్లికి తిరిగి ప్రాణాలు రాలేదు కదా!" (262)

పుణ్యం యొక్క ఆవశ్యకత, పాపం ఎందుకు చేయకూడదు అన్న విషయాలను ఇట్లా చెప్పాల్సిన పద్ధతిలో చెప్పాడు రామచంద్రయ్య. బంగారయ్య ప్రాణం అతని చెల్లెలు. ఆమె హత్యాఘట్టంలో ఇమిడ్చి పాపాన్ని గురించిన తన అభిప్రాయాన్ని విడమర్చడం వల్ల బంగారయ్యకు ధర్మంమీద అస్థ హృదయ దఘ్నంగా కలిగింది. తత్కారణంగానే చివరిఘట్టాల్లో తనతో విమల 'అమానుషంగా' ప్రవర్తించినపటికీ అదంతాకూడా ఆమె ధర్మపక్షపాతంగా గ్రహించ గలిగి బంగారయ్య తనలో మార్పుని తెచ్చుకున్నాడు. దీనికంతా భూమికను

సిద్ధం చేసిన మహానుభావుడు రామచంద్రయ్య. ఇది బంగారయ్యలో జీవలక్షణంగా తయారైందని నవల చివర్న ఉన్న వాక్యాలు తెలుపుతున్నాయి:

''బైరాగి నాయుణ్ని చూడగానే, జెయిలుకి వెళ్ళి నా పాపాలన్నీ కడిగేసుకున్నాననే నా నమ్మకం నాకు సడలిపోయింది.

నా పాపాలు పూర్తిగా పోలేదు. పోలేదు అని నామట్టుకి నాకే తెలిసిపోయింది.

**అయితే—**

నీవైనా నావైనా పాపాలన్నీ ఎలా పోతాయి?

అందుకు సమాధానం—

నువ్వూ నేనూ చేసిన పాపాలవల్ల ఎవరైతే నష్టపడ్డారో కష్టపడ్డారో బాధపడ్డారో—

వారే చెప్పాలి! అంతేకాని, నువ్వూకాదు నేనూకాదు, భగవంతుడైనా కాదు." (330)

తాను చేసిన పాపాలు పోలేదన్న విషయం తనకే తెలిసిపోయిందని బంగారయ్య అనడం రావిశాస్త్రిగారు బోధించదల్చుకున్న ధర్మ ప్రబోధం సాఫల్యాన్ని పొందడం. పాఠకులకూ అది తప్పనిసరిగా ఎక్కుతుంది. బంగారయ్యమీద సానుభూతి జాలీ చూపిస్తూనే అతడు చేసికొన్న నిర్ణయాన్ని వారంగీకరిస్తారు. ఈ నవల సాధించిన ప్రయోజనం ఇదే.

"పరమేశ్వరుడు పాపుల్ని క్షమించి రక్షించడమేఁ చూసేను కాని, ఆ పాపుల పాదాల కింద నలిగిపోయిన వాళ్ళని ఆ లోకరక్షకుడు లేవనెత్తడం నేను ఇంతవరకూ చూళ్ళేదు'' (266)—

అని రామచంద్రయ్య ఒకచోట చెప్పడం కూడా ఈ నవల సాధించిన ధర్మమన్న ప్రయోజనాన్ని కాపాడేదే.

ఇట్లా ధర్మవిషయాన్ని పాపపుణ్యాల వివేచన ద్వారా చాలా స్పష్టంగానూ, నిర్దుష్టంగానూ, ప్రయోజనవంతంగానూ రామచంద్రయ్య పాత్ర ద్వారా శాస్త్రిగారు చిత్రీకరించారు. ఈ పాత్ర ద్వారా ధర్మవిషయంగా పలికించిందాంట్లో చాలావరకు వాచ్యంగానే, ప్రబోధరూపంగానే జరిగింది. ఒకటోకథలో మాత్రమే

రామచంద్రయ్య జీవిత చిత్రణం ద్వారా శాస్త్రిగారు పరోక్షంగా ధర్మదృష్టిని ప్రతిపాదించారు. సుదీర్ఘమైన జీవిత చిత్రణను కళాత్మకంగా చిత్రిస్తున్నప్పుడు రచన అంతంలో కొంత ప్రబోధాన్ని వాచ్యంగా రచించినప్పటికీ నవలా ప్రక్రియ ఓర్చుకుంటుంది. అందువల్ల చివరిభాగాల్లోని ధర్మప్రబోధం ఈ రచన యొక్క కళావిలువల్ని ఏమీ తగ్గించకుండానే సత్ప్రభావాన్ని వేస్తున్నది.

బంగారుబాబు తండ్రి చచ్చిపోయి అతనూ, అతని తల్లీ, చెల్లీ దిక్కులేని పక్షులైనప్పుడు రామచంద్రయ్య అతని సవతల్లిని కూడా లెక్కచెయ్యకుండా ఈ ముగ్గుర్నీ తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు. రామచంద్రయ్య తన అత్తగారు పుస్తెలతాడు చెరిపించి తన భార్యకీ మరదలికీ (బంగారుబాబు చెల్లెలికి) బంగారు గాజులు చేయించినప్పుడు అంతా మరదలికివ్వక తన భార్యకి కూడా ఎందుకని బాధపడ్డాడు. రామచంద్రయ్య భార్య (బంగారుబాబు అక్క) బావిలో దూకి చనిపోయిన తర్వాత తనగతీ తన చెల్లెలిగతీ ఏమిటని బంగారుబాబు బాధపడ్డా, రామచంద్రయ్య వాళ్ళని ఇంట్లోంచి పంపించెయ్యలేదు. అతడు పునర్వివాహం చేసికొన్నప్పటికీ, పంపించేయకపోగా—

—"ఒరే బాబూ, బంగారం! నీకు ఎస్సెల్సీ చెప్పించేస్తాను. అది ఖాయం! ఈలోగా టైపింగు కూడా నేర్చేసుకో! ఆ తర్వాత ఏదో ఒక ఉద్యోగం చూద్దాం. నేను చూస్తాను, నువ్వుకూడా చూడు. ఎంత వేగిరం దొరికితే అంత మంచిది మనకి" (72) అని అంటాడు. దీన్ని బంగారుబాబు ఎట్లా వ్యాఖ్యానించుకొన్నా అతనికి ఉద్యోగం దొరకడం ఆ కుటుంబం మొత్తానికి మంచిదనే భావమే ఉంది. ఈ పెళ్ళికి ముందు తన చెల్లి భవిష్యత్తును గురించి బంగారుబాబు భయం వెలిబుస్తే—

—"చెల్లి కొచ్చిన భయం ఏమిటుంది? దానికేం ఫరవాలేదు. అయినా, నీకు ఏదో ఒక నౌఖిరీ దొరక్కపోదు. నౌఖిరీ దొరికేక అన్ని విషయాలూ ఆలోచించుకుందాం'' (73)—

అని అభయమిస్తాడు. దీనికప్పుడు బంగారుబాబు ఎట్లా వ్యాఖ్యానించు కొన్నా, ఈ మాటలన్నీ రామచంద్రయ్య ఔదార్యాన్నీ మానవత్వాన్నీ నిరూపించేవే. రామచంద్రయ్య రెండవ భార్యా పిల్లలతోనూ క్రుమ్మగ్గి ఉన్నప్పుడు గడప ఉడిగిన అతణ్ని భార్య నడపీనుగలాగా చూస్తూ నానా మాటలూ అంటుంటే,

బంగారయ్య "కాసులు చేరడం చేరకపోవడంబట్టి కుటుంబ సభ్యుల సంబంధాలు కూడా మారుతుంటాయి" (174) అని వ్యాఖ్యానించాడు. కాని, రామచంద్రయ్య మాత్రం తన కుటుంబ సంబంధాల్లో కాని, మానవ సంబంధాల్లో కాని ఎన్నడూ కాసుల్నిబట్టి ఇచ్చే విలువల్ని మార్చని ధర్మవీరుడు. దగ్గరి బంధువైనా బంగారయ్య పాపాలని ఏమాత్రం అంగీకరించనివాడు. తనకామె ఏమీ కాక పోయినా విమలను ఆమెకున్న ధర్మప్రవృత్తిచేత సంపూర్ణంగా ఆశీర్వదించినవాడు. ఈ నవలలోని ఇతివృత్తాన్ని నడిపిన రెండు సజీవ పాత్రలకు ధర్మం అన్న ఊపిరిపోసినవాడు.

* * *

ఈ ధర్మేతిహాసంలో ధర్మం అన్న ఆదర్శ బిందువుని స్పృశించిన పాత్రల్లో ముఖ్యాతి ముఖ్యపాత్ర విమల. వీరవల్లి విమల ఆమె పేరంటూ ఈ నవలని ప్రారంభిస్తాడు రచయిత. బంగారు బాబు యొక్క మూడు కథల్ని రాయడానికి ముందు వియత్నాం విమల వృత్తాంతం అని శాస్త్రిగారు ఈమె కథని రాశారు. ఈమె కథ తర్వాతివే తక్కిన మూడు కథలు. మళ్ళీ మూడవ బంగారం కథలో రెండవ సగం మొత్తం - బంగారయ్యతో కలిసిన ఈమె కథను రాశారు శాస్త్రి గారు. విమల వృత్తాంతంగా రాసిన తొలిభాగంలో మొదటి ఘట్టాల్లో కూడా ఈమె సాధారణ స్త్రీ కాదు. ఆమె అక్క సరళ దాసువల్ల మోసగింపబడి ఆత్మహత్య చేసికోవాల్సి రావడం, తన చిన్నక్క మొగుడు కామంతో తనని కూడా పెళ్ళాడేస్తాననడం, దారిద్ర్యం, చివరకు పీటలమీది తన పెళ్ళి కట్నం ఇచ్చుకోలేని కారణంగా ఆగిపోవడం - ఇవన్నీ ఆమెను ఇంకా ఇంకా వీరనారిగా, ఆదర్శ స్త్రీగా, ధర్మవీరాంగనగా పరిణమింప చేశాయి ధైర్యంగల స్త్రీగా విమల పరిణామం ఒక క్రమంలో. ఒక పద్ధతిలో జరిగింది. ఇలా నెమ్మదిగా జరగడాన్ని గురించి విశదీకరిస్తూ నవలలో ఒక భాగంగా శ్రీ శాస్త్రిగారు—

—"పెట్రోలుకి నిప్పంటించినట్టు జనానికి భయం అంటుకుందంటే అది భగ్గునమండి అందర్నీ చుట్టబెడుతుంది. కాని, ధైర్యం అలా కాదు. అది చాలా కాలం రాజుకొని రాజుకొని ప్రజ్వరిల్లుతుంది." (26)

—"అందుచేత, విమల ఇంట్లో ధైర్యం ప్రజ్వరిల్లడానికి అర్నెల్లు పట్టింది. అందుగురించి విమల చాలా భయంకరమైన పట్టుదల పట్టవలసి వచ్చింది, చాలా శ్రమపడవలసి వచ్చింది."

సహజంగానే ధైర్యం ఉన్న స్త్రీ అయినప్పటికీ, నవలాంతంలోని విమలకు మొదటి ఘట్టాల్లోని చిత్రణకూ చాలా తేడా ఉన్నది. తన అక్క మరణానికి కారణమైన చిలకల దాసుని చెప్పుతీసికొని కొట్టడం, తన చిన్న బావ తనతో తప్పుడు మాట అన్నప్పుడు చిలకల దాసుని పొద్దున్నే కొట్టానని చెప్పడం, తన పెళ్ళి పీటల మీద పెళ్ళికొడుకుని చెంపమీద కొట్టడం, వాడి తమ్ముణ్ణి కుడికాల్తో ఛాతీమీద తన్నడం, పెళ్ళికొడుకు చేతిలోని పుస్తె తాడు లాక్కొని ఆ పుస్తె అతని మెళ్ళో గబగబ కట్టి ''నువ్వు నాకు మొగుడివిగా ఉండలేవు. అంచేత ఇక మించి కనీసం నా పెళ్ళాంగా అయినా బతుకుపో!'' (51) ఇలాంటివన్నీ విమలయొక్క ధీరగుణాన్ని తెలిపే ఘట్టాలు. కేవలం ధైర్యం కోసరమే ధైర్యం అన్నట్లు కాకుండా, ఒక పరమ ధర్మం, న్యాయం, నీతి, మానవతా దృక్పథం, అధర్మ నిరసనం అన్న వాటికోసంగా ఆమె ధైర్యాన్ని చూపించింది. ధర్మం కోసం ధైర్యం చూపడమే ఆమెని అసహజ వ్యక్తిగా భావించడానికి కారణమయింది కాని, అధర్మంతో నిండిన లోకంలో - ముఖ్యంగా స్త్రీ విషయంలో - విమల చూపిన ప్రవర్తన ప్రశంస నీయమే కాదు - అటు స్త్రీలకూ ఇటు పురుషులకూ కూడా ఆదర్శప్రాయంకూడా అయింది.

సాధారణంగా ఒక పాత్రను రచనలో ప్రవేశపెడ్తున్న ఘట్టంలోనే శాస్త్రి గారు తప్పనిసరిగా ఆ పాత్ర రూపం మన మనో నేత్రానికి ప్రత్యక్షమయ్యేటట్లుగా వర్ణనద్వారానో, ఉపమాది అలంకారాలద్వారానో చిత్రిస్తారు. కాని, విమల విషయంలో శాస్త్రిగారట్లా చెయ్యక కాస్త ఆలస్యంగా సూచనగానే చేశారు. చిన్న బావ విమలతో ఔచిత్యం తప్పి మాట్లాడ్తున్నప్పుడువాడు - 'కాని, అంత భారీ మనిషి మీద చెయ్యి వెయ్యడానికి అతను భయపడ్డాడు' (28) అనుకొన్నట్లుగా రాసి విమల శరీరం భారీది అని తెల్పుతారు. అంతే. ఇంక ఆమె తన్నడంలాంటి చేష్టలద్వారా దీన్నే నిరూపిస్తారు. ఇంక ఆమె సౌందర్యాన్ని గురించి రాయలేదు. ఆమె సుందరి కాదని కాదు. ఒకచోట విమలని వర్ణిస్తూ బంగారయ్యనోట-

—'తలమీద ఆడగొడుగుంది....కాళ్ళూ చేతులూ ఉన్న గులాబీ పువ్వు పనసాకు నెత్తికి అడ్డుపెట్టుకొని గునగున నడుచుకు వెళ్ళిపోతూన్నట్టు వెళ్ళి పోతోంది వర్షంలో వియత్నాం విమల" (240) అని ఎంతో నాజూకుగా అనిపించి నప్పటికీ మళ్ళీ వియత్నాం అనే విశేషణంతో (దీని వైశిష్ట్యం ఈ వ్యాసంలోనే తర్వాత వస్తుంది) మళ్ళీ ఆమెలోని ధర్మగుణానికే, వీరగుణానికే ప్రాధాన్యం

ఇస్తారు శాస్త్రిగారు. బంగారయ్య మొట్టమొదటిసారిగా ఆసుపత్రిలోని ఒక గదిలో ఆమె మామూలు వేషంనుంచి నర్సు వేషంలోకి మారుతున్నప్పుడు చూసి ఆమె అందాన్ని గురించి ముగ్ధుడైపోయి 'ఆ అందాన్ని గురించి ఏమని చెప్పను?' అంటూ 'అర్థరాత్రి పున్నమిచంద్రుణ్ణి అకస్మాత్తుగా నిద్రలేచి చూసినట్టు, ఉదయించే సూర్యుణ్ణి జీవితంలో మొదటిసారి చూసినట్టు డార్జిలింగ్ ఎండలో మంచు కొండల్ని చూసినట్టు ........ నేను ఆమెను నివ్వెరపోయి నిర్ఘాంతపడిపోయి చూసేను" (177 & 178) అని అంటాడు విమలలోని లాలిత్యపక్షాన్ని స్ఫురింప జేసే ఇలాంటి వర్ణనలు తక్కువ. దీనికొక ప్రధాన కారణం ఆమెకు తటస్థపడిన పాత్రలన్నీ ఎక్కువగా అధర్మ పాత్రలే. వారంతా ఆమె ధర్మదృష్టివల్ల లౌకికంగా నష్టపడినవారే అందుకే అలాంటి ఒక పాత్ర 'పుల్లు మేకల్దినడానికీ గొర్లు గెడ్డి గరడానికీ తేడా తెల్దు ఇయ్యమ్మకి!' (185) అని అంటుంది. ఈ పాత్రే 'బాబో, అది ఆడది కాదు బాబూ, మా పాలిటి పిసేసం' (191) అని కూడా అంటుంది. కాని, ధర్మ ప్రవర్తన కల్గిన రామచంద్రయ్య పాత్ర-

—"బాబొరే బంగారం! అమ్మాయి గయ్యాళని అందరూ అంటారు, కాని ఆ అమ్మాయి చాలా మంచిదీ చాలా అమాయకురాలూ[నా!" (260)

అని అంటుంది. ఇట్లా విమల పాత్రయొక్క శరీర వర్ణన కన్నా ఆమె గుణ వర్ణనం, ఆమె చేతలవల్ల పడిన ప్రభావాలు, ఫలితాల చిత్రణం ఈ నవలలో ఎక్కువగా చోటుచేసికొని పాఠకుల మనస్సులో విమల చిత్రం ఒక ధర్మ మూర్తిగా ఏర్పడింది.

ఈ 'ధర్మమూర్తి'లో రెండంశాలని ఇమిడించారు శాస్త్రిగారు. ఒకటి తనని తాను కాపాడుకోవడం; రెండోది అవతలి అధర్మపరులని తీవ్రంగా ఎదిరించడం. ఈ రెండంశాలవల్లా విమల వ్యక్తిత్వం ఎంతో విశిష్టమైందిగా ఏర్పడింది.

బ్రతుకులో ఎన్ని కష్టాలు కల్గినా బ్రతుకుని ద్వేషించలేదు. బ్రదకాలనే తపన ఆమెలోని ధీరగుణ ఫలితమే. తల్లిదండ్రులతో విమల "మనం ముగ్గురం. ఇంకా బతికే ఉన్నాం. అందువల్ల భగవంతుడికో మరెవరికో మన ప్రయోజనం ఇంకా ఉన్నదన్నమాటే!" (30) అని బ్రదకడంలోని రహస్యం చెప్తుంది. కాని ఆ బ్రదుకులో అధర్మాన్ని ఒక తులం ఎత్తైనా కలువ నివ్వదు. విమల తల్లిదండ్రు లకూ కుటుంబానికీ సహాయపడకపోగా దుర్మార్గంగా నష్టమూ కీడూ చేసిన

విమల అన్నలిద్దరూ నవల చివరలో వాళ్ళ ఆఫీసు డబ్బు కాజేసి పోలీసులకి చిక్కడానికి ముందు బంగారయ్యగారి దగ్గరకు వచ్చి 30 వేల రూ॥లని అడుగుతారు. తర్వాత ఈ విషయాన్ని విమల కనుక్కొని ఆ అన్నల ఆఫీసర్లకి, పోలీసుకి కూడా తన అన్నలు చేసిన పనిని రిపోర్టు చేసింది! అందుకే ఆ తర్వాత బంగారయ్య "స్వంత తోబుట్టువుల తప్పుల్నే క్షమించని ఈ వియత్నాం విమల నా తప్పులన్నీ ఆమెకి తెలిసిపోయిననాడు నన్ను క్షమించి నాతో కాపరం చేస్తుందా, నన్ను బతకనిస్తుందా?" (294) అనుకుంటాడు. విమల ధర్మ దృష్టికి ధర్మం మీదనే పక్షపాతం కాని, ఇంకే పక్షపాతాలూ లేవు. ఆమె తటస్థపడిన అందరికీ ఈ విషయం బాగా తెలుసును బంగారయ్య చేసిన పాపాలన్నీ ఆమెకు స్థూలంగా తప్ప సూక్ష్మంగా తెలిసినట్లు లేదు. బంగారయ్య బావకూడా అతనితో చెప్తే ''అయితే నీ చిన్ననాటి సంగతులే నాకు తెలును. అవే నేనావిడకి చెప్పేను. ఆ తర్వాత సంగతులు నాకు తెలియవు. అంచేత అవేమీ నేనావిడకి చెప్పలేదు" (260) అని అంటాడు. అంతేకాకుండా మరోచోట ఆయన—

—"అంచేత బంగారు బాబొరే, చేసిన తప్పులన్నీ చెల్లిపోయేయి కాబట్టి ఇక మీదైనా తప్పులు చెయ్యకుండా వెళ్ళగలిగేవంటే నువ్వూ నీ విమలా సుఖంగా ఉండ గలుగుతారు. లేదూ, తప్పులు చేసి నెగ్గుకొస్తాను ఇదివరకు లాగే అంటావూ?! అలానే చేయ్. అయితే ఆ తప్పుల్ని నీ దేవుడు క్షమించొచ్చు కాని, క్షమించమన్చెప్పి దేవుడు దిగొచ్చి చెప్పినా నీ భార్యమాత్రం అందుకు నిన్ను క్షమించదు! ఆ సంగ తెలుసుకో" (266) అని అంటాడు. ఇట్లా శాస్త్రి గారామెలోని అధర్మాన్ని ఎదిరించే లక్షణాన్ని స్ఫుటంగా ఎత్తి చూపిస్తారు. తనకు భార్య అయ్యాక కూడా విమల తన అధర్మాన్ని సహించదనే జ్ఞానం బంగారయ్య కలిగేట్లు చిత్రించడం ఈ నవలలోని విశేషం.

ఆపత్కాలంలో ఒకసారి బంగారయ్యకి తన గతమంతా గుర్తుకి వచ్చి తన జీవితాని కావిడ ఎట్లా ప్రతిస్పందన చూపిస్తుందో కింది విధంగా చక్కగా విశ్లేషించుకుంటాడు:

—''నా బాల్యం గురించి తెలిస్తే నా విమల బావురుమనగలదు. కొంతవరకూ నా బంగారిగాడి బతుకుని కూడా ఆమె క్షమించగలదేమో! కాని, నా బంగారయ్యవతారం గురించి వివరాలన్నీ తెలిస్తే మాత్రం ఆమె ఊరుకోదు. ఊరిని గాలివాన తినేసినట్టు నన్ను తినేసి తీరుతుంది'' (295).

కడవలూరి వీర వేంకట సత్యనారాయణమూర్తి అనే—

(1) బంగారుబాబు బ్రతుకుకు విమల → బావురుమంటుంది.

(2) బంగారిగాడి బ్రతుక్కి → క్షమించగల్గుతుంది.

(3) కాని బంగారయ్య జీవిత విశేషాలు తెలిస్తే → ఊరుకోదు.

ఊరుకోక ఏం చేస్తుంది? అసలతణ్ని ఎందుకు చేసికొంది? విమలయొక్క వ్యక్తిత్వం బంగారయ్యలో సంపూర్ణమైన మార్పుని కోరుతున్నది దాన్నికాదంటే ఆమె భర్తని కానీ, మరెవ్వరినికానీ లెక్క చేయదు. ఈ విషయాన్ని తెలిసికొనే అతడు ఆమె తన సొంత తోబుట్టువుల్నే లెక్కచేయనిది ఇంక తన్ను లెక్కచేస్తుందా? అని విచికిత్సలో పడ్డాడు. అందువల్ల అతడు పూర్తిగా మారైనా పోవాలి. లేక ఆమె తనను వదలుకొంటుంటే చూస్తూ అయినా ఊరుకోవాలి. అతనిలో మారగల్గిన స్వభావాన్ని ఆమె గుర్తించింది కాబట్టే అతణ్ణామె పరిణయ మాడింది. అందుకే ఆమె తనతో వివాహానికి పూర్వం ఇట్లా అన్నదంటాడు బంగారయ్య :

—"నాకు (విమలకు) ఎందుకు అలా అనిపిస్తోందో చెప్పలేనుగాని, నువ్వు చెడిపోయిన శ్రీరామచంద్రుడిల్లా నాకు అవుపిస్తున్నావు!" (214).

అట్లా బాగుపడి ధర్మాత్ముడుగా పరిణమించడానికి ప్రయత్నిస్తాడని ఆమెకు విశ్వాసం కల్గింది. అందుకే అతణ్ణి పరిణయమాడింది. (అతణ్ణి ధర్మోన్ముఖుణ్ణి చేయడానికామె తొలి రాత్రినుంచే తీవ్ర ప్రయత్నం చేసింది కూడా.)

ప్రస్తుతానికి వస్తే, బంగారయ్య చివరి ఘట్టానికి కాస్త ముందు తాను చేసిన 'మోసమోసాలన్నీ' తాను చేసిన 'పాపపాపాలన్నీ' ఆమెకు చెప్పేశాడు. అలా చెప్పాక అతనికి తన తలమీదినుంచి బండెడు బరువు దిగిపోయినట్టనిపించిందనీ అంటూ —

—"ఆమె ఏమి చెయ్యదల్చుకొందో అది చేస్తుంది. కాని, నేను ఏమి చేయవలసి ఉన్నదో అది నేను చేసేసేను. ఆ రాత్రి నన్ను నేను కడిగేసుకొన్నాను" (303)

అని అంటాడు. తాను ఏమి చేయాల్సి ఉన్నదో అది చేసే జ్ఞానం అతనికి విమల వల్లనే కలిగింది. అంతకు ముందతనికి 'వెలుగులో' విమలతో ముఖాముఖి ఉండలేను. ఉండలేను' అనిపించింది.

'దూరంనించి నా మేడ మెరపుల్లో ఎత్తుగా ఓ గుడిలా నాకు కన్పించింది.

నా ఇంట్లోకి నేను దొంగలా వెళ్ళేను.

ఆ ఇంట్లో విమల మంచంమీద దేవి విగ్రహంలా కూర్చుంది' (302) విమల వ్యక్తిత్వంచేత అతని మనస్సులో ఎంత ఎత్తుకి ఎదిగి ఉన్నదీ, ఆమె ధర్మబుద్ధిముందు తానెంత అల్పుడైనదీ అతనికి తెలిసివచ్చిందని పై మాటలు తెల్పుతున్నాయి. ఇంత స్థిరమైన ధర్మబుద్ధి ఉన్నది కాబట్టే, ధర్మవ్యతిరేకత కల్గినప్పుడు ఆమె దాన్ని ఎదుర్కొని తీర్తుందన్న ఆమె స్వభావంలో శాస్త్రి గారు నిక్షేపించిన గుణాన్ని బంగారయ్య తెలిసికోగలిగాడు.

అతడు మంచికి పరిణమించదల్చుకొన్న వ్యక్తి అందువల్ల ధర్మాచరణ వల్ల మామూలు మనిషికి చాలా కఠినురాలుగా అన్పిస్తున్న విమల యొక్క ప్రాణ భూతమైన ధర్మగుణానికి అతడు ఎన్నడూ నిరసన చెప్పలేదు. క్రమక్రమంగా తొలి రాత్రినుంచి తానూ దానికి సుముఖుడై, నవలాంతానికి పొందాల్సిన పరిణా మాన్ని పొందుతాడు. అందుకే పై మాటల్లో ''ఏమి చేయవలసి ఉన్నదో అది నేను చేసేస్తాను అని అన్నాడు. ఇట్లా విమల ధర్మ అనురక్తి, ఆచరణల్లో రచయిత ఎక్కడా రాజీపడే పాత్రను తన మూలసిద్ధాంతానికి వ్యతిరేకంగా ఈషణ్మాత్రంగానైనా జార్చలేదు. అందుకే నవల చివరిఘట్టాల్లో బంగారయ్య తన పాపాలనన్నిటినీ చెప్పి బరువు వదల్చుకొన్నప్పుడు ఆమె మనస్సులో ఏ సంక్షోభం తలెత్తిందో రచయిత (ఒక్క వాక్యం తప్ప) తెల్పలేదు. (అట్లా తెల్పకపోవడం రచనా శిల్పానికి అవసరమైంది.)

కాని హఠాత్తుగా ఆమె మరణానంతరం బంగారయ్యను ప్రభుత్వం శిక్షించ డానికి కారణం ఆమె తాను అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ ఇన్‌కం టాక్స్‌కి తన భర్త చేసిన పాపాలన్నీ రాయడం. ఎంతో సంక్షోభం మనస్సులో అనుభవించాకే ఆమె అలాంటి లేఖ రాసుంటుంది. ధర్మాధర్మాల నడుమన విచికిత్సచేసి పక్షపాతం లేకుండా ఆమె ధర్మపక్షమే తీసికొంది. అందులో తన భర్తయొక్క లౌకిక జీవితం బుగ్గి అవుతున్నప్పటికీ ఆమె లక్ష్యం చేయలేదు. ఆమె ప్రభుత్వా నికి రాసిన లేఖను గురించి భర్తకి రాసిన లేఖలో ఇట్లా ఉంది :

—''బంగారూ, నీ దొంగతనం గురించి అధికార్లకి వివరిస్తూ రాసి కనకరాజుచేత కాయితాలురాసి పంపించేను. అందుకు నిన్నుగాని మరెవర్నిగాని

క్షమించమని అడగవలసిన అవసరం నాకు లేదు. బంగారూ, నువ్వు చేసిన పాపాలకి అన్ని శిక్షలూ అనుభవించి వచ్చి! అప్పుడు నువ్వు నిజంగా బంగారు బాబువవుతావు, మంచివాడివవుతావు. అప్పుడు నీకు అదొక పునర్జన్మ! నీ పునర్జన్మలో కూడా నువ్వు నా భర్తవే! అప్పుడు ఇద్దరం కలిసి హాయిగా ఉందాం, ఎంతోమంది పిల్లల్ని కందాం! ఇట్లు విమల" (325).

పోగా ఈ లేఖవున్న కవరుమీద "నా స్వామి బంగారుకి" అని ఉంది. తన భర్త పాపాలను అధికార్లకు రిపోర్ట్ చేసినందుకు ఆమెకు ఈషణ్మాత్రం కూడా విచారం లేదు. ఆమె అంతఃకరణం ఎంత గొప్పదో, ఎంత విశుద్ధమైనదో, ఆమె మనస్సు ఎంత నిజాయితీ కల్గి ఉన్నదో, ఆమెకు ఎంత త్రికరణశుద్ధి ఉన్నదో పైలేఖ నిరూపిస్తున్నది. భర్త నిజమైన బంగారుబాబు కావాలనీ, మంచివాడు కావాలని, తనకి శాశ్వతంగా అతడే భర్త అనీ విమల అనడం ఆమె లక్ష్యశుద్ధిని తెల్పుతున్నది. తనకి భర్తే అయినప్పటికీ ఒక ప్రైవేట్ లేఖలోనైనా ఆమె శిక్షార్హుడు కాడంటంలేదు. ధర్మంతో ఆమెకెక్కడా రాజీ లేదు. ఇలాంటి గుణాల రాశికే శాస్త్రిగారు గొప్పగా రూపకల్పన చేశారు.

విమల ధర్మబుద్ధిని తెల్పని సంఘటనలు ఈ నవలలో నిజంగా మృగ్యమే. తొలినాటిరాత్రి ఆమె ప్రవర్తన విచిత్రంగానూ, ఆమె బంగారయ్యకు ధర్మంలో తర్ఫీదు నిచ్చేదిగానూ ఉన్నది. అసలు బంగారయ్యతో తన వివాహం కూడా విశాఖపట్నంలోని రాములవారిగుళ్ళో జరపాలన్నదామె. తన మొదటి వివాహం అక్కడే మధ్యంతరంగా ఆగిపోవడం వల్ల కాదిమె అలా కోరడం. రామచంద్రుణ్ణి రచయితా, విమలా ధర్మప్రతీకగా భావించడమే ఇందుకుకారణం. 'మన పెళ్ళి శాస్త్ర సమ్మతంగా జరగాలని' (268) కూడా ఆమె అంది. వివాహాన్ని ఒక వ్యక్తిగత వ్యవహారంగా కాక, సాంఘిక వ్యవహారంగానే ఆమె భావించింది. ఇదంతా ఇట్లా ఉన్నా తొలిరాత్రి ఆమె అతనితో 'నాకు సారా కావాలి' (273) అని అన్నది. తర్వాత ప్రేమతో తాను సారా తాగితే అతనికి బాధగా ఉంటుందా (276) అని కూడా అన్నది. అప్పుడామె—

''జనం సారా తాగితే - నేను తాగితే ఎలా బాధ పడతావో - అలానే బాధ పడతావా, పడవా? చెప్పు!'' (276)

.... .... .... .... .... .... ....

''అయితే నన్ను సారా వ్యాపారం మానేయమంటావు! అంతేనా?''

.... .... .... .... .... .... ....

'మానేయకపోతే?'

''నీకూ నాకూ విడాకులే'' అందామె. (277)

''ఇంతే కాకుండా విను! నేను నీకంటె ముందుగా చచ్చిపోయినా నిన్నొదల్ను! దేవతగానో దెయ్యంగానో నీవెంటే ఉంటాను!'' (277) ఇట్లా తొలిరాత్రే అతని ఘోర పాపాన్నుంచి అతణ్ణి మళ్ళించింది విమల. ''ఈమె నా జీవితాన్ని మరింక సజావుగా సాఫీగా - అంటే అదే అక్రమాలతో హాయిగా సాగనివ్వదని నాకు తెలిసిపోయింది ఆ రాత్రే!'' (278) అని అతను తాను మారడానికి మానసికంగా సిద్ధపడ్డాడు. కాని అతను నిజజీవితంలో సారా వ్యాపారం మానలేదు. అందువల్లే విమల రాజీపడలేకపోయింది. ఈ విషయాన్ని బంగారయ్యే తెలిపిన తక్షణం ఆమె బంగారయ్య శిక్షింపబడాలని నిర్ణయించుకొన్నట్లుగా ఉంది.

ఇట్లా ఆమె పాపానికి, అవినీతికి, అన్యాయానికి వ్యతిరేకంగా తన జీవితాన్ని మల్చుకొన్నది. ఇందుకుగాను ఆమె ధీరగుణం ఆమెకు తోడ్పడింది.

ఈ పాత్రని ధర్మాభిముఖంగా శాస్త్రిగారు రూపకల్పన చేయడంలో ప్రతి చిన్న విషయాన్ని కూడా జాగ్రత్తగా చెక్కారు. వీరవల్లి విమల జీవితం రాస్తూ ఆ అధ్యాయానికి 'వియత్నాం విమల వృత్తాంతం' అని పేరు పెట్టారు. ఈ నవల్లో ఎక్కడా ఈ వియత్నాం అన్న విశేషణానికి కీలకాన్ని ఇవ్వలేదు శాస్త్రిగారు. ఒకటి రెండుచోట్ల ఇతర పాత్రలతోకూడా యియత్నాం విమల అని అనిపిస్తారు కూడా. కాని, వివరణలేదు. అమెరికావంటి అమానుష అగ్రరాజ్యంతో చిన్న దేశమైన వియత్నాం పోరాడి గెలిచి స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవడం ఒక దశాబ్దికి పైగా ప్రపంచంలో ఒక ముఖ్య సంఘటనగా చెప్పుకొన్నాం. ఎవరూ బలహీనులు కాదు ఎలాంటి శత్రువునైనా ఇచ్ఛ, నిజాయితీ, పట్టుదల ఉంటే ఎదుర్కొని మనని మనం కాపాడుకోవచ్చునని చెప్పడానికి వియత్నాం విమల అన్నారా శాస్త్రిగారు?! విమల జీవితం మొత్తాన్ని పరిశీలిస్తే ఈ వివరణ అసమంజసం ఏమీ కాదు. 'వీరవల్లి' అన్న ఇంటి పేరుతో ఆమెలోని వీర, ధీర గుణాల్ని చూపించడానికే శాస్త్రిగారని ఉండవచ్చును. అలంకార శాస్త్ర కొలమానాల ప్రకారంగా

చూస్తే ఈ నవలలోని అనుభూతి ధర్మవీరానికి సంబంధించింది. దీని కనుకూలం గానే మనకు విమల జీవితమూ, ఆమె గుణాలూ కన్పిస్తాయి. చస్తూ చస్తూకూడా విమల తలెత్తుకునే చచ్చిపోయింది. ధర్మానికి తప్ప చివరకు ఆమె భగవంతునికి కూడా తల దించని వీరనారీమణి. ఆమె చివరి మాటల్ని చూడండి - (బంగారయ్యతో) ''నీ కూతుర్ని నీకు అప్పజెప్తున్నాను. నా బిడ్డ కోసం నాకు బతకాలని ఉంది. కాని భగవంతుడు నన్ను బతకనివ్వడం లేదు. నేనే తప్పు చెయ్యలేదు, నన్ను క్షమించమని నేను వాణ్ని అడగవలసిన అవసరంలేదు నా బిడ్డకి తల్లి లేకుండా చేస్తున్నందుకు వాడే క్షమించమని అడగాలి నా బిడ్డనీ నన్నూ.'' (322) ఆమెది ఎంత విశుద్ధమైన అంతఃకరణమో! జీవితం మొత్తంగా ధర్మాన్ని అనుసరించగల్గినవాళ్ళకే ఈ ఆత్మ విశ్వాసం ఉంటుంది. విమలను అటువంటిదానిగా తీర్చి దిద్దారు శాస్త్రిగారు.

ధర్మాచరణలో మునిగితేలే మనుష్యులకి కారుణ్యం, మృదు హృదయం లేనట్లనిపిస్తుంది. కాని వారి ఆచరణవల్ల లోకానికి జరిగే మేలైద్రైతే ఉన్నదో అది వారి మృదుస్వభావం కన్నాకూడా ఎక్కువ హితకారి. పోగా, పైకి అట్లా కన్పిస్తారు కాని, వీళ్ళ గుండెల్లోనూ ఎంతో కారుణ్యం, జాలి వంటి గుణాలుంటాయి. భర్తని జైలుకి పంపించిన విమలే భర్త తాను చేసిన పాపాలన్నీ చెప్తున్నప్పుడు 'అంతా వింటూ విమల ఏడ్చింది' (303) అంటాడు బంగారయ్య. విమల తన ప్రణయాన్ని అంగీకరించిన తక్షణం "ఆమె నానించి ఎప్పుడు విడిపడిందో నాకు తెలీదు కాని, కొంతసేపు అయాక ఆమె నా మంచంమీదికి కూలిపోయి, నా తల గడ మీద తలపెట్టుకొని వెక్కి వెక్కి బిగ్గరగా ఏడవ నారంభించింది." (253) అని అంటాడు బంగారయ్య ప్రేమ, జాలి, కరుణ, వ్యక్తిగతంగా భర్తమీద నిండు వలపూ ఉన్న వ్యక్తే విమల. కాని ధర్మం విషయం వచ్చేటప్పటికి ఇవేవీ అడ్డుకావు. ధర్మబుద్ధి, తదాచరణ - ఇవే ఆమెకు ప్రాణాలు. అందుకే ఈ నవలకి ప్రాణం ఆమె. ఈ నవలకు నాయకి కాదామె. ఆమె నాయకుడే! అంటే ఇతివృత్త ఫలాన్ని అనుభవించిందామె. ఆమె అనుభూతే పాఠకుల అనుభూతి. బంగారయ్య సాధకుడు. అతని సాధన పేజీ పేజీకి కన్పిస్తుంది. కాని విమల ధర్మసిద్ధ. మొదటి భాగంలోనే ఆమె ఏర్పడిపోయింది. ఈ నవలా లోకంలో అందుకే ఆమె ఆదర్శంగా ప్రతిష్ఠాపితమైంది. నాయకుడని అలంకార శాస్త్రాల్లో ఔపచారికంగా చెప్పారే కాని, అతని పాత్రని (role) నాయిక కూడా వహించ

వచ్చును. శృంగార రసంలో నాయికా నాయకులు ఉండాల్సిరావడంతో, ప్రతి రసంలోనూ అదే సామ్యాన్ని చూస్తున్నారు. కాని, అలా ఉండాల్సిన అవ సరం లేదు. ఈ నవలలో నాయికే ప్రధానం. ఆమె ద్వారానే మనకు అనుభూతి కల్గుతున్నది. ఇతర పాత్రలద్వారా మనకు కల్గేదంతా ఆమె జీవలక్షణంలోంచి ప్రాణం పొంది, సంస్కరింపబడి మనకు అందుతున్నది. శాస్త్ర పద్ధతిలోని నాయ కుడు ఈ నవలలో లేడు, ఉండనక్కర్లేదు. ధర్మవీరం అందితే చాలు, అలా అందించగలిగారు శాస్త్రిగారు.

*   *   *

ధర్మ విషయకంగా రావిశాస్త్రిగారు సంఘటనా స్థలాలను జాగ్రత్తగా ఏర్పర్చడం ద్వారా కూడా స్ఫూర్తిని కల్గించారు తొలికథ అయిన వియత్నాం విమల వృత్తాంతంలో విమల పెళ్ళిని రాముల వారి గుళ్ళో జరిపిస్తారు రచయిత. అక్కడ ఆ వివాహం భగ్నమయి మళ్ళీ చిట్టచివరి కథలో బంగారయ్యతో విమల వివాహం చేసికోదల్చుకొన్నప్పుడు తన వివాహం విశాఖపట్నంలోని రాములవారి గుళ్ళోనే జరగాలని నిర్ణయించింది. ఇంతేకాకుండా శాస్త్రిగారు ఇందులో ధర్మ ప్రబోధం చేసిన బంగారుబాబు బావగారి పాత్రకు పెట్టిన పేరు రామచంద్రయ్య. వీటితోపాటు అక్కడక్కడ శాస్త్రిగారు వేసిన ఉపమానాలు కూడా రాముడికో, రామాయణ కథకో సంబంధించి ఉన్నాయి.

—''దశరథుడి గురించి కైకేయిని వప్పుకున్నట్లు మా బావగురించి అతని రెండో భార్యని వప్పుకున్నట్టుంది విమల.'' (268)

—''అతను శ్రీరామచంద్రుడికి ఆంజనేయుల్లా ఉండగలిగిన వాళ్లానే కనిపించేడు కాని, ఆంజనేయుడికి శ్రీరామచంద్రుల్లా ఉండగలిగిన వాళ్లా కనిపించ లేదు.'' (230)

ఇట్లాంటి పోలికలు రెండుమూడు చోట్ల కనిపించి శాస్త్రిగారు శ్రీరామ చంద్రుని ఊరకే కాకుండా ఏదైనా ప్రత్యేక ప్రయోజనం కోసంగానే నవలలో వాడినట్లు స్పష్టం చేస్తుంది.

ఒక యాభైసంవత్సరాల క్రితం లేనివిధంగా ఇవేళ ఊరూరా వేంకటేశ్వర స్వామి దేవాలయాలు ఏర్పడుతున్నాయి. అంతకుముందురోజుల్లో శ్రీరాముడి గుళ్ళో, శివాలయాలో ఎక్కువ. ఈ అంశాన్ని జనంయొక్క మనఃప్రవృత్తి

లోని విచిత్రమైన మార్పుకి సంకేతించి శాస్త్రిగారు వర్ణించారు. వేంకటేశ్వరుడి గుడీ, రాములవారి గుడి ఎట్లా లేడాతో ఉన్నాయో తెల్పుతూ శాస్త్రిగారిట్లా రాశారు:

ఊళ్లో సెంటర్లో వెంకటేశ్వర స్వామివారి గుడి పాలరాతిలో తెల్లగా వెండి గోపురంతో ఇంకా తెల్లగా, డబ్బుతో పచ్చిగా పచ్చగా రంగు రంగుగా అందంగా బొమ్మలు బొమ్మలుగావుంటే

సందులో రాములవారి గుడి శిధిలావస్థలో నల్లనల్లగా నాచునాచుగా పెచ్చులు పెచ్చులుగా గోడలనించీ గోపురంలోంచి బెట్లు బెట్లుగా ఉంది.

వేంకటేశ్వరస్వామి వారి గుళ్ళో కావలిసినకంటె హెచ్చుగా విద్యుద్దీపాలున్నాయి.

రాములవారి కోవెలకి ఆ వైభవం లేదు. ఆ దీపాలే లేవు.

వేంకటేశ్వరస్వామి పంచదార మిల్లు ప్రెసిడెంట్ లాగా మాంగనీసు వ్యాపారంచేసే మార్వాడీ షావుకార్లాగా ధగ ధగలాడుతూ ఉంటే

అన్ని మొఖాసాలూ టమ టమాకి వెళిపోగా అంతా చెడిపోయిన పాతకాలపు మొఖాసాదార్లా రాములవారు వెలవెల బోతున్నారు. (45)

ఇక్కడ ఇరుదేవతామూర్తుల నడుమన భేదం ఉన్నదని చెప్పడం కాదు. ఒక దేవతని వదలి మరొక దేవతను ఏవో లౌకిక ప్రయోజనాల్ని ఆశించి పట్టుకోవడం మీద ఈ వ్యాఖ్యానమంతా. ప్రజల మనస్సులలోని స్వార్థం, అవకాశ

వాదం, ఇత్యాది దుర్లక్షణాల్ని ఎత్తిచూపడానికే శాస్త్రిగారి దేవాలయాల భేదాన్నిట్లా వర్ణించారు. రాములవారి కోవెలపై ప్రజలు చూపిస్తున్న నిరాదరణను నిరసించడమే శాస్త్రిగారి ఉద్దేశ్యం. చివరకి 'రాముల వారి కోవెల ముందున్న సందు బుగ్గి బుగ్గిగా ఉంది' (46) అని కూడా రాస్తారు రచయిత—ఆ గుడి పరిసరాలకి కూడా ప్రజలు రావడం లేదట!

ఆశలూ కోర్కెలు తీర్చేదేవుడుగా వేంకటేశ్వర స్వామి శక్తి ప్రసిద్ధం. రాముడు కేవలం ఆదర్శమూర్తి, ధర్మమూర్తి. ఇవేళ ప్రజలకు ధనం కోసరమే బ్రతుకు కాని ధర్మం కోసరం కాదని రచయిత సూచన. పంచదార మిల్లు ప్రెసిడెంట్, మార్వాడీషావుకార్ల లాగా ధగధగ వేంకటేశ్వరుడు వెలిగిపోవడం, రాముడు చెడిపోయిన పాతకాలపు మొఖాసాదార్ల వెలవెలబోవడం అన్నవి తన నవలలో తర్వాత రానున్న కథలోని బంగారయ్య, రామచంద్రయ్యలను తలపించడానికే. బంగారయ్య నవలలో ముఖ్యస్థానంలో ఉన్నాడు. అంటే ప్రజా జీవనంలో కేంద్రస్థానంలో వెలుగుతూ ఉన్నాడు అట్లాగే ఊర్లో సెంటర్లో వెంకటేశ్వరస్వామి గుడి ఉందంటారు! రాములవారి గుడి సందులో ఉందట! రామచంద్రయ్య జీవితం కూడా ఈ నవలలో ప్రక్షిప్తంగానే; మరుగునపడి ఉండింది. అసలు నవల తొలి భాగాల్లో ఈ పాత్రకి పేరు కూడా పెట్టలేదు రచయిత!

ప్రజలు ధర్మం తప్పుతున్నారనే దీని సూచన. దేవతల మంచీ చెడులు కాదు ఉద్దేశ్యం. ప్రజల వ్యభిచారీ మనస్సుని తెల్పడానికే ఈ వర్ణన అంతా.

సమాజం అంతా ఇట్లా ఉండగా ఒక పేదవాడు, పకోడీలు అమ్ముకునే ఒక బొందిలీ ఆసామి, రాములవారి గుడి ముందుని వదలకుండా ఆ దేవునికే కట్టుబడి ఉండిపోవడాన్ని ప్రజల్లో కూడా కొందరు ధర్మాత్ములున్నారని చెప్పడానికి శాస్త్రిగారు వర్ణించారు. ఈ వర్ణన దీర్ఘమైంది అయినప్పటికీ రచయిత హృదయాన్ని (ధర్మదృష్టిని) స్పష్టంగా తెలుపుతుంది కాబట్టి కింద మొత్తంగా ఇస్తున్నాను—

''రాములవారి గుడి ప్రజాదరణ పొందుతూ రమ్యంగా ఉండిన రోజుల్లో ఆ గుడి ద్వారానికి ఎదురుగా ఓ బండి దుకాణం పెట్టుకొని దానిమీద పకోడీలాడూ వగైరా కారపు మరిన్ని తీపి సామాన్లు పెట్టుకొని ఒక బొందిలీ ఆసామి బాగు

పడ్డాడు రాములవారు చితికిపోయి వెంకటేశ్వరస్వామి వెలిగిపోతున్నప్పటికీ ఆంజనేయులవార్లా రాములవారినే కనిపెట్టుకొని ఉండిపోయేడు ఆ బొందిలీ ఆసామీ. రాములవారు వెలిగిన రోజుల్లో అతను వేడి పకోడీ అమ్మేవాడు. వెంకటేశ్వరస్వామి వెలుగుతున్న రోజుల్లో వారి గుడి దగ్గరికి అతను వెళ్ళకుండా రాములవారి గుడి వద్దనే ఉండిపోయి, చచ్చిన పకోడీలనైనా అమ్ముకు బతుకు తాను కాని రాములవారి పాదాల్ని వదలనని భీష్మించుకొని ఆ గుడిద్వారానికి ఎదురుగానే పూర్వంలాగే బండీ పెట్టుకొని ఉండిపోయేడతను. ఆ నాలుగు చక్రాల బండీమీద పూర్వం పెట్రోమాక్స్‌లైటు వెలిగేది. విమల పెళ్ళినాటికి అందులో పెద్దదే అనుకోండి కాని, ఓ కిరసనాయిలు బుడ్డిదీపం వెలుగుతోంది. ఆ దీపం వెలుగులో ఆ బొందిలీ ఆసామి ముసలి రాముళ్ళా ఉన్నాడు" (46.)

బొద్దక్షరాలవన్నీ కావ్యనిర్మాణ శిల్పం తెలిసివాడు వేసే విశేషణాలు. ఇవాళ ధర్మానికి చెలామణీ లేదు. అది చచ్చిన పకోడీల్లాంటిది. ఐనా కాలానుగుణంగా చెడుకి అధర్మానికి ఆ బొందిలీ ఆసామీ మారదల్చుకో లేదు. అందుకే రాములవారి పాదాల్ని వదలనని భీష్మించుకొని కూర్చున్నాడు! ధర్మం నాలుగు పాదాలా (నాలుగుచక్రాల) చెలామణీ అయినప్పుడు మంచి తేజస్సుండింది. ఇవేళ అట్లాలేదు (కిరసనాయిల్ బుడ్డిదీపం). ఇవేళ ధర్మబుద్ధి లేదు. ధర్మం నిస్తేజంగా ఉంది—వీటన్నిటికీ మించింది చివరి వాక్యంలోని బొందిలీ ఆసామి ముసలి రాముళ్లా ఉన్నాడనడం. ఈ ముసలితనం 'వీర' గుణం తగ్గిందనడానికి సూచన. అంటే ఉత్సాహం లేకుండా పోయింది. అందుకే రామచంద్రయ్య, విమలల ద్వారా—ముఖ్యంగా విమలద్వారా—శాస్త్రిగారు ఉత్సాహంతో కలిపిన ధర్మ ఆచరణ చూపారు. మోసగింపబడిన బైరాగి నాయుణ్ని 'ఆదినివుడు అన్నఁవడుక్కుంటున్నట్టు ఆడున్నడు' (142) అని అనడం ఇక్కడ బొందిలీని ముసలి రాముళ్లా ఉన్నాడనడం కేవల హృద్య వర్ణనలేకాదు - ధర్మాత్ములు ఉత్సాహంతో వీరులై ధర్మపోషణ చేస్తూ ఆదర్శం చూపాలని సూచన. అందుకే ధర్మమూర్తి అయిన విమల వీరనారిగా ప్రవర్తించడానికి కొన్నిక్షణాల ముందుగా ఈ బొందిలీ ఆసామీని రచయిత ఇట్లా వర్ణించాడు. దీన్తర్వాతే ఈ అధ్యాయం చివరన రచయిత ''ఆ దినం ఆ విధంగా జీవిత రణరంగంలోకి దూకింది వీరవల్లి విమల'' (52) అని రాశారు.

ఈ బొందిలీ ఆసామీ ముందరే ఈ నవలలోని అత్యంత ముఖ్యపాత్ర బంగారుబాబుని (కడవలూరి వీరవెంకటసత్యనారాణమూర్తిని) రచయిత పరిచయం చేశారు. ఇతని పేరులోనూ వీరవుండడం అన్న విశేషం గమనించాలి. అతనూ సెంటర్లోని దేవుడిగుడికి పోకుండా, ఈ రాములవారి గుడి ముందుకే వచ్చి,.... ముసలి రాముళ్ళా ఉన్న బొందిలీ ఆసామి ఇచ్చిన పకోడీలను నముల్తూ ఉండటం కూడా విశేషమే. ఇట్లా రామచంద్రయ్య అన్న ధర్మాధార భుజంమీద నిలబెట్టదల్చుకున్న రెండు భుజాలనూ శ్రీరాముడి కోవెలముందే ముసలిరాముళ్ళా ఉన్న బొందిలీ ఆసామి సమక్షంలో ప్రత్యేక ఉద్దేశ్యంతోనే రచయిత నిలిపినట్లుంది. ఇందులో ఒక పాత్ర తన ఉత్సాహాన్ని అధర్మంవైపుకి తిప్పగా మరో పాత్ర ధర్మంవైపుకి తిప్పి ఈ నవలను ధర్మేతిహాసంగా తీర్చింది. ఈ ధర్మంవైపు తిప్పిన పాత్ర ఇంటిపేరులో (వీరవల్లి) 'వీర' అని ఉండడం విశేషం - ధర్మవీరాన్ని శాస్త్రిగారలా సూచిస్తున్నారన్నమాట! సమకాలీనమైన వ్యవస్థను విశాల ఇతివృత్తంలో ఇమిడించి ప్రయోజనాత్మకంగా నిర్దిష్టమైన ధర్మ అనుభూతిని సాఫల్యంతో కల్గిస్తున్నది కాబట్టి దీన్ని ధర్మేతిహాసం అనాలి. అటు సాహిత్యవిలువలూ, ఇటు సాంఘికవిలువలూ జమిలిగా అల్లిన, కావ్యసదృశమైన శిల్పంతో తీర్చిదిద్దిన మంచి, గొప్ప నవల ఇది.

# నిర్మాణశిల్పం

రచన ఒక నిర్మాణం లాంటిది. కట్టడానికి సౌందర్యాన్ని కల్గించే వాస్తు శిల్పిలాంటివాడే కళాశిల్పి. కట్టడం కట్టినప్పటికీ, అందులో ఆవాసయోగ్యత లేనప్పుడు ఆ కట్టడం వ్యర్థం, అంటే అప్రయోజకం. అప్పుడది నిర్మాణమే కాదన్నమాట. ప్రతిభావంతుడైన శిల్పి, ప్రతిభాదరిద్రుడైన (శిల్పికాని)వాడూ, కట్టే నిర్మాణాల్లో ఈరకమైన భేదం చాలా కన్పిస్తుంది. అందుచేత ఒక రచయిత యొక్క కళాత్మక రచనను విశ్లేషించి దానిలోని నిర్మాణ సంబంధమైన విశేషాలను గ్రహించగల్గితే సాహిత్యవిద్యకు చాలా మేలుజరుగుతుంది. కట్టడంపైకి అందంగా ఉంటూ లోన ఆవాసయోగ్యం కాకుండా కట్టే వాస్తు శిల్పుల్లాగానే, పైపైమెరపుల రచనలుచేసి అందులో ఆత్మని ఉంచలేని రచయితలు చేసే వినాశాన్నుంచి తప్పించడానికి సరైనరీతిలో నిర్మాణమయ్యే సాహిత్యవిద్య యొక్క అవసరం చాలా ఉంది. సాహిత్యవిద్య ప్రతిభావంతుడికి ప్రతిభను కల్గించలేకపోవచ్చును కాని, ప్రతిభావంతుడైన రచయిత యొక్క ప్రతిభకు మెరుగులు మాత్రం పెడ్తుంది. రావిశాస్త్రిగారి మూడుకథల బంగారంలో నిర్మాణానికి సంబంధించి తెలిసికోవాల్సిన అంశాలు చాలా ఉన్నాయి.

కట్టడంలోని ఏ ఒక్క ఇటికను తొలగించినా, ఏ పునాదిరాయిని తీసేసినా, ఏ వంకరను సరిదిద్దబోయినా, ఏ సారళ్యాన్ని వక్రం చేయబోయినా అది దాని ప్రాణాన్ని కోల్పోవచ్చును. అందువల్ల నిర్మాణ అంశాలు ఏవి ఎట్లా బిగించాడోనని రచయిత సృష్టిని పరిశీలించడం చాలా అవసరం.

రచన కేవలం రచయిత యొక్క ప్రతిభా ప్రదర్శనం కాదు. ఆ ప్రతిభ ఒక సాహిత్య లక్ష్యానికీ, ఒక సాంఘిక లక్ష్యానికీ లొంగుతున్నప్పుడే దానికి ఆకర్షణా, సాఫల్యం. రావిశాస్త్రిగారి ఈ నవలలో ప్రతిభ అలా ఒదిగి ప్రసరించింది.

—''నేను సృష్టించాలనుకొన్న కొన్ని పాత్రలు అవి సృష్టించబడ్డాక అవి నా వశం తప్పి పారిపోగా వాటిని నిలబెట్టి ఆపడంలో నాకు కష్టమే కాక నవల రాయడంలో కొంత ఆలస్యం అయింది.''

అని రచయిత ఈ నవలకి రాసుకొన్న ముందుమాటలో చెప్పుకొన్నదాన్లో 'వశం కాక తప్పి పారిపోవడం' అన్నది ప్రతిభను నిగ్రహించాల్సిన అవసరాన్ని చెప్పడమే. రచనా నిర్మాణ లక్ష్యాన్ని - సాహిత్యపరంగానూ, సాంఘిక ప్రయోజనపరంగానూ - అవి తప్పుకొని పారిపోవడాన్ని రచయిత నిగ్రహించుకోవడమే ప్రతిభా ప్రయోజనాన్ని స్పష్టపరుస్తుంది.

ఐతే, ఈ అంశానికి లొంగుతూ ప్రతిభ తన నిర్మాణాన్ని ఎంత గాఢంగా మలచుకొంటే అంతగా రచన రాణిస్తుంది.

ఈ మూడు కథల బంగారంలో బంగారంకోసం తాపత్రయపడిన వీర వేంకట సత్యనారాయణమూర్తి యొక్క మూడవతారాలలోనివి మూడు కథలున్నవి. వీటికి ముందు ఈ నవలలో అత్యంత ప్రధాన పాత్ర అయిన విమల యొక్క తొలి జీవితం 'వియత్నాం విమల వృత్తాంతం' అనే పేరుతో ఉన్నది. అంటే మొత్తం నాల్గు కథలన్నమాట!

(1) వియత్నాం విమల వృత్తాంతం.
(2) ఒకటో బంగారం - బంగారుబాబు కథ.
(3) రెండో బంగారం - బంగారిగాడి కథ.
(4) మూడవ బంగారం - బంగారయ్యగారి కథ.

(ఈ వ్యాసంలో సౌలభ్యంకోసం విమల వృత్తాంతాన్ని విమల కథగా చెప్పుకుందాం.)

ఒక నవలలో నాలుగు కథలేమిటి? అన్న ప్రశ్న ఇక్కడ రాకమానదు. ముందుమాటలో శాస్త్రిగారు 'ఈ మూడు కథల బంగారాన్ని చిన్న కథగా రాయాలని ప్రారంభిస్తే ఇదొక చిన్న నవలగా మారి పెరిగింది' అని రాసికొన్నారు. అంటే ఈ నాల్గింటిలో ఏదో ఒక కథను (విమల కథ మొదటిది కాబట్టి అదే కావచ్చును) రాయదల్చగా పెరిగి పెరిగి అదే ఇలా నాలుగు కథలుగా మారి పోయినదన్నమాట. అంటే, ఒక ఇల్లు కట్టడానికి నాలుగిళ్ళు కట్టారా? ఏ ఇంటికి ఆ ఇల్లేనా? లేక అన్నీ ఏక స్వరూపాన్ని పొందాయా? పొందినాయి కాబట్టే ఇది ఒక నవలగానే ప్రతిష్ఠని ఆర్జించుకొంది.

మొదటి విమల నలభైనాలుగు పుటల కథ. దాని కదిగా సమగ్రమే. అది అంత్యాలు, కార్యకారణ సామగ్రి, పాత్రల సజీవ లక్షణాలు, వాతావరణ

చిత్రణ, సన్నివేశ చిత్రణ, మానసిక సంఘర్షణ, సందేశం అన్నీ పొందికగా ఉన్న కథే ఇది.

అట్లాగే బంగారు బాబు కథ కూడా. ముప్పై నాలుగు పుటల కథ. బంగారుబాబు తల్లిదండ్రుల వివాహం, దారిద్ర్యం, తండ్రీ, తల్లుల మరణం, బావ పంచన చేరడం, అక్క చావడం, బావకి మళ్ళీ పెళ్ళవడం, తన చెల్లెలు బంగారం కోసం తన బావ సవతి బావమరది చేత హత్య కావింపబడడం, మధ్యలో కామూగాడి కుటుంబం కథ - వీటి చిత్రణతో బంగారుబాబు ఎలా ఆర్థికంగా కిందికి జారిపోయి, ఆశ్రయంలేక చితికిపోయాడో చక్కగా చెప్పిన కథ. కథలోని అన్ని అంశాలు ఒకదానికొకటి సమన్వయం అయిన కథ.

ఈ రెండు కథలూ ఉదాత్తమైనవీ, మంచివాళ్ళని గురించినవీ. రెండు కథలూ సుఖాంతంగా ముగియలేదు. రెండు కథల్లోనూ ముగింపులనుంచి ఈ రెండు ముఖ్యపాత్రలూ జీవిత సమరంలోకి దూకినట్లుగా ఉంది. ఆ సమర ఇతివృత్తం లేకపోయినా ఈ రెండు కథలు వాటికవిగా స్వతంత్రంగా నిలువగలిగినట్లుగానే శాస్త్రిగారు చెక్కారు. రెండు కథల్లోనూ ఇతివృత్తం మధ్యతరగతి వ్యక్తులు, దారిద్ర్యం లోతులు చూసినవాళ్ళు. రోజురోజుకీ అడుగుకి జారిపోతున్నవాళ్ళో, పోవాల్సిన వాళ్ళో.

మూడో కథలో బంగారిగాడి కథ. 'నేను సోరుల్లో ఓ శిన్న యీరుణ్ని' (87) అని చెప్పుకొంటాడతను. భాష, అతని పరిసరాలు, వ్యక్తులూ, వ్యవహారాలూ చూస్తే ఇతడు పతితుల ముఠావాడని తెలుస్తుంది. ఈ కథకి ఆశ్చర్యకరమైన ముగింపు ఉంది. పాత్రలన్నీ సజీవ పాత్రలు, ప్రతి సంఘటనా ఎంతో వాస్తవికంగానూ, సహజంగానూ కన్పిస్తుంది. ఈ కథకూడా దీనికదిగా సమగ్ర స్వరూపంతోనే ఉంది. మొదటి రెండు కథల వాతావరణం, సాంస్కృతిక నేపథ్యం లేకుండా ఇది మరీ కొత్తదిగా ఉన్నది.

నాలుగో కథ బంగారయ్యగారి కథ. ఈ కథలోనే ఈ నవలలోని నిర్మాణ సమస్యలకు శాస్త్రిగారు పరిష్కారాలు ఏర్పాటు చేశారు. అందువల్ల ఈ కథ స్వతంత్ర కథకాదు. మొదటి మూడు కథలను ఒక్కనవలగా బిగించిన ఏర్పాటు మనకి నాల్గవ కథలోనే కన్పిస్తుంది.

మొదటి మూడు కథలట్లా స్వయం ప్రతిపత్తితో మనగల్గినప్పుడు వాటికి నాల్గో కథలో ముడివేయకుండా అట్లాగే ఉంచవచ్చును కదా? ఆ మూడింటిని ఏక నవలగా ఎందుకు రూపాంతరీకరించడం?

సాంఘిక ప్రయోజనం కోసరమా? సాహిత్య ప్రయోజనం కోసరమా? శాస్త్రిగారుద్దేశించిన మూల లక్ష్యం నాల్గు కథలని ఏక ఇతివృత్తంగా మలచడం వల్ల ఎక్కువగా నెరవేరుతుందనా? లేక సాహిత్యకళా ధర్మాల ప్రకారం నాల్గు కథలను ఏకీకృతం ప్రతిభావంతంగా చేస్తే సాహిత్యపరంగా ఎక్కువ కళాత్మకమయి అన్ని ప్రయోజనాలూ నెరవేర్తవనా? ఏక ఇతివృత్తంగా మల్చడంలో ఈ అన్ని అంశాలూ ఇమిడి ఉన్నవి. ఒక్క విమల వృత్తాంతమే తీసికొంటే ఆమె వీరనారిగా పెరిగి ఈ నవలలోని రకంగా ఆదర్శమూర్తి. ధర్మమూర్తి కావడానికి నాల్గవ కథ తోడ్పడ్తుంది. బంగారుబాబు, బంగారిగాడి కథల్లోని బంగార్లు కూడా పెరిగిపోయి ఒక మహా ప్రయోజనాన్ని సాధిస్తారు నాల్గవ కథాంశాల వల్ల. అందువల్లనే చిన్న కథగానో, కథలుమాత్రంగానో శాస్త్రిగారు వీటిని ఉంచలేకపోయారు. వీటినన్నింటినీ ముడివేసి జీవితం యొక్క వైశాల్యాన్ని పెంచారు.

ఇందులోని ఏ ఒక్క కథ మాత్రమో అవుతే మామూలు ప్రతిభ చాలును. కాని నాల్గింటినీ మెరిపించి, అన్నింటినీ ఒక్క నవలగా మార్చడానికి అత్యంతమైన ప్రతిభ కావాలి. ఈ రచనలో కన్పిస్తున్నదిదే.

ఒక రచన సారళ్యంతో నిర్మాణమైనప్పుడూ, సంశ్లిష్టతతో నిర్మాణమైనప్పుడూ వాటి ఆకర్షణలో పాఠకునికి భేదం కన్పిస్తుంది. సంశ్లిష్ట రచన పాఠకుణ్ని ఎక్కువగా ఆకర్షిస్తుంది. అంటే, దాని ప్రభావం ఎక్కువగా ఉంటుంది. పాత్రలను సృష్టించి వాటిని పెంచడంలోనూ, వారిద్వారా సన్నివేశ సంఘటనలను సృష్టించి వారిని లక్ష్యంవైపుకి బ్రదికేటట్లు చేయడంలోనూ ఈ సంశ్లిష్టత కన్పిస్తుంది. సన్నివేశాలలోనూ, సంఘటనల్లోనూ ఏర్పడే ముళ్ళు ఈ సంశ్లిష్టతకు హేతువులవుతాయి. రచన అర్థంకావడంలోనే సారళ్యం ఉండాలి తప్ప, రచన నిర్మాణంలో మాత్రం సంశ్లిష్టతే ఉండాలి. నాలుగు కథలను ఏక ఇతివృత్తంగా మలచడానికి అనేక ముళ్ళని రచయిత ఏర్పర్చుకొని నాల్గవ కథలో వాటినన్నింటినీ విప్పుకుంటూపోయారు.

రచన'లోంచి' చూస్తే ఈ నాలుగు కథలను ఎవరు చెప్పారు? లేక ఎవరు చెప్పుకున్నారు? విమల వృత్తాంతాన్ని రచయిత తానుగా రాసినట్లు రచన చేశారు. సాధారణంగా అన్ని నవలల్లోనూ ఇట్లాగే ఉంటుంది. తక్కిన బంగారు త్రయకథలనేమో ఆ బంగారే చెప్పుకొంటాడు. దీన్తో రచనలో ప్రధానమైన భేదం స్పష్టంగా కన్పిస్తుంది. విమల వృత్తాంతంలో విమల లేనిచోట జరిగిన కథ కూడా, రచయితే చెప్తున్నందువల్ల, మనకు తెలుస్తుంది. రచయితే చెప్తున్న కథల్లో ఈ సౌలభ్యం ఉంటుంది కదా! మరి తక్కిన మూడు కథలలో ఈ సౌలభ్యాన్ని కూడా వదలుకొని రచయిత తన పాత్ర ద్వారా కథ చెప్పిస్తాడు దీని వల్ల క్లిష్టత కల్గుతుంది. ఉదాహరణకు - విమల అన్నలు తమ పల్లెటూర్లోని స్థలం అమ్మకం వ్యవహారంలో ఆమె లేదు. అదామె సమక్షంలో జరుగలేదు. విమల పాత్రతో కథ చెప్పించినట్లయితే ఇప్పుడున్న రచనలో ఈ సంఘటన ఎలా ఉన్నదో అట్లా తేలికగా చెప్పడం కుదరదు. అందుకు రచయిత ఇంకా ఎక్కువ శక్తిని ప్రదర్శించాల్సి ఉంటుంది. రెండవ రకం కథనానికి ఉదాహరణగా బంగారయ్య తన కథ చెప్పుకుంటున్నప్పుడు విమల తనని గురించి ఆరా తీసిన ఘట్టాలని ప్రత్యక్ష విధానంలో చెప్పడం సాధ్యం కాలేదు. అక్కడ రామచంద్రయ్య విమలకు బంగారయ్యని గురించి కొంత చెప్పినట్లుగా అతన్తో చెప్తాడు (260).

ఈ రెండు విధానాలలో దేని అందం దానికి ఉన్నది కాని, రెంటినీ ఒకే నవలలో ప్రయోగించడంలో ఆకర్షకమైన సంశ్లిష్టత ఏర్పడుతున్నది. పాత్ర తానుగా (ఉత్తమ పురుష కథనం) కథ చెప్తున్నప్పుడు అతనిమీదనే పాఠకుని దృష్టి కేంద్రీకృతమౌతుంది. ప్రతి అక్షరం అతని కథే ఉంటుంది. అతడు లేని ఘట్టాల్ని చెప్పాల్సి వచ్చినా అతని ప్రమేయం ఉన్నంతవరకే అవన్నీ రచనలో చోటు చేసికుంటాయి. విమల వృత్తాంతం కథలో విమలతోపాటు అంత ప్రాధాన్యాన్ని కల్గిన ఆమె అక్క సరళ కథ ఉంటుంది. కాని, బంగారు కథల్లో ఇతరుల కథ ఉండదు. బైరాగి నాయుడు, రామచంద్రయ్యల వంటి వారి కథాంశాలు నడుమన వచ్చినప్పటికీ కథకుడి (బంగారం) జీవితాన్ని ఎత్తిచూపడానికే అవి ఉంటాయి. రామచంద్రయ్య ఆసుపత్రిలో చేరకపోతే విమల బంగారయ్య జీవితంలోకే వచ్చేదికాదు. అందువల్ల రామచంద్రయ్య వ్యవహారం కొంత (బంగారయ్య కథనానికి వీలయేటంత) రచనలోకి వచ్చి చేరుతున్నది.

ఈ నవలా రచనను ఆకర్షకం చేసిన వాటిల్లో కథనబిందువు లేక దృక్కోణం (వ్యూపాయింట్) రెండు రకాలుగా ఉండడం కూడా. అటు ప్రథమ పురుషకథనం (రచయితే చెప్పడం), ఇటు ఉత్తమపురుష కథనం (పాత్ర తానుగా చెప్పడం) రెంటినీ పోతపోసి ఈ రచనను ఆకర్షకం చేశారీ రచయిత.

ఈ నాలుగు కథల్లోని భాష కూడా ఎంతో వైవిధ్యం కల్గింది. విమల వృత్తాంతం రచయితే చెప్పింది. కాబట్టి, అది మామూలు వ్యావహారికంలోనే ఉంది. అన్నీ మధ్యతరగతి బ్రాహ్మణపాత్రలు కావడంతో వారి భాషలోనే సంభాషణల్ని రచయిత రాశారు. బంగారుబాబు కథ కూడా సరిగ్గా ఇట్లాగే ఉన్నది. బంగారిగాడికథలో మాత్రం కేవలం అధోజగత్తు వ్యక్తులభాష. ఎందుకంటే, బంగారుబాబు ఆ జగత్తులోకి వస్తాడు కాబట్టి. కొన్నిచోట్ల పాఠకులని దయతలచి బంగారిగాడి ద్వారానే కొన్ని వాక్యాలకు అర్థాలు చెప్పించారు శాస్త్రిగారు!

''....ఇయ్యాళ 'జిబాలయంకెళ్ళి గొబ్బిరిగాయ' కొట్టేడు సూర్రావు'' అన్నాడు నారాయన. అంటె సూర్రావు సివాలయానికెళ్ళి కొబ్బరికాయ కొట్టేడన్నమాట'' (134) అంటే ఆ వర్గం వ్యక్తుల భాష ఉన్నది ఉన్నట్లుగా వాడారు శాస్త్రిగారు. సహజత్వంకోసం ఇట్లా మాండలికమే కాకుండా కొన్ని కొన్ని వర్గాల ప్రజల భాషని వాడడం నవలకి స్థాయిని పెంచింది. బంగారిగాడ్ని గురించి సూర్రావు—

''ఈడు మన తెలుగేగాదు అవుసురుం ఒస్తె బేపన తెలుగూ దంచగలడు, ఓమాదిరిగ్గ ఇంగిలిపీసూ ఎలిగెచ్చగల్డు అన్నాడు నన్ను (బంగారిగాడు)గురిచ్చి" (117) అని అన్నట్టుగా బంగారితో అన్పిస్తారు శాస్త్రిగారు. ఈ భాషావ్యవహారం కావాలనే శాస్త్రిగారు పాటించారు. బంగారిగాడు బంగారుబాబుగా మధ్యతరగతి బ్రాహ్మలభాషే మాట్లాడాడు. అట్లాగే బంగారయ్యగా మారినప్పుడున్నూ. ఐతే బంగారయ్యగారి ఇతివృత్తంలో అధోజగత్ వ్యక్తులక్కడక్కడ వస్తారు కాబట్టి వాళ్ళ వాళ్ళ భాషావ్యవహార రీతుల్ని కూడా అక్కడక్కడ ఆ కథలో మనం చూస్తాం. మాండలికం, ప్రామాణికభాష, వర్గాలభాష, కులభాష - ఇన్నింటి వినియోగంజరిగి రచన ఒక జీవితాన్ని నిజంగా చూస్తున్నట్లుగా అన్పింపజేసింది. అందరిదీ, అన్నిచోట్లా ఒక్కటే భాషాపద్ధతి అవుతే సారళ్యంగానే ఉంటుంది

కాని, రచయితయొక్క ప్రతిభావిలసనానికి కాని, నవల సమ్మోహకత్వానికి కానీ అది అడ్డంకిగా మారకతప్పదు.

ఇంక ఈ నవలలో సంశ్లిష్టత నేర్పర్చిన ప్రధానాంశం అయిన నాలుగు కథల్ని ఒక్క పోతగా పోయడంలోని విశేషాలను విశ్లేషణాత్మకంగా చూడాలి.

మూడు కథలను ఏకకథగా మల్చడం అన్న ప్రయోగాన్ని రావి శాస్త్రిగారు 'తప్పు' కథలో ఇంతకుముందే చేశారు.[1] ఆ కథలో పాత్రలలో ఉండే పోలికల్నిబట్టి, ఘటనల్లో ఉండే పోలికల్నిబట్టి, ఫలితాల్లో ఉండే పోలికల్నిబట్టి అందులో ఇమిడిన మూడు కథల 'సంబంధాన్ని' విశ్లేషించడానికి అవకాశం కలిగింది. కాని, ఈ నవలలోని మూడు బంగారు కథల్లోనూ పాత్రల్లో పోలిక లేకుండా చేశారు శాస్త్రిగారు. సన్నివేశాలు కూడా ఏక క్షేత్రానివి కావు వాటి మధ్యన కాల వ్యవధి కూడా చాలా ఉన్నది. తప్పు కథలోలాగా అన్ని పాత్రలకూ కలిపిన ఫలితం ఈ నవలలో లేదు. ఇందులో ప్రధానంగా ఫలితాన్ని అనుభవించినవారు బంగారయ్య - విమలలే. అందువల్ల ఆ కథారచనాశిల్పానికీ ఈ నవలాశిల్పానికీ ఎంతో భేదం ఏర్పడింది.

ఈ నవలలో వియత్నాం విమల వృత్తాంతంలోని విమల మూడో బంగారం కథలోకి వచ్చినప్పటికీ తొలి కథలోని విమలగా పఠితకు మొదట తెలియదు. తొలి కథలోని విమలకీ, మలికథలోని విమలకూ ఉన్న భేదాన్ని సూచించారా శాస్త్రిగారు అన్నట్లుగా వారే చేసిన ఈ వర్ణన చూడండి—

''ఇప్పటి నూరు చిత్రాల తార అప్పట్లో ఆ తొలి చిత్రంలో చెలికత్తె వేషం వేసినట్టు ఆ పెళ్ళి పీటలమీద విమల కొంచెం దీనంగా భయంగా కనిపిస్తోంది'' (45).

విమలలో భయం అన్నమాటని మరెక్కడా ఈ నవలలో చూడం! మరి చివరి కథలో ఆమె—

''అడివిలో వంటరిగా బతికే ఆడదానికి అలా బతకాలంటే ఎన్నో విద్యలు రావాలి, తెలుసా? నీ అండ నాకు ఉన్నా లేకపోయినా నాకు నా దండ ఎల్లప్పుడూ ఉంటుంది''. (312)

1. తప్పు కథను నేనింతకుముందు విమర్శ-మౌలిక లక్షణాలు (తెలుగు ఎకాడెమీ ప్రచురణ) అన్న పుస్తకంలో (64-72 పు.) విశ్లేషణ చేశాను.

అని అంటుంది. ఇట్లా ఆమెలో సహజంగా ఉన్న వీరగుణం స్థిరపడి ఒక స్పష్టమైన మూర్తితో నాల్గవ కథలో ప్రవేశించేటప్పటికి మొదటి కథలోని విమలే. అని అనుకోం. ధనాల వజ్రం అనే వార్డ్‌బాయ్ బంగారయ్యతో

''ఏటి, ఈ ఇయత్తనాం యిమల గురిచ్చేనా తిరవరడిగేది?'' (191)

అని అనటంతో మొదటి కథలోని విమలే ఈమె అని పఠితకు స్పష్ట పడ్తుంది. పఠితకు ఇట్లా స్పష్టపడినప్పటికీ, తన కథ తానే చెప్పుకుంటున్న బంగారయ్య కెట్లా తెలియాలి? అదిట్లా జరిగింది :

—"నేను జవాబు చెప్పలేదు. నాకు ఏదో గుర్తుకొస్తోంది.రాత్రి సమయం. రాములవారి దేవాలయం. గోపురం వెనక జంట దొరక్క ఇంటికి వెలవెలబోతూ వెళిపోతోన్న పడుచు చంద్రుడు. ఆలయంలో మండపంలో మినుకు మినుకుమనే పెట్రోమాక్సు దీపాల గుడ్డి గుడ్డి వెలుగు. అందులో అందాల ఓ అమ్మాయి ఓ చెవల చెవల అబ్బాయికి పుస్తైకడుతూ ఏమన్నది?"

"....కనీసం నాకు పెళ్లాంగానైనా బతుకు" అన్నది. అని చెప్పి నా పక్క నించి చర చర బైటికిపోయింది నా పక్కనించే ఆ చిన్నది!

నేను అప్పుడు ఏం చేస్తున్నాను?

చచ్చు పకోడీలు తింటున్నాను.

నాకు గుర్తు కొస్తోంది. నాకు గుర్తుకొచ్చింది" (186, 187).

విమల కథ దీన్తో ఒకటవ కథని మొత్తంగా నాలుగో కథలో కలిపేసింది. అంతే కాదు, ఈ కథ చెప్తున్న బంగారయ్యగారే అప్పుడు గుడిబైట పకోడీలు తింటున్న చిరుప్రాయపు యువకుడని కూడా తెలిపోయింది. దీన్తో పాఠకుని అనుభూతి విశాలమయి, విమల తొలి కథలో అతనిలో నాటబడిన బీజరూపమైన భావం పెరిగి వృక్షం కావడానికి సిద్ధమౌతున్నది. లేకుంటే విమల కథ ఒకటి, బంగా రయ్య కథ మరొకటి — అంతే. పోగా విమల తొలి కథలో రామాలయం ముందు పకోడీలు తింటూ చూస్తున్న పిల్లవాడికి అసలు ఆ కథలోనైనా అట్లా రావడానికి సామంజస్యం లేకుండాపోతుంది. అతడప్పుడు అట్లా వీరనారిగా చూసిన విమలయొక్క భగ్న వివాహ సంఘటన ఇప్పుడీ నాల్గో కథలో వివాహ సాఫల్యాన్ని పొందబోవడానికి హేతువుకాబోతున్నాడు.

ఐతే, ఆనాడు విమలను చూసి ఏమాత్రమూ కదలిక పొందకుండా సాక్షి మాత్రుడుగా ఎందుకు నిల్చాడు? ఇవేళ ఆమె అందానికి ఎందుకు కదిలిపోతున్నాడు? ఆమె కా చిన్నవయస్సులో అందం లేదా? ఆమె అందాన్ని గురించి ఆ యువకు డొక్కమాట కూడా తొలి కథలో ఎందుకనలేదు? అతడే నాల్గవ కథలో ఆమె అందాన్ని గురించి ఒక పేజెడు వర్ణన చేస్తాడు! దీని కతని పరిస్థితులే కారణం. దానికితోడు అతడు స్త్రీల అందాన్ని చూసి గ్రహించగలిగే ఎదుగుదల ఆ తొలిరోజుల్లో లేదు. తన చెల్లెలి అందాన్ని అతడు పవిత్రంగా చెప్పగలిగాడు కాని, ఆ రోజుల్లో ఎవ్వరి అందాన్ని అతడు చెప్పలేదు. 'దుద్దులు పెట్టుకొని మెళ్ళో గొలుసు వేసుకొంటే అది అయిదేళ్ళ వయసు ఉన్న లక్ష్మీ దేవిలా నా కంటికి కనిపించింది' (65) - ఇట్లా ఉందేది అందానికి అతని స్పందన. పోగా, విమలను మొదటి కథలో చూడ్డానికి కాస్తముందు మద్రాసులో బ్రదకలేక బ్రెయినెక్కి, టికెట్ లేకుండా ప్రయాణం చేసినందుకు నెల్లూరులో జెయిల్‌కీ, ఆ తర్వాత బెజవాడలో జెయిల్‌కీ వెళ్ళి అట్లా అట్లా విశాఖపట్నం వచ్చినవాడు (187). అప్పటి అతని రూపాన్ని శాస్త్రిగారు వర్ణించిన తీరుచూస్తే అందాలను గ్రహించగలిగే స్థితిలో అతడు లేడని మనకి అర్థమవుతుంది —

"....ఆ కుర్రవాడు — చిరిగిపోయి మాసిపోయిన జుబ్బాలో, చింకుల చింకుల దూళి షెరాయ్‌తో, మాసిపోయిన గెడ్డంతో, కళ్ళెంలో కుళ్ళిపోయి పేడతో కలసిపోయిన వరిగడ్డిలాంటి జుట్టుతో — మనిషిలాగే కనిపిస్తున్నాడు కాని హరప్ప తవ్వకాల్లోంచి తవ్వి తీసిన ఆరువేల సంవత్సరాల కిందటి మనిషిలా దీనంగా హీనంగా జాలిగా కనిపిస్తున్నాడు....అతను ఆ సమయంలో వికృతంగానూ వింతగానూ కనిపిస్తున్నాడు కాని, చాలా అందంగాకూడా కనిపిస్తున్నాడు" (47).

తాను అందంగా ఉన్నప్పటికీ ఇతరుల అందాలను చూసే పరిస్థితి కూడా అతనికి లేదు. అప్పుడతను ఆమెలో చూసి బహుశః మెచ్చుకొని ఉన్న గుణం ఆమెలోని వీరగుణమే కావచ్చును. ఐతే, నాల్గవ కథలో ఇదే విమలను ఆమె గదిలో బట్టలు మారుస్తుండగా చూసి "అహో! అందమా, నువ్వు శరత్కాలపు చల్లచల్లని పూర్ణచంద్రుని రేఖవే ...''(178) ఇత్యాదిగా వర్ణిస్తాడు. దీనిక్కారణం 18 ఏళ్ళనుంచి ఈ పాత్ర 30 ల లోకి రావడం, ఆర్థిక పరిస్థితి మెరుగవ్వడం, మొ॥నవి కావచ్చును. ఒక కథలో లోపించిన దానిని ఇట్లా మూడుకథల తర్వాత శాస్త్రిగారు సరైన పద్ధతిలో పూరించుతున్నారు. ఈ పూరణే కాకుండా బంగారు

బాబుకీ, బంగారిగాడికీ పోలిక లేకుండా చేసి, ఇతివృత్తాన్ని సంశ్లిష్టం చేయడం మనకిక్కడ స్పష్టంగా కన్పిస్తున్నది. విమలకూడా తన సహజగుణం అయిన వ్యక్తిత్వభావన, వీర గుణాల్ని కృత్రిమంగా వదులుకొనే భగ్న వివాహం సందర్భంలో పీటలమీద కూర్చున్నది. అయితే, అది ఆమె స్వభావం కాదు– 'ఇప్పటి నూరు చిత్రాల తార అప్పట్లో ఆ తొలిచిత్రంలో చెలికత్తె వేషం వేసినట్లు' అని ఒక చక్కని పోలికని చిన్న విమలకి వేశారు శాస్త్రిగారు. నాల్గో కథలో కాని ఆమె నూరుచిత్రాల తారస్థాయిని పొందలేదు! కాని, బీజరూపంగా ఆమెకా లక్షణం ఉందని సూచించడానికే అట్లా పోల్చారు శాస్త్రిగారు.

ఇట్లాగే నవల నాల్గో కథలోని కనకరాజని ఒక పోస్ట్‌మాన్ పాత్ర. 'అతను విమల తండ్రిగారి ప్రైంనించీ కూడా వారి కుటుంబ భక్తుట్ట" (230) అని బంగారయ్యే అంటాడు. ఈ పాత్రని గురించి ఈ కథలో ఇంతకన్నా వివరాలుండవు. అతణ్ని గురించి బంగారయ్యతో వేయించిన పోలిక 'అతను శ్రీరామచంద్రుడికి ఆంజనేయుళ్ళా ఉండగలిగినవాళ్ళాగే కనిపించేడు కాని, ఆంజనేయుడికి శ్రీరామచంద్రుళ్ళా ఉండగలిగినవాళ్ళా కనిపించలేదు' (230). విమల ఈ కనకరాజుతోనే తన భర్తమీద ఇన్‌కంటాక్స్‌వాళ్ళకు అతని దొంగ వ్యాపారాల రాబడిమీద సమాచారం పంపిస్తుంది. ఐతే, ఈ కనకరాజు ఈ నాల్గో కథల్లో హఠాత్తుగా ఊడిపడ్డవాడు కాదు. విమల తొలి కథలో ఆమె అక్కకు (సరళకు) ఇతడు చిలకలదాసు రాసిన ప్రేమలేఖలు తెచ్చిస్తూ ఉండేవాడు. ఇతని తండ్రి విమల తండ్రి పనిచేసిన రైల్వే ఆఫీసులోనే పని చేస్తూండడంచేత కనకరాజుని వీళ్ళ ఇంట్లో అందరూ ఎరుగుదురు. చిలకలదాసు సరళను వాడుకొని మోసం చేయబోతే తీవ్రంగా అడ్డుకున్నాడు ఈ కనకరాజు. ఆ సందర్భంలో దాసుగాణ్ని కనకరాజు బాగా తంతాడు. ఈ కనకరాజుని పోలీసులు పట్టుకొంటారు. అప్పుడతను-

—''సరళమ్మ తల్లీ, నన్ను శెమించమ్మా! దొంగ లంజికొడుకు ఇంత దగుల్బాజీ లంజికొడుకు అవుతాడనుకోలేత్తల్లీ! ఉత్తరాలందిచ్చి నేను పాపం సేసేన్తల్లీ!'' అని ఏడ్చేడు (23). అప్పుడా సరళ అన్న మాటలు కనకరాజులోని గుణాన్ని పట్టిచ్చేవి.

—''రాజూ, ఏడవకు. ఇందులో నీ తప్పేం లేదు. అయితే నీలో ఒకటే తప్పుంది. రాముడికి భక్తుడివిగా ఉండవలసిన వాడివి శకునికి సేవకుడివో

స్నేహితుడివో అయేవు అదే నీలోని తప్పు. నువ్వు వెళ్ళు'' (23) అని సరళ అతనిలోని గుణాన్నీ దోషాన్నీ చెప్తుంది. సరిగ్గా ఈ దోషాన్నే సవరించి విమల అతణ్ణి బాగుపర్చింది. దాని ఫలితంగానే అతడు బంగారయ్యకు 'శ్రీరామచంద్రుడికి ఆంజనేయుళ్ళా ఉండగల్గిన' వాడుగా కనబడ్తాడు!

తొలికథలో కేవలం దాసుకి సరళకి తార్చినవాడులాగా (సరళకి మేలు జరుగుతుందనే ఆశయంతోనే కావచ్చును) కన్పించిన కనకరాజు పాత్రకి పరిపూర్ణత్వం చివరి కథలో సాధించారు శాస్త్రిగారు. పరోక్షంగా విమల ప్రభావాన్ని ఈ పాత్రమీద సూచించేరు రచయిత. ఈ చివరి కథే లేకపోతే ఈ నవల సంశ్లిష్టతకు కొంత లోపం కలిగి ఉండేది.

బంగారుబాబు కథలో బంగారుబాబు అక్క కూడా చచ్చిపోయి అతని బావ ఇంకో పెళ్ళి చేసికొన్నప్పుడు అతడూ, అతని చెల్లెలూ మానసికంగా నిరాశ్రయులమైపోయామని అనుకొంటారు. అప్పుడు వాళ్ళకి బంగారి బాబు స్నేహితుడైన కామూగాడి కుటుంబం ఊరట కల్గిస్తుంది. ఆ కుటుంబంలోని అందరిమీదా అతనికి ప్రేమ కల్గుతుంది. ఐతే, ఆ కథలో ఈ కుటుంబం పని ఇంతవరకన్నట్లుగానే ఈ రచనలో తోస్తుంది. ఐతే, విచిత్రంగా చివరి కథలో ఈ కుటుంబంతో ఒక లింక్ కల్గిస్తారు రచయిత. బంగారయ్య ఇంటిమీద రైడింగ్ చేసిన ఇన్‌కంటాక్స్ అసిస్టెంట్ కమీషనర్ బంగారయ్యకి కొత్తవాడిలాగే కన్పిస్తాడు. కాని, అతను బంగారయ్యని పక్కకి తీసికెళ్ళి ఒక కవరు ఇస్తూ ఇలా అంటాడు:

—"మా అందరికీ మరొక దారి లేకుండా చేసేరు మీ భార్య. మీరు ఇంతవరకూ చూసుకోలేదనుకొంటాను ఈ కవరు మీద చేతిరాత మీ శ్రీమతి గారి దాన్లాగే ఉంది...." (325) బంగారయ్య అతనికి థాంక్స్ చెప్పాక అతడు మళ్ళీ-

—''ఇదంతా ఇలా జరిగినందుకు నేను చాలా విచారిస్తున్నాను. కాని, నా డ్యూటీ నేను చెయ్యవలసి వచ్చింది. అయితే, ప్రత్యేకంగా నేను బాధపడేది ఎందుకంటే - కామూ మీరు మంచి స్నేహితులట, అమ్మలు కూడా చెప్తూంటుంది. అమ్మలు (కామూగాడి చెల్లెలు) నా భార్య. కామూ స్నేహితుడికి నావల్ల ఇదంతా జరిగినందుకు నేను ప్రత్యేకంగా బాధపడ్తున్నాను" (326) అని అంటాడు. ఇట్లా కామూగాడి ప్రస్తావన తేవడమే కాకుండా ఒక చిన్న లింక్ కూడా ఒకటో బంగారం కథకి వేస్తారు శాస్త్రిగారు. ఇట్లాంటి ముళ్ళని వేయడంచేత ఇతి

వృత్తంలో ఉండే అనేక అంశాలు ఎక్కడికక్కడే పెచ్చలవిడిగా ఎగిరిపోకుండా ఏకసూత్రతను పొంది, రచన కల్గించే అనుభవాన్ని పాఠకులకు గాఢంగా మారుస్తుంది.

ఈ నవలలో కొన్ని సంఘటనలు సినిమాలో ఉన్నట్లుగా జరిపిస్తూనే వాటికి వాస్తవ జీవితంలోని మలుపునిచ్చారు శాస్త్రిగారు. ఆ మలుపుని ఇవ్వక పోతే కథ సరళంగా సాగిపోయేది. కాని, రచనలో గాఢతకోసం చక్కని మలుపు నిచ్చి, దాన్ని జీవిత వాస్తవంగా చెక్కారు శాస్త్రిగారు. తొలికథలో చిలకల ఆంజనేయ దాసుని గురించి చెప్తూ శాస్త్రిగారు - ''అతనికి జీవితం సరిగా తెలియదు; అతను తెలుగు సినిమాల మీద పెరిగాడు'' (18) అని అంటారు. ఏది జీవితమో, ఏది కృత్రిమమోనన్న విషయంలో అగ్రశ్రేణి జ్ఞానం కలిగి ఉన్న శాస్త్రిగారు వ్యంగ్యంగా సినిమా పద్ధతి సంఘటనాసృష్టిమీద బాగా దెబ్బ కొట్టేట్లుగానే శిల్పాన్ని మలుచుకొన్నారు.

విమలను భార్యగా చేసికోవాలనే తపనలో ధనాల వజ్రం చెప్పిన 'అమ్మని లొంగ దియ్యాలంటె మోసవేఁ నీకు మారగం' (203) అని చెప్పిన సలహా చెవి కెక్కగా సీతారాం (సత్తరకాయ) సాయంతో సినిమాటిక్‌గా నాటకీయంగా ఒక సంఘటనను బంగారయ్య సృష్టించడానికి పూనుకొంటాడు. ఎవరో రౌడీలు విమలను అడ్డుకొని బలాత్కరించబోతుంటే సినిమా హీరోలాగా తాను అడ్డుకొని ఆమెను రక్షించడం అన్నది అతడు వేసిన వ్యూహం. దీనికతడు సీతారాంని రంగాకింగుని (కింగురంగా) మరిద్దరు రౌడీలను ఏర్పాటు చేసికొంటాడు బంగారయ్య. రంగా కింగుని పరిచయం చేస్తూ బంగారయ్య - ''వాడు చాలా అందంగా కూడా ఉండేవాడు. కాని, నాకంటికి చాలా నీచంగా కనిపించేవాడు. 'ప్రజాద్రోహి' అనే సినిమా తీస్తే అందులో ద్రోహివేషం వెయ్యగలిగిన వాళ్ళాగా, 'వ్యభిచారాలూ, సుఖరోగాలూ' అనే సినిమా తీస్తే అందులో హీరో వేషం వెయ్యగలిగిన వాళ్ళాగా నాకు కనిపించేవాడు'' (237) అని అంటాడు. ఈ రెండు పోలికలూ సరైనవేనని తాను జరిపించిన సీన్ తర్వాత నిరూపణ కావడం కూడా విశేషం!

ఈ రంగా కింగు విమల గొంతుపట్టుకొని కత్తితో బెదిరిస్తున్నప్పుడు ప్లాను ప్రకారం బంగారయ్య తన బూటుకాలు విసురుతాడు. కాని, ప్లాన్ ప్రకారం వాడి చేతిలోని కత్తి రాలలేదు. వాడు వెనక్కిజరిగి వెటకారంగా నవ్వి భయం

కరంగా మారి కత్తిపిడితో మూతిమీది వాన నీటిని తుడుచుకుంటూ ఇట్లా అంటాడు:

—''గురూ, కాలు కదిపేవంటే ఖతం! ఇప్పుడు చూసేను. ఇది నా సొంత కేసు. ఇది మా అన్నకు పుస్తెకట్టి మమ్మల్ని ఇన్సల్ట్ చేసిన లంజ! దీన్ని నేనెలాగైనా రేప్‌చేసి తీరాలి! కదిలేవంటే చంపేస్తాను!'' (242)

అప్పుడు బంగారయ్య వాణ్ణి మాటల్తో రెచ్చగొడ్తూ ఇట్లా అంటాడు:

—''ఒరే లంజాకొడకా, నేను కూడా ఆవేళ అక్కడున్నాన్రా! మీ అన్న చెవల వెధవ! వాడూ, నువ్వూ ఒక్క తండ్రికి పుట్టినట్టు లేదు! నీకు దమ్ము లున్నట్టున్నాయి....'' (242)

అని - ఈ రంగాకింగుకి బంగారయ్య వేసిన సినిమాల సాదృశ్యాలెట్లా సరిగ్గా సరిపోవడమనే అంశమే కాకుండా తొలి కథలో విమల వివాహం భగ్నమైన సందర్భంతో చివరి కథలో ఇట్లా ముడివేస్తున్నారు శాస్త్రిగారు. ఐతే, అప్పటి పెళ్ళికొడుక్కీ, అతని తమ్ముడికీ సాహసంలోని భేదాన్ని చెప్పకపోతే పీడి ఈ ప్రవర్తన సామంజస్యాన్ని కోల్పోతుంది కాబట్టి టిట్లతోనే ఐనా, వాళ్ళిద్దరి మధ్య నున్న భేదాన్ని శాస్త్రిగారు పై విధంగా తెలిపారు. ఇంతేకాకుండా, పోలీసులచేత ''శేషారావు కొడుకు రంగారావు మీదా, మరో ముగ్గురు గుర్తుతెలియని వ్యక్తుల మీదా ఐపిసి 363 ఇంకా 307 సెక్షన్ల కింద కష్టేం'' (246) అని తర్వాత చెప్పించి, విమల తొలి కథలోని వరహాలరావు తండ్రి శేషారావుని పేరుతో జ్ఞాపకంచేసి రంగాకింగే ఈ వరహాలరావు తమ్ముడు రంగారావుగా తీరుస్తారు రచయిత.

ఐతే, ఇక్కడ మనకు ఒక అనుమానం తప్పక వస్తుంది. ఈ రంగా కింగు ముఠా ఇంత నేరం చేస్తూ విమలని హింసిస్తుంటే విమల ఊరకే చూస్తూ ఉండి పోవడం నిజంగా జరుగుతుందా? ఆమె స్వభావానికిది వ్యతిరేకం కదా! చివరి కథలోనే బంగారయ్య విమలని 'రౌడీలు నిన్ను ఎత్తుకొనిపోబోయినవేళ.... ఈ విద్య లేవీ ప్రదర్శించలేదేం?' (312) అని మన అనుమానాన్నే వెలిబుచ్చగా విమల ఇట్లా అంటుంది :

—''ఎందుకు ప్రదర్శించలేదంటావా? మరి నువ్వు ఆడించిన నాటకంలో అయినా నీకు హీరోగా గౌరవం దక్కనివ్వొద్దా?! అయినా, నీ నాటకం ఆ

రోజున కొంచెం బెడిసికొట్టింది. అయినాసరే, నీ గౌరవం నువ్వు దక్కించు కున్నావు. నాటకం బెడిసేకొట్టకపోతే, నువ్వు నీ గౌరవం దక్కించుకొనే దక్కించుకోకపోతే నీకు నాకూ పెళ్ళి జరిగి ఉండకపోనేమో!'' (313) ఇక్కడ నాటకం బెడిసికొట్టడానికి రంగాకింగు (రంగారావు) చేసిన మోసం కారణం. అతడెందుకు మోసం చేశాడు? అని అంటే, చిన్నప్పుడు తన అన్నని పెళ్ళి పీటలమీద విమల కొట్టి తిట్టి వాడి మెళ్లో తానే మంగళసూత్రం కట్టి ''నువ్వు నాకు మొగుడివిగా ఉండలేవు. అంచేత ఇకమీంచి కనీసం నా పెళ్ళాంగా అయినా బతుకు, ఫో!'' అని అవమానిస్తుంది (న్యాయంగానే). మమ్మల్ని ఇన్సల్ట్ చేసిందని కింగురంగా ఇంకోటి కూడా గుర్తుచేసికొని అంటాడు. అప్పుడు వీడికి పదహారేళ్ళు, ''మా అన్నని కొడ్తావే లంజా!'' అంటూ పెళ్ళి కూతురి చెయ్యి పట్టుకు కరిచీబోయేడు. ఆమె విదిలించుకొని కుడికాల్తో అతని ఛాతీమీద తన్నింది. ఆ కుర్రవాడు వెనక్కి వెల్లకిలా దబ్బునపడిపోయేడు'' (52)

దీనికి అయాచితంగా బంగారయ్య అమాయికతవల్ల దొరికిన ఈ సన్ని వేశంలో పగతీర్చుకొనే అవకాశాన్ని రంగా చేజారిపోనీయదల్చుకోలేదు. అంటే, బంగారయ్య ప్లాను చెడిసికొట్టింది. రంగా విమల పైన నేరం చేయబోతు న్నాడు. తన రహస్యం తెలిసిపోతుందేమో నన్న భయంచేత బంగారయ్య వెనక్కి తగ్గాలి. కాని, ఆ భయం కన్నా, అతనికి విమల మీద ప్రేమనే ఉన్నది. ఐనా, తన రహస్యం తెలిసిపోకుండానే అతడు రంగా కింగుని నేలకరిపిస్తాడు. దీన్నే విమల 'నీ గౌరవం నువ్వు దక్కించుకొన్నావు' అని వివరించింది. అత నిట్లా జరగకపోతే ఈ వివాహమే అయుండేది కాదంటున్నదామె. నాటకం బెడిసికొట్టకుండా సజావుగానే వ్యూహం ప్రకారం ఈ సీను జరిగి ఉంటే మరి ఈ వివాహం ఎందుకు జరిగి ఉండేది కాదూ? పాఠకులకు మరో అనుమానం తప్పక వస్తుందిక్కడ?! ఐతే, దీనికి సమాధానం ఏమిటంటే- తన్నులుతిన్న రంగా గాడికే విమల జ్ఞాపకం రాగా తన్నుకొరికి, లంజె అని తిట్టి, తనతో తన్నులు తిన్న విమలకి మాత్రం వాడు జ్ఞాపకానికి వచ్చి ఉండడా?! కథ సాఫీగానే ఇక్కడ జరిగి ఉంటే విమల బంగారయ్యని ఎట్లా అంచనా వేయాలి? తన జీవితంలో భయంకర పరిస్థితి కల్గించే వివాహ భంగానికి కారణమైన శత్రు కుటుంబవ్యక్తిని చేరదీసి తన దొంగవ్యాపారాలకి ప్రైవేట్ రక్షకుడిగా పోషిస్తున్న బంగారయ్యని ఆమె ఎట్లా వివాహం చేసికొంటుంది?! అందుకే బంగారయ్య వాణ్ని ద్వేషించి, వాణ్ని దెబ్బకొట్టడం జరిగాకనే ఆమె బంగారయ్యకు వాడుపకరణమే తప్ప ప్రేమ తనమీద బోలెడున్నదని నిరూపణ పొందగల్గి పైమాటలన్నది!

ఇట్లా శాస్త్రిగారు మొదటికథలోని సంఘటనలకూ, చివరి కథలోని సంఘటనలకూ హృద్యంగా ముడివేసి అనుభూతికి గాఢత కల్గించారు.

ఐతే, ఇక్కడ మనకి రంగాయొక్క రౌడీ నేపథ్యం విషయంలో అనుమానం రానీయకుండా విమల కథలోనే శాస్త్రిగారు వాణ్ని గురించిన మాటలు కొన్ని రాశారు. రంగా అన్న అయిన పెళ్ళికొడుక్కీ (వరహాలరావు) రంగాకీ ఈ రకమైన భేదం రచయితే ముందు కథలోనే సృష్టించి పెట్టాడు. విమల కథలో వాణ్ని గురించి రాస్తూ శాస్త్రిగారు—

"(శేషారావు యొక్క) మూడో కొడుకు - రంగారావు ఉరఫ్ రంగడు - డింగరాయ గొడ్డూ షోలంగి రాజూ అయిపోయేడు. అతనికి పధ్నాలుగేళ్లు. అతను పదకొండోయేట సిగరెట్టు కాల్చేడు; పదమూడోయేట బీరు తాగేడు; పధ్నాలుగో యేట ఇంట్లోంచి అయిదువందలు ఎత్తుకుపోయి ఇద్దరు స్నేహితుల్తో చెన్నపట్నం వెళ్ళి అక్కడ చిత్రసీమ తారలందర్నీ చూసుకొని, అర్ధరాత్రి ఓ దినం పోలీసు వారు అనుమానించి పట్టుకోగా అక్కడ నెలరోజులు జెయిల్లో ఉండి, తరవాత తండ్రిచేత విడిపించబడి ఇంటికి తిరిగి తీసుకు రాబడ్డాడు. ఆ కొడుకుని శేషారావు రైటాఫ్ చేసేసుకున్నాడు. కొడుకు ఎత్తుకుపోయిన అయిదువందలూ కాక అతణ్ని విడిపించురాడానికి తండ్రికి మరో అయిదు వందలు ఖర్చయింది. 'ఈసారి మళ్ళీ నువ్వు జెయిల్కి వెళ్ళేవంటే నేను నిన్ను విడిపించుకొచ్చే ప్రసక్తే మరింకలేదు' అని కడసారి కొడుకుతో ఖచ్చితంగా చెప్పేసేడతను."(37.)

బంగారయ్య గారి దగ్గర రౌడీ ఉద్యోగానికి కావాల్సిన నేపథ్యాన్నంతా రంగాకి మొదటి కథలోనే శాస్త్రిగారు ఏర్పర్చారు! అంతేకాదు, ఈ చివరి కథలో కింగురంగా, రంగాకింగూ అని పేర్లు పెట్టించిన శాస్త్రిగారే విమలకథలో వీళ్ళని 'డింగరాయ గొడ్డూ, షోలంగిరాజూ' అని అట్లా కూడా ఒక సామ్యాన్ని చూపించి పెట్టేరు.

ఇట్లా అమర్చడం వల్ల ఈ నాలుగో కథ శాస్త్రిగారి ప్రతిభకు వన్నె పెట్టడమే కాకుండా పఠితకు సాంద్రానుభూతిని కలిగించకల్గుతున్నది కూడా.

విమల కథలో విమల అన్నయ్య లిద్దరూ తమ తండ్రి మిగతా ఇంజనీర్ల లాగా లంచాలు పుచ్చుకోనందుకు కోపించి, తమ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళ బాధ్యత

ఏ మాత్రమూ తీసికోకుండా, వేరుపడి తండ్రినుంచి దూరంగా ఉన్నారు. ఓ పల్లెటూళ్ళో ఆ కుటుంబానికి ఉన్న ఓ నాల్గెకరాల ఊషర క్షేత్రంలో ఎవడో పరిశ్రమ పెట్టడానికి కొంటామన్నాడు. ఆ వ్యవహారంలో కరణం మునసబులతో కుమ్మక్కయి, తండ్రిని ఐదువేలు మోసం చేసి వెళ్ళిపోయారు.

ఈ అన్నయ్యల పాత్రల్ని కూడా ఊరకే గాలికి ఎగిరిపోనీయకుండా చివరికథలో వీరివల్లనే ముగింపు ఘట్టాలు జరిగినట్లుగా శాస్త్రిగారు సంఘటింపజేస్తారు. మొదటి కథలో లంచాల పేచీపెట్టి కుటుంబ బాధ్యతలనుంచి, ముఖ్యంగా చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు చేయడాన్నుంచి తప్పించుకొని సుఖంగా బ్రదకడానికి సమష్టి కుటుంబాన్ని వదిలి వెళ్ళిపోయిన వీళ్ళిద్దరూ నాల్గవ కథలో బంగారయ్య దగ్గరికి వస్తారు. వాళ్ళని బంగారయ్య నోట—

"ఓ పెద్ద బరిణలోంచి అదేరకం చిన్న బరిణ తీసినట్టు ఇద్దరూ దాదాపు ఒక్కలాగే ఉన్నారు. వాళ్ళిద్దరూ అందమైన నక్కల్లా ఉన్నారు. కాని నెత్తుల మీద తాటిపళ్ళు లేదా కొబ్బరికాయలు పడ్డ నక్కల్లా ఉన్నారు. వాళ్ళిద్దరూ కుక్కలు తరిమే చెవల పిల్లుల్లా కూడా ఉన్నారు....వాళ్ళని చూడగానే వాళ్ళు చాలా ప్రమాదంలో ఉన్నారని ఎవరికైనా ఇట్టే తెలిసిపోతుంది" [280]

అని వర్ణింపిస్తారు శాస్త్రిగారు. చిన్నప్పుడు వాళ్ళు చేసిన పాపం పండబోతోంది. వాళ్ళు ఆఫీసు డబ్బు దొంగతనం చేసి పోలీసుల చేతుల్లో పడబోతున్నారు. బంగారయ్య దగ్గర ఆ డబ్బు సంపాదించి సర్దుబాటు చేసికొని ప్రమాదంనుంచి తప్పించుకున్నారు వాళ్ళు. ఐతే, మొదటి కథలో వాళ్ళు చేసిన కుటుంబద్రోహం, ముఖ్యంగా విమల పెళ్ళికి పనికివచ్చే భూ విక్రయంవల్ల వచ్చిన డబ్బులో మోసం చేయడం- వీటన్నింటినీ విమల మరువలేకపోయింది. అంతేకాకుండా, ధర్మం విషయంలో ఆమెకు స్వ-పర భేదం లేకపోవడమన్న గుణం కూడా ఉన్నది. అందుచేత విమల తొలికథలో పుట్టిన ఈ పాత్రల వ్యవహారాన్ని ఈ నాల్గవ కథలోకి తీసుకొనివచ్చి వీటివల్లనే బంగారయ్య కథ ముగిసేట్లుగా చిత్రించారు రచయిత. వీరిని పోలీసువాళ్ళకి పట్టించడంకోసం ఆమెనే వాళ్ళకి ఫోన్ చేసింది. కాని, బంగారయ్య వాళ్ళకి డబ్బు ఇచ్చాడు, పోలీసు చిక్కులేవీ రాకుండా కాపాడాడు.

ఇక్కడ విమల రంగాకింగుని ఎట్లా ద్వేషించిందో, తన అన్నల్నీ అట్లాగే ద్వేషించింది. తొలి కథలోని ఘట్టాల పర్యవసానమే నాల్గో కథలో ఇతివృత్తం సాగడానికి చలనశక్తిగా ఉపయోగపడింది. ఈ ఘట్టంలో కూడా శాస్త్రిగారు 1, 4 కథలకి మంచి లింకు పెట్టారు. పాపానికి ప్రతిఫలం ఉండాలన్న రామచంద్రయ్య, విమలల ద్వారా చెప్పిస్తున్న సిద్ధాంతానికి రంగభూమి ఈ నాల్గో కథనే. రచయిత ఈ నాల్గో కథని సృష్టించి మొదటి మూడు కథల్ని కలపక పోయినట్లయితే ఇది ధర్మేతిహాసం అయి ఉండేదేకాదు.

* * *

ఇంతవరకు చేసిన విశ్లేషణలో విమల కథ బంగారు బాబు కథల్లోని అంశాలకీ, నాల్గో కథలోని అంశాలకీ ఉన్న లింకుని గురించి ఉన్నది. రెండో బంగారం ఐన బంగారి గాడి కథలోని కొన్ని అంశాలకి నాల్గో కథలోని కొన్ని అంశాలకి కూడా లింకులున్నాయి. బంగారి గాడి కథలో వీర వేంకట సత్యనారాయణమూర్తే అధో జగత్తులోని నేరస్తుడైన బంగారి గాడిగా అవతారమెత్తి, మోసాలూ పాపాలూ అనేకం చేశాక, ముఖ్యంగా బైరాగి నాయుణ్ణి మోసగించాక "....మా అయ్యా అమ్మా నమ్మిన దేవుణ్ణి ఓ సుట్టుసూస్సి, ఓ సుట్టు ఆ బాబుకి దండపెట్టుకు ఒద్దాం అనిపిచ్చింది నాకు. ఈ దొంగ దార్లంట నన్ను మరిఁక్క తిప్పక నాకో మంచి దారి సూపిచ్చు మా ప్రబో అని ఓ సుట్టు ఆ బాబుని ఏడుకుందాం అనిపిచ్చింది నాకు." (151) ఇట్లా అనుకొని తిరుపతికి రైలెక్కుతుంటే దూదిపులి అనే కత్తి లేని నేరస్తుడు అతని పాత మిత్రుడు కనిపించి ఒక పెళ్ళివాళ్ళు నలభై మంది అంతా కలిసి ఎక్కిన పెట్టె నొకదాన్ని చూపించి వాళ్ళ బంగారం అంతా ఏదో పెట్టెలో దాచివుంచారు. దాన్ని కొట్టేసి "దొక్కిన్దాంట్లా నాకు ఓ కూరాకు ఇయ్యి! నీ దూదిపుల్ని నీ మాఁవఁని మర్సిపోకు" (157) అని అంటాడు. నిజానికి దొంగతనాలకు విముఖుడై తిరుపతికి వెళ్తున్న బంగారి గాడికి బుద్ధి గడ్డి తినడానికి మళ్ళీ ఒక అవకాశం ఈ దూదిపులే ఇప్పిస్తాడు రైలు బెజవాడకి వచ్చాక బంగారిగాడి బుద్ధి దైవం నుంచి, మంచి నుంచీ వెనుదిరిగి దొంగతనం చేసేసి వెనక్కి వెళ్ళిపోతాడు. అయితే మళ్ళీ అతడు దూదిపులిని కలవలేదు. ఏ రకమైన వాటాసీ ఇవ్వలేదు!

ఐతే నాల్గో కథలో చివరి ఘట్టాల్లో తుఫాను వానలో, ఊరంతా లైట్లు పోయిన సమయంలో బంగారయ్య ఇంట్లో ఒక దొంగ పడి అతని నిధి గోడల్లో

దాచి ఉంచిన గదిలో బంగారం గోడల్లో ఎక్కడున్నదని గునపంతో కొట్టి చూస్తూ బంగారయ్యకి ఆ చీకట్లో దొరికిపోతాడు. వాడి చేతులు విరిచివేసిన బంగారయ్యకి వాణ్ణెక్కడో చూసినట్లనిపించి వాణ్ణి హింసించగా వాడు తాను 'దూదిపులి కొడుకున'ని (298) చెప్తాడు. ఎందుకు దొంగతనానికి వచ్చావని అడిగితే వాడిట్లా అంటాడు—

"మా అయ్యవోటా నాకు ఒస్ది"

"ఎందులో?"

"బెజవాడ బంగారం కేస్ల."

"నీ అయ్య అడగలేదే?"

"అడగడానికి అడు సెల్లిపోన్డు." (299)

ఇట్లా రెండో బంగారంలో కథలోని అంశానికి మూడో బంగారం కథలోని ముఖ్యాంశానికి ఆకర్షణీయమైన ముడివేశారు శాస్త్రిగారు. దూదిపులి కొడుకని కాక పేరూ ఊరూలేని దొంగని ఈ చివరి కథలో ప్రవేశపెట్టవచ్చును. కాని అట్లా అయితే విమలని చేసికొన్నాక కూడా అతనిలో ఏ మార్పూ భౌతికంగా రానివిషయం, పాత దొంగతనాల్లో భాగస్వామ్య వ్యవహారాలు విమలకి తెలిసే అవకాశం లేదు. అన్నింటికీ మించి బంగారిగాడి కతలో కొట్టేసిన అంత బంగారం ఏమైందని అనుమానించే పాఠకునికి ఈ పైపట్టం చిత్రణవల్ల ముడి విడిపోతుంది. ఇట్లా తొలికథల్లోని చాలా సంఘటనలకు చివరి కథలో చక్కని లింకు లేర్పరిచారు. బైరాగినాయుడు బంగారిగాడి కథలోనివాడే. నాల్గో కథ చివరలో బంగారయ్యమీద తిరుగులేని విధంగా ప్రభావాన్ని వేయడమేకాకుండా బంగారయ్యలో ధర్మవిషయికంగా 'ఆత్మ' జ్ఞానం (ఎవరూ బోధించకుండానే) కల్గించిన పాత్ర చివరిపేజీలు రెండింటిలోనే వచ్చినా, ఆ పేజీలు తొలగిస్తే ఈ నవలంతా వ్యర్థమా అనిపించేటంత బలంగా ఉన్నది.

ఇట్లా శాస్త్రిగారి నవలలో పటిష్ఠమైన నిర్మాణాన్ని చేశారు.

# పాత్రల పేర్ల వ్యవహారం

ఒక పాత్రను తన రచనలో మొదటిసారిగా ప్రవేశ పెడ్తున్నప్పుడు సాధారణంగా అతని పేరు చెప్పి, అతని రూపాన్ని, వ్యవహార రీతుల్ని (మానరిస్మ్స్) చెప్పడం చూస్తాం. కాని శాస్త్రిగారు కొన్ని పాత్రల విషయంలో ఈ పద్ధతి పాటించరు. కొన్ని పాత్రలకసలు పేరే పెట్టరు. ఉదాహరణకి బంగారయ్య పెంచిన అల్సేషియన్ జాతి కుక్కకు ఆనంద్ అని పేరు పెట్టారు. ఆ కుక్క విషయం ఒక్క పేజీకి మించి వారు చిత్రించలేదు. కాని నవలలో అతి ముఖ్య పాత్ర అయిన విమల తండ్రి కథను చాలా పేజీల్లో చెప్పినప్పటికీ అతని పేరు చెప్పక పోగా, ఇట్లా రాస్తారు:

"విమల తండ్రి - అతని పేరు మీకు అనవసరం. చెప్పినప్పటికీ ఆ పేరు అందరూ మర్చిపోతారు. చివరకు అతను విమల తండ్రిగానే మిగిలిపోతాడు."(9) దీన్తో నిజంగా రచయిత సాధించిదేమీ లేకపోయినా శాస్త్రిగారి ఒక ప్రత్యేక లక్షణంగా ఇది కన్పిస్తుంది. ఆయనది చాలా ఇన్‌సిగ్నిఫికెంట్ పాత్ర కాబట్టి పేరు పెట్టలేదు - అని అంటే అలాంటి పాత్రలు నవలల్లో చాలానే ఉంటాయి. కాని అలాటి వాటన్నింటికీ శాస్త్రిగారు పేర్లు పెట్టారు కదా? (ఒకటి రెండు అపవాదాలున్నాయి దీనికి.) పోగా విమల తండ్రిది నిర్లక్ష్యం చేయాల్సిన పాత్ర కానే కాదు. లంచాలు తినని ఇంజనీరుగా రిటైరయి తన కుటుంబంలో నీతిని ఆదర్శంగా విమలకు చూపినవాడాయన. విమలకు ఆయన తండ్రి కావడం కన్నా, ఆయనకు విమల కూతురు అనతగ్గ ప్రవర్తన ఆయనది!

చిట్టచివరి ఘట్టాల్లో వచ్చిన అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్‌కి శాస్త్రిగారు పేరు పెట్టలేదు. ఆయనని బంగారయ్యతో 'ఎరుపెత్తులావు' అని పించాడు! అంటే - ఎర్రగా, ఎత్తుగా, లావుగా ఉన్నాయన అని! చిట్టచివరి ఘట్టాల్లోనే విమలని పొడిచేశాక, చస్తూన్న ఆమెకు మంత్రసాని పనిచేసిన మిడ్‌వైఫ్‌కి 'అరుణ' అని పేరు పెట్టారు! ఆ పేరుతో ఆమె ప్రస్తావన రెండు

పేజీల్లో కేవలం మూడునాలుగుసార్లు మాత్రమే వస్తుంది. కాని విమల అన్నలిద్దరికీ పేర్లు పెట్టలేదు శాస్త్రిగారు. తొలికథలోనూ, చివరికథలోనూ కథాగమనానికి సంబంధించిన ముఖ్య వ్యవహారాలను రచయిత వారిచేత చేయించారు. ఐనా వాళ్ళని పేరులేకుండానే వ్యవహరించారు. వాళ్ళని పెద్దశవం, చిన్నశవం అని బంగారయ్య వ్యవహరించేట్లు చేశారు శాస్త్రిగారు.

ఇంతకథ నడిపిన విమల తండ్రికి పేరుపెట్టలేదుకదా రచయిత! పైగా పేరుచెప్పినా మీకది జ్ఞాపకం ఉండదు విమల పేరుతప్ప అన్నారు కదా! మరి అంతే ముఖ్యపాత్ర అయిన బంగారిబాబు, బంగారిగాడు, బంగారయ్య తండ్రికి కూడా పేరులేకుండానే వ్యవహరించారు. కాని 298 పేజీలు దాటాక 299 వ పేజీలో బంగారయ్యతోనే—

''సెప్పకపోతె నీ ముక్కు కొయ్యిస్సి నీ నెత్తురు నీ సేతె తాగిచ్చకపోతె నేను బంగారయ్యనిగాను, బ్రలామ్మూరితి కొడుకునూగాను....''

అని అనిపిస్తారు! బంగారయ్య నవలలో ఎక్కడ ప్రవేశించాడు? బంగారుబాబు ఎక్కడ ప్రవేశమైనాడు? అతడి తండ్రిపేరు ఇంత దూరంలోనా చెప్పడం!

పేరు.... మొదట్లో చెప్పకుండా హఠాత్తుగా నవల చివరి భాగాల్లో పేరు పెట్టబడినవాళ్ళలో మరో ముఖ్యపాత్ర బంగారుబాబు బావది. ఒకటో బంగారం కథలో అతనిది చాలా ముఖ్యమైన పాత్ర. బంగారుబాబు, విమలల మీద అతని ప్రభావం వాచ్యంగానే నవలలో అనేచోట్ల చెప్పారు రచయిత. అలాంటి ముఖ్య పాత్రకి రచయిత 174 వ పేజీలో కాని పేరుపెట్టలేదు! అంటే చివ్వరి కథలోనన్నమాట. అతనికిక్కడ ఆయన పెట్టిన పేరు రామచంద్రయ్య అని. బంగారయ్యకి అతడు అక్కమొగుడు - అంటే బావ. తనకి దేవుడు వేరే లేడు ఆయన తప్ప అన్నాడనేకసార్లీ బంగారయ్య. అలాంటి సంబంధం ఉన్నప్పటికీ బంగారయ్య అతని పరోక్షంలో 'మా రామచంద్రయ్య' (179) అని ఒకసారి, 'మా రామచంద్రయ్యని స్ట్రెచర్ మీద పడుకోబెట్టింది' (180) అని ఇంకోసారి, "నాకు రామచంద్రయ్య పాత జాలిజీవితం, అతని మంచితనం....అన్నీ తలపులోకి వచ్చి కళ్ళంట నీళ్ళు తిరిగేయి." (181) అని మరోసారి అంటాడు. తర్వాత ....విమల అతణ్ని 'అతను నీకేమౌతాడు?' అని అడగ్గా '....అతను మా బావ"

(214) అని చెప్తాడతను. మిగిలిన చోట్ల రామచంద్రయ్య అని ఏకవచనంలో అనడం విచిత్రంగా అనిపిస్తుంది. అసలేదో పాత్రని ప్రవేశ పెట్టి దాన్ని ఇక్కడ 'బావ'గా తీర్చినారా? అని కూడా అనిపిస్తుంది. ఎందుకంటే 'రామచంద్రయ్య అని నాకొక దగ్గర బంధువు - చాలా దగ్గిర బంధువు - ఒకాయన ఉండేవాడు' (174) అని ఈ నాల్గో కథలో ఈ పాత్రని ప్రవేశపెడ్తున్నప్పుడే తన బావ అని చెప్పించవచ్చుకదా శాస్త్రిగారు? ఈ పేజీలో రామచంద్రయ్య భార్య, అతని పిల్లలు, కోడళ్ళు, సంపాదన, రిటైర్‌మెంటూ వగైరాలెన్నో చెప్పి కూడా తన అక్కకి మొగుడని కానీ, ఆ తన అక్క చనిపోతేనే ఈ కొత్తావిడను పెళ్ళాడి నాడనిగాని చెప్పడు. హఠాత్తుగా ఈ పాత్రని పాత కథలోని బావగా నిర్ణయించి పేరు పెట్టారా అనిపిస్తుంది.

పేరు పెట్టడంలోని ఆలస్యం ఇలాంటి చిన్న చిన్న నెరసులకి కారణ మవుతుంది.

ఈ నవలలోని మరో ముఖ్యపాత్ర బంగారుత్రయం. బంగారుబాబు, బంగారుగాడు, బంగారయ్యగారులుగా వ్యవహరిస్తూ మూడవ బంగారం కథ మొదట్లో కాని అసలు పేరు చెప్పలేదు అంటే 169వ పేజీలో నన్నమాట! ఒకటో బంగారం కథలో మొదటి వాక్యంగా 'నా పేరు - అసలు పేరు బంగారు బాబుకాదు' (53) అని చెప్పిస్తారు రచయిత. అయితే బంగారంలా మెరిసిపోవడం చేత తన పేరు బంగారుబాబు అన్న ముద్దు పేరుగా మారిందని చెప్పుకొన్నాడతను. రెండో బంగారం కథలోనూ మొదటి వాక్యంగా 'బంగారి గాడంటేనే నన్నందరికీ తెలుస్తి' (87) అని చెప్పిస్తారు రచయిత. ఇక్కడ ఇతనిది ముద్దు పేరు కాదు, బంగారం చోరీ చేసేవాడు కాబట్టి ఇది అన్వర్థనామం! కాని, మూడో బంగారం కథలో మొదటి వాక్యంలో రచయిత ఇతనికి మొదటిసారిగా నామకరణం చేస్తారు! 'నా పేరు కడవలూరి వీర వేంకట సత్యన్నారాయణమూర్తి. కాని అందరూ నన్ను బంగారయ్యగారనే పిలుస్తారు.' (169) ఇక్కడ వ్యవహార నామాన్ని అసలు పేరుకి తర్వాత చెప్తారు రచయిత. కాని, విచిత్రం ఏమిటంటే - అసలు పేరుని ఈ ఒక్కచోట తప్ప ఈ నవలలో ఎక్కడా (పొరపాటున కూడా!) చెప్పలేదు, మరెందుకిక్కడ చెప్పినట్లు?

ఈ పద్ధతి నాక లోపంగానో, అనౌచిత్యంగానో నిర్ణయించడంలేదు కాని, రావిశాస్త్రిగారి ప్రత్యేకతగా మాత్రం చెప్పవచ్చు దీన్ని.

కొన్ని పేర్లకి శాస్త్రిగారు వేసే విశేషణాలు, కొన్ని పేర్లని చెడగొట్టడం వంటివి కూడా మనకి ప్రత్యేకతతో కన్పిస్తాయి. వీరవల్లి విమలకు ఇంటి పేరుతో పాటుగా 'వియత్నాం విమల' అన్న విశేషణంతోనే ఆ కథకు వియత్నాం విమల వృత్తాంతం అని పేరు పెట్టారు శాస్త్రిగారు. ఈ నవల్లో ఎక్కడ కూడా ఈ వియత్నాం విశేషణానికి వివరణ ఇవ్వలేదు. విమల హత్య చేయబడిం తర్వాత మాత్రం 'వీరవియత్నాం విమల శవాన్ని శవపరీక్షకి పంపేదాకా జనం అంతా అక్కడే ఉంది' (323) అని విశేషణానికి ఇంకో విశేషణం వేస్తారు శాస్త్రి గారు. నిజానికిది వియత్నాంకి వివరణే. ఈ గ్రంథం నవలగా 1982 లో అచ్చైనా అంతకుముందే వారపత్రికలో (ఆంధ్రజ్యోతి) సీరియల్‌గా వచ్చింది. అప్పటికే అమెరికాని వియత్నాం గడ్డికరిపించింది. అంత చిన్నదేశం, ఐశ్వర్యమూ, వనరులూ లేని ఆసియాదేశం ప్రపంచాగ్రరాజ్యాన్ని ఓడించి, అవమానించడం ఆ దేశపు వీరగుణాన్ని తెల్పుతుంది. విమలలో ఆ వీరగుణానికి ప్రాధాన్యం ఇచ్చినందువల్ల వియత్నాం విమల అని ఉండవచ్చును శాస్త్రిగారు. నిజానికి ఈ నవలలో రాజకీయాల విషయం ఎక్కడా ప్రసక్తం కాదు. పరోక్షంగా ఒకటి రెండుచోట్ల మాత్రమే రాజకీయాల ప్రభావం, ఒక వార్డ్ కౌన్సిలర్ కావడం లాంటివి ప్రస్తావించబడ్డాయి, అంతే. అంతర్జాతీయ రాజకీయాల ప్రసక్తి అయితే లేనేలేదు. సత్తెరకాయగాడ్ని పోలీసులు చెంపదెబ్బ కొట్టినప్పుడు 'జపానోడి సిటీమీద అమెరికా వోడు ఏటంబాంబు పేల్చినట్టు పేల్చేడు' (103) అని మాత్రం పోలుస్తాడు. అమెరికా ప్రసక్తి ఇంకెక్కడా రాదు. అందువల్ల వియత్నాం అన్నదాని అర్థం మనం ఊహించాల్సిందే తప్ప మరోమార్గం లేదు.

# బంగారం

బంగారం ఈ నవల పేర్లో ఉన్నది. మూడు పాత్రలుగా ప్రదర్శించిన ఒక పాత్రయొక్క మూడు కథల పోత ఈ నవల (వాక్యం ఇట్లా తప్పటం లేదు). ఈ పాత్ర తన జీవితంలో మూడు రకాలైన అనుభవాల్ని పొందుతాడు. ఆ మూడింటిలోనూ అతని దృష్టిలో బంగారం పడక తప్పలేదు. ఒకటో కథలో దారిద్ర్యం, నిరాశ్రయత్వం, బంగారం కారణంగా తనకు ప్రాణాధికంగా ఉండిన చెల్లి హత్య చేయబడడం అన్న చిత్రణ ఉన్నది. బంగారుబాబుగా అతడు ఈ కింది విధంగా చెప్పుకుంటాడు—

"బంగారానికి మా చెల్లి బలైపోయింది.

బంగారం అది మా నాన్న కష్టం. బంగారం అది మా చెల్లి అందం. బంగారం అది మా చినబావ దుర్మార్గం. బంగారం అది నా జీవితానికి నాశనం. బంగారం బంగారం బంగారం బంగారం!"

నేను వెర్రిగా కేకలెయ్యడం మా బావా మా చిన్నక్కా చిన్నత్తా భయ పడ్డం నాకు బాగా గుర్తున్నాయి.

ఆ దినం బంగారం నా జీవితానికి నాందీ వాక్యం."(86) బంగారం అన్న దాన్ని ఐశ్వర్యం అన్న అర్థంలో తీసికోవాల్సి ఉన్నా, బంగారుబాబుకి మొదట్నించీ అసలు బంగారం మీద కూడా దృష్టి ఉండింది. తన తల్లి పుస్తెలతాడు తండ్రి కుదువ పెట్టాల్సి రావడం, మళ్ళీ చాలాకాలం తర్వాత దాన్ని విడిపించుకోగల్గిన సందర్భంలో బంగారుబాబు "నాన్నా, నేనోసారి అది ముట్టుకోవద్దా?" అని అడుగుతాడు. తన జీవితంలో బంగారాన్ని అదే మొదటిసారిగా ముట్టుకోవడం కూడా. అప్పుడు తన తండ్రి తన తల్లితో అన్న మాటలు అతడు బాగా గుర్తు పెట్టుకొన్నాడు. తండ్రి అన్న మాటలు - "అది సంపాదించడానికి ఎంత కష్ట పడ్డానో దాన్ని విడిపించుకురావడానికి అంతకంటే ఎక్కువ కష్టపడ్డాను, తెలిసిందా?"(61) అంత చిన్న వయస్సులోనే తండ్రి మాటల కతడు "బంగారం అంటే అది మనిషి కష్టం...." (61) అని అర్థం చేసికొని, "మనిషి కష్టం =

మంచి బంగారం" (61) అని రాసికొంటాడు. సిద్ధాంతాన్ని ఇట్లా సరిగ్గానే రాబట్టినా అతడు బంగారు నగలు ధరించినప్పుడు అందమైన వాళ్ళ అందం పెరగడం.... గమనించాడు. ముఖ్యంగా తన తల్లీ, చెల్లెలికి. ''మెళ్ళో పుస్తెల తాడు లేనప్పుడు మా అమ్మ పువ్వులన్నీ తెంపేసిన బంతి మొక్కలా బోసిగా ఉండేది. పుస్తెల తాడు మెళ్ళో వేసుకోగానే మాత్రం మా అమ్మ హరివిల్లుతో ఆకాశం వెలిగినట్టు వెలిగింది'' (61) అని అనుకుంటాడు బంగారుబాబు. తన చెల్లిని గురించి ''దుద్దులు పెట్టుకొని మెళ్ళో గొలుసులేసుకొంటే అది అయిదేళ్ళ వయసు ఉన్న లక్ష్మీదేవిలా నా కంటికి కనిపించింది'' (65) అని అనుకుంటాడు. కాముగాడింట్లో బంగారు నగలు వేసికొన్న వాడి తల్లీ చెల్లెలు ముందు, తన చెల్లెలు ఎట్లా ఉందో చెప్తూ "కామూగాడి తల్లికీ చెల్లికీ అన్ని నగలు ఉన్నప్పటికీ, రెండు దుద్దులే మా చెల్లికి ఉన్నప్పటికీ, మా చెల్లే వాళ్ళని జయించేది.'' ఇలాంటిచోట్ల ఐశ్వర్యంగానో, మనిషి కష్టంగానో అతడు బంగారాన్ని చూడడు.

పరిస్థితుల ప్రభావం వల్ల మనిషి కష్టం=బంగారం అన్న సిద్ధాంతాన్ని పీకేసి అతడు కష్టపడకుండానే బంగారాన్ని సంపాదించడానికి పూనుకున్నాడు. అమ్మలి (కామూ చెల్లెలు కాదీమె) మీద మనసు మళ్లుతుంది. అదీ ఆమె మీద ప్రేమతో కాదు. ఆమె అతణ్ని ప్రేమించినా అది పాపం అని ఇతడు తప్పించుకొని తిరిగాడట. కాని రెండేళ్ళ తర్వాత తనకి అదేం పాపం అనిపించలేదు. 'తప్పో ఒప్పో ఏదైన నాకు దాని బంగారం కావాల' (89) అని అనుకుంటాడు బంగారిగాడు! ఈ రోజుల్నించీ అతని సర్వ చైతన్యమూ 'బంగారం' సంపాదించడం మీదనే ఉండిపోయింది. దానికోసం పాపం లేదు, పుణ్యం లేదు. చివరకు కామానికి కూడా ప్రథమ స్థానం ఇవ్వడు. బంగారమూ - స్త్రీ అన్న రెండింటిలో అతని మొదటి ఎన్నిక బంగారమే.

వెన్నెలలాంటి ప్రాకృతిక విషయాలచేత స్త్రీలో సౌందర్యం ఇనుమడించి కనిపించినా అతని మనస్సు దాన్ని 'బంగారం'గా మార్చుకొంటుంది. ఇందాకటి అమ్మల్ని వర్ణిస్తూ అతను "పున్నమి సెందురుడు లెగిసిపోయి అమ్మలొంటి మీద బంగారంలా పెజరిల్లి ఎలుగుతున్నాడు. ఆణ్ణి ఎత్తుకపోయి పెట్లో ఎట్టుకు దాసీసుకోవాలనిపిచ్చింది నాకు" (93) అని అంటాడు. అమ్మల్ని అనుభవించా

లన్న కోరిక కూడా కల్గలేదు! వెన్నెల బంగారంలాగా ప్రజ్వరిల్లుతున్నదనీ, ఆ బంగారాన్ని పెట్లో పెట్టి దాచుకోవాలనీ అన్పించింది!

ఈ రకమైన దృష్టి బలంగా ఏర్పడడమే బంగారం కథల 'ఉత్పత్తి వికాసాలకు' కారణం! 'మనిసీ కష్టం బంగారం.మనిసి మాయ బంగారం' (99) అని బంగారిగాడొకచోట అంటాడు. మనిషి కష్టం బంగారం అన్నది సద్వ్యవస్థలో, మనిషి మాయ బంగారం అన్నది దుర్వ్యవస్థలో. సిత్తర్లేక, సత్తరకాయ అన్న ఇద్దరు నేరస్తులతో కలిసి మనిసి మాయ అయిన బంగారాన్ని సంపాదిస్తాడు బంగారిగాడు. పిక్ పాకెటింగ్‌లో, స్నాచింగ్‌లూ చేసిన డబ్బుని కూడా బంగారంగా మార్చుకుంటాడు బంగారిగాడు. మనిసీ మాయ బంగారం స్థాయి నుంచి బంగారిగాడి కథాంతానికి ఐదువందల తులాల బంగారు నగల్ని రైలు పెట్టెలో కొట్టేసి 'మనిసి కస్టం బంగారం, మనిసి దోపిడి బంగారం'లో మనిసి దోపిడి బంగారంలోకి పడిపోతాడు! (168). బంగారం ఆర్జనలో సిత్తర్లేక చచ్చిపోయాడు. సత్తరకాయ పోలీసులతో గట్టిగా దెబ్బతిన్నాడు. అయినా అతనికి బంగారం మీద వ్యామోహం వదల్లేదు. కాని విమలని ఎవరో దొంగ దేవుడి కొండమీద హత్య చేసినప్పుడు ఎవరో ఆడమనిషి "బంగారానికి బలై పోనావా తల్లే!" (320) అని అనగా బంగారయ్య 'నా బంగారానికి నా విమల బలై పోతోంది' అని వాపోతాడు. తను బంగారాన్ని సంపాదించిన విధానమే ఇందుకు హేతువని అతని సూచన కావచ్చును. అధర్మ సంపాదన నిలువదనే అతని ఉద్దేశ్యం. వ్యవస్థలోని అధర్మానికి మంచివాళ్ళే బలి అవుతున్నారు. కేవల వ్యక్తి అధర్మానికీ మంచివాళ్ళే బలి అవుతున్నారు అనుకుంటాడు బంగారయ్య.

"నా చెల్లి బంగారానికి బలైపోయింది.
నా భార్యని నేనే చేజేతులా బంగారానికి బలిపెట్టుకొన్నాను" (322).

రెండుచోట్లా వ్యక్తుల అధర్మబుద్ధీ, ధనాశా కారణం.

"నా చెల్లి చావుతో నన్ను పట్టుకున్న దెయ్యపు వ్యామోహాన్ని నా విమల తన చావుతో తుడిచిపెట్టింది'' అని బంగారయ్య అప్పుడనుకుంటాడు. నిజానికి వ్యామోహం పోయింది కాని, ఆచరణలో అతనికింకా ఈ బంగారం జాగ్రత్త చేసికొనే వ్యవహారం ఉన్నట్లుగానే కన్పిస్తుంది.

ప్రభుత్వం ఇతని చరాస్తుల్నీ, వస్తువుల్నీ తీసికొన్నా అతని సారా రాబడినీ, విమల పేర్న అతడు బ్యాంక్‌లో ఉంచిన డబ్బుని అందుకోలేకపోయిందనీ, తన కూతురు ఒక ఫకీరు కూతురై పోయిందేమోనని కొంతమంది పాఠకులు భయపడి, బాధపడి ఉండవొచ్చును కాబట్టి తానీ విషయం చెప్తున్నానంటాడు (326).

ఐనా అతని జైలు జీవితంలో అతడికి పూర్తిగా బంగారంమీది వ్యామోహం పోయినట్లు అప్పటి అతని ఆలోచన్లు పరిశీలిస్తే అనిపిస్తుంది.

బంగారం అంటే ఐశ్వర్యం, మానవుడు సృష్టించుకొనేది - ఉత్పాదించుకొనేది. దానికి మూలంగా మానవుడి శ్రమ ఉండాలి. శ్రమ లేకుండా ఉత్పత్తిని ఒకడు, మరొకడు సృష్టించింవాన్ని కొట్టేస్తేతప్ప పొందలేడు. అలాంటి అధర్మం పునాదిగా కల్గేది. శ్రమ కూడా సొంత లాభానికో, సుఖానికో, కుటుంబానికిమాత్రమో లక్ష్యంగాచేస్తే అది మంచి శ్రమ కాదు. ఈ భావాలన్నీ ఈ కింది మాటల్లో బంగారయ్య అనుకుంటాడు:

"భగవంతుడు సృష్టించేడు, సృష్టిస్తాడు అంటారు.
అది కనబడని విషయం.
మానవుడు శ్రమించి సృష్టిస్తున్నాడు.
ఇది స్పష్టంగా కనిపించే విషయం.
దోపిడిదొంగల శ్రమవల్ల ఇతర మానవులకి మంచి సృష్టి జరగదు.
అందరి మానవుల మంచికి శ్రమించేదే మంచి శ్రమ." (327)

జైల్లో వళ్లువంచి పనిచేయడంవల్ల తన మనస్సు నిర్మలమయిందంటాడు బంగారయ్య. ఆ అనుభవమే అతణ్ని శ్రమను గురించి ఆలోచించేట్లుగా చేసింది. ఉత్పాదకుడు కేవల ఉత్పాదనే కాకుండా, దానివెనుకన నిర్మల హృదయం కల్గివుండడంవల్ల సమాజం ఎక్కువ శాంతితో ఉంటుంది. శరీరానికి పనిలేకుండా, శ్రమించకుండా ఉద్యోగ, వ్యాపార, రాజకీయ పదవులవంటివి వ్యక్తుల్లో నిర్మలత్వాన్ని కల్గించకపోవడమే కాకుండా, శ్రమకు అలాంటివి తగిన గౌరవాన్ని ఇవ్వనీయకుండా శ్రమవల్ల కల్గిన ఉత్పత్తిని దోచేట్లుగా చేస్తున్నవి.

''లేమి లేనిచోటా సమానత్వం ఉన్నచోటా మానవులు హాయిగా ఉంటారు. లేమి లేనిచోటూ సమానత్వం వున్నచోటూ ఒక్కచోటే అయితే అదే భూతల స్వర్గం అవుతుంది''

అని బంగారుబాబు ఒకటో బంగారం కథలో అనుకుంటాడు. ఈ ఆదర్శ సాధనే లక్ష్యంగా ఈ నవలలో రాజీలేని ధర్మాచరణ చిత్రించబడింది. సమానత్వాన్ని భౌతికంగా ఆశించి అందుకుగాను కృషిచేయడం ఒక పక్షం కాగా, దానికి ముందుగా మనుష్యుల్లో నిర్మలత్వం ఏర్పడేట్లు చేయాలి. అందుకుగాను శ్రమ సాధనం అంటున్నారు శాస్త్రిగారు. ఉద్యోగుల్నీ, పదవులలోనివాళ్ళనీ, పోలీసుల్నీ, అధ్యాపకుల్నీ — మొ॥న వాళ్ళని—

"ఎన్నుకొనేముందో నియమించుకొనేముందో వీరందరిలో ప్రతి ఒక్కరి చేతా నిర్బంధంగా ఏడాదిపాటు రోజుకూలికి రాళ్ళుకొట్టించో, బొగ్గు త్రవ్వించో, చేపలు పట్టించో, హార్బర్ క్రేన్‌లోని గోధుం బస్తాలని భుజానికి ఎక్కించో, పదహారో అంతస్తు పరంజామీదికి ఇటికలు పట్టుకు వెళ్ళింపించో, మరుగుదొడ్లు తుడిపించో, పేడకట్టెలు వీధుల్లో ఏరింపించో చేసి ఆ రోజు కూలీ డబ్బులమీదే ఆ ఏడాది బతకమని శాసించి అమలు జరిపితే ప్రస్తుతం దేశాల్లో ఉన్న చట్టాల పరిధిలోనే కొంత మంచి పరిపాలన జరగవచ్చునని నేను తెలుసుకున్నాను. అది నిజమని నేను నమ్ముతాను." (328)

శ్రమించని వాడికి తిండి తినే హక్కులేదు. తానెంత శ్రమించాడో అంత దాన్తోనే బ్రదకాలి అని తాత్పర్యం. శారీరకమైన కాయకష్టం ఈ రకం ఉద్యోగాలవాళ్ళు చేసినప్పుడు శ్రమ దోపిడీని, శ్రామికుడి దోపిడీని అపాలనుకోవడమో, ఆపదంమీద సానుభూతి కల్గి ఉండడమో చేస్తారు సమతా సాధనకు, నిర్మలత్వానికీ అది తోడ్పడ్తుంది.

'బంగారం' అన్నది వ్యాజంగా శాస్త్రిగారు ఈ మూడవతారాల బంగారయ్య కథలో ఇట్లా ధర్మప్రబోధం చేశారు. ఈ నేపథ్యంతో చిట్టచివరగా బంగారయ్య బైరాగినాయుడితో నడుస్తూ "రా, దొంగధర్మాలన్నీ విరుద్దాం, మంచి ధర్మానికి నారి బిగిద్దాం, సారిద్దాం" అని తన మనస్సులో అనుకొన్న మాటల అర్థాన్ని ఊహించాలి.

ఈ నవలలోని మూడు కథల్లోనూ బంగారుబాబు, బంగారిగాడు, బంగారయ్యల ఇతివృత్తం చెప్పడంచేత దీనికి మూడు కథల బంగారం అని పేరు పెట్టినట్లనిపించినా, ఈ బంగారాలకి ఒకే రకమైన బంగారంమీది ఆశ, దాన్ని ఆర్జించే విధానం ఉండడంచేత ఇది మూడుకథల బంగారం అయింది.

"మనిషి కష్టం బంగారం
మనిషి మాయ బంగారం
మనిషి దోపిడి బంగారం"

అన్నవాటిలో ఈ నేటి వ్యవస్థలోని శ్రమనీ, మోసాన్నీ, దోపిడీనీ సూచిస్తూ మనిషిధర్మం బంగారం కోసం ఇతివృత్తాన్ని లక్షించారు శాస్త్రిగారు. కొందరు కష్టపడడం, మరికొందరు దాన్ని దోచడం కాదు. ఇంకా కొందరు ఆ కష్టఫలితమైన దాన్ని మాయ చేయడమూ కాదు. ధర్మం వెంద్రుకవానికూడా తప్పనీయకూడదు. అందువల్లే ఏ వృత్తిలోనివాడైనా తప్పక శ్రమజీవనానుభవాన్ని కొంతకాలమైనా పొందాలని శాస్త్రిగారు ఈ నవలలో బంగారయ్యతో అనిపించడం.

# ఇతివృత్తం జరిగిన కాలం – స్థలం – పాత్రల వయస్సు

మూడు కథల బంగారంలోని ఇతివృత్తం ఏ కాలంలో జరిగింది? అన్న దాన్నిబట్టి కొన్ని సంఘటనల సామంజస్య అసామంజస్యాలు తెలుస్తాయి........ కాలం అన్న ఈ అంశం పైకి అంత ముఖ్యం అనిపించదుకాని, లోతుల్లోకి వెళ్ళి చూస్తే ఒక్కొక్కప్పుడు కొన్ని సంఘటనల సంభావ్యతకు ఈ అంశం కీలకాలను ఇస్తుంది. అందువల్ల నవలా విమర్శనంలో కాలం, స్థలం అన్న వాటిని తెలిసికోవడం అవసరం, ఐతే ఇతివృత్తం ఒక కాలానికి చెందిందీ అని అన్నప్పుడు సమర్థుడైన రచయిత రాసిన రచన ఆ కాలానికే చెలామణీ కాగల్గుతుంది కాని దానికి సార్వకాలీనత ఉండదనుకోవడం పొరపాటు. అట్లా అయితే కాళిదాసాదుల రచనలు ఇప్పటిదాకా నిల్చేవేకావు. పోగా కొందరు రచయితలు తాము బ్రదుకుతున్న కాలానికి కొన్ని వేల సంవత్సరాల క్రితపు ఇతివృత్తాన్ని తీసికొనవచ్చును. అలాంటి రచనల్లోనూ కాలం వ్యవహారాన్ని- చారిత్రక పరిస్థితుల కనుకూలంగా ఉన్నదా? లేదా? అని చూడవచ్చును. సమకాలీనమైన కథా వృత్తాంతాన్ని రచయిత తీసికొన్నప్పుడు సాహిత్య పాఠకుడికి ఎంతో మేలు జరుగుతుంది. కొడవటిగంటి కుటుంబరావుగారన్నట్లు—

''ఒక కాలానికి చెందిన నవలల్ని చదివేస్తే ఆ కాలపు సాంఘిక చరిత్ర చాలావరకు తెలిసిపోతుంది. ఈ చరిత్ర ఏ ఒక నవలలో ఉండటానికి వీలు లేదు.''

ఒకే కాలంలోని ఇతివృత్తాన్ని విభిన్న రచయితలు తీసికొన్నప్పటికీ వారి రచనలు ఒక్క రకంగా ఉండవు. వారి ఇతివృత్తం కూడా ఒక్క కోణంలోంచి తీసికోబడదు.

''గొప్ప నవల లెప్పుడూ ఒకదానిని పోలి ఇంకొకటి ఉండవు. ఒక విలక్షణమైన శక్తి కలవాడు వ్రాసిన నవల, అంతకు ముందున్న నవల ఉన్నట్లు ఉండదు.''

అని విశ్వనాథ సత్యనారాయణగారన్నారు. ఇంతేకాదు, ఒకే రచయిత రాసిన రెండు నవలల్లో కూడా వైవిధ్యం ఉంటుంది. ఆ నవలలు రెండూ ఏక కాలపు ఇతివృత్తాలతో రాసినా అందులోని సాంఘిక చరిత్ర రెండు పార్శ్వాలకి చెంది ఉండవచ్చును. అందుకే రచయితతో నిమిత్తం లేకుండా ఒక కాలానికి చెందిన నవలల్ని (గొప్పవాటిని) పరిశీలిస్తే ఆనాటి సాంఘిక చరిత్ర ఇంకెక్కడా తెలిసికోవడానికి వీల్లేనంతగానూ, ఎంతో ప్రభావంతంగానూ తెలుస్తుంది.

ఈ నవలలోని ముఖ్యపాత్ర బంగారుబాబు తాను క్రీస్తుశకం 1934 వ సం॥లో విశాఖపట్నం జిల్లాలోని అనకాపల్లి గ్రామంలో పుట్టినట్లుగా బంగారయ్య గారి కథ మొదట్లో చెప్పుకున్నాడు (169.) అది ఆకలి దశాబ్దం అని వేరే చెప్పనక్కర్లేదు కదా. అందువల్లనే మధ్యతరగతి కుటుంబాలు ఉద్యోగాదులు లేక ఉన్నవాటిని అమ్ముకొనే దుస్థితిలో పడ్డారు. ఈ కాలానికి వచ్చిన నవలల్లోనూ ఈ కాలపు ఇతివృత్తంగా వచ్చిన నవలల్లోనూ (కొన్నింటిలో) ఆర్థికంగా చితికి పోవడమన్న వ్యవహారాన్ని కొందరు గొప్ప రచయితలు ఎంతో వాస్తవంగా చిత్రించారు. వేయిపడగలు, చదువు అన్న నవలలు ఈ దశాబ్దంయొక్క అనేక అంశాలను ఎత్తిచూపుతున్నవి. వేలూరి శివరామశాస్త్రిగారి డిప్రెషన్ చెంబు ఆకలి దశాబ్దం యొక్క దుష్ప్రభావాన్ని సూటిగా చెప్పింది.

వియత్నాం విమల వృత్తాంతంలో విమల పెళ్ళి రణరంగంగా మారి చెడి పోతున్నప్పుడు అవతల పకోడీలు తింటూ సాక్షీమాత్రుడిగా నిల్చిన బంగారుబాబు (అప్పటికే బంగారిగాడిగా అవతారం ఎత్తినవాడు) వయస్సు పద్దెనిమిదేళ్ళు. (46) ఇంతకు కాస్త ముందు అమ్మలితో (రాజమండ్రి వరకు) లేచిపోయినప్పుడు కూడా 'నాకు పద్దెనిమిదేళ్లు ఇంకా దాట్లేదు' (89) అని అంటాడు. అంతకు రెండేళ్ళ ముందే అమ్మలు అతణ్ని ప్రేమించినట్లు చెప్పుకున్నాడు. బంగారిగాడుగా అవ తారం ఎత్తేకే అమ్మలు వ్యవహారం మొదలయి ఉంటుంది. ఇక్కడే 'రావులమ్మతో కలిసి మూడేళ్ళు ముండల కంపెనీ నడిపిచ్చేను' అని కూడా చెప్పికొన్నాడు. వెరసి బంగారుబాబు అవతారం చాలించేటప్పటికి అతని వయస్సు పదిహేను సంవత్సరాలన్నమాట. అంటే సుమారుగా 1949 అన్నమాట. 1949 నుంచి మూడేళ్ళ బంగారిగాడి కథ మనకు కాల విషయికంగా అర్థమౌతూనే ఉన్నది. ఈ మూడేళ్ళలోనూ అతడు కొంత కొంత కాలం జైళ్ళల్లో గడిపాడు. బంగా

రయ్యగారి కథలో ఈ కాలం విషయాన్ని కొద్ది తేడాలో స్థిరపరిచే కింది మాట లున్నాయి:

"నేను నా పదిహేనో యేడు దాటగానే చెన్నపట్నం పారిపోయేను. అక్కడ దమ్మిడీకి చెల్లక, మారక, రెండేళ్ళు అక్కడే రికామీగా బికారిగా బతికి, మరింక బతకలేక ట్రెయినెక్కి టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేసి నందుకు నెల్లూర్లో జెయిలికి వెళ్ళి, ఆ తరవాత బెజవాడలో జెయిల్కి వెళ్ళి అంచెలమీద విశాఖపట్నం చేరుకున్నాను. ఆ రాత్రి చచ్చుపకోడీలు కొనుక్కు తింటూ ఓ గుళ్లోకి వెళ్లేను."(187) అంటే ఇక్కడ అతను గుడి ముందరి సీను నాటికి 19 సం॥ల యువకుడు, భేదం ఎక్కువగా లేదు.

నవల రచనా కాలం 1981. ప్రచురణ 1982. వియత్నాం విమల వృత్తాంతాన్ని రచయితే చెప్పారు ప్రథమ పురుషలో. ఆ వృత్తాంతంలో "ఇప్పటి లెక్కల ప్రకారం అంటే క్రీస్తుశకం 1981 సంవత్సరం - లెక్కలతో ప్రకారం పోల్చిచూస్తే క్రీస్తు శకం 1952 వ సంవత్సరంలో మూడువేల రూపాయీలంటే అది ఎంతో మంచి ఖరీదైన బేరమన్నమాటే." (37) ఇది విమల వరుడికిచ్చే కట్నం విషయం. మాఘమాసంలో అని ముహూర్తం నిశ్చయమయింది. 1952 మార్గశీర్షంలో కట్నం బయానా తీసికొని ఉంటారు. మాఘం సాధారణంగా ఫిబ్రవరిలో వస్తుంది. కాబట్టి విమల వివాహం 1953 ఫిబ్రవరిలో అయ్యుంటుంది. అంటే బంగారుబాబు వయస్సుకూడా కాస్త అటూఇటుగా 1952 - 53 లకు 23 లేక 24 సం॥లన్నమాట.

విమల అక్క అయిన సరళకి చిలకలదాసు వ్యవహారంలో చిక్కుకోడానికి కాస్తముందు, 16 వెళ్ళి 17 నడుస్తోంది. సరళ ఆత్మహత్య చేసికొనే నాటికి 'విమలకి అప్పటికి పదహారుయేళ్ళు....' (28) అని రచయితే చెప్తారు. అంటే సరళా విమలలకి కొద్దివారానే అన్నమాట. బంగారుబాబుకీ విమలకీ ఏడేళ్ళ వారా అన్నమాట.

బంగారుబాబు తండ్రి చనిపోయేనాటికి అతని వయస్సు పదేళ్ళు. (61) అతని చెల్లెలి వయస్సు మూడేళ్ళు (60). తల్లి చచ్చిపోయేనాటికి అతని

వయస్సు 12 సం॥లు. చెల్లి వయస్సు 5 సం॥లు. బంగారయ్య ఆరవయేట అతని అక్కకి బావకి పెళ్ళయింది (57). ఆమె కాపురం చేసింది ఎనిమిది సంవత్సరాలు (75). అతను 15 వ ఏటికి బంగారయ్య అవతారం చాలిం చేశాడు. అంటే అక్కా బావల ఇంట్లో అతనున్నది మూడు సంవత్సరాలు.

1968 నించి అతడు బస్సురూట్లు తీసికొని 1969 కి సారా రెంటర్‌గా అవతారమెత్తాడు. అంటే ఇది బంగారయ్య అవతారం.

పైన రాసిందంతా స్పష్టంగా చెప్తే

1934—1952 → బంగారుబాబుకి 17 సం॥లు
1952—1968 → బంగారిబాబుకి 18 సం॥లు

బంగారయ్యగా అవతారం ఎత్తేనాటికి అతని వయస్సు 35 సం॥ లన్నమాట! విమల వయస్సు - 7 సం॥ వారా కాబట్టి 28 సం॥ లన్నమాట! విమల 1941 లో పుట్టి ఉండాలి. ఈ లెక్క చక్కగా కుదిరింది కూడా.

1971 లో బంగారయ్య బావ హృద్రోగం పాలయి, విమల పనిచేస్తున్న ఆసుపత్రిలో చేర్చబడ్డాడు. ఆనాటికి బంగారయ్య వయస్సు 38 సం॥లు. విమల వయస్సు 31 సం॥లు బావగారు ఆసుపత్రిలో ఉన్నది పదిహేనురోజులు. ఆ తర్వాత చాలా కొద్దిరోజులకే విమలా బంగారయ్యల వివాహం. అది 1971 కాని 1972 కాని కావచ్చు. వివాహం తర్వాత ఎనిమిది నెలలకి ఆమె ఏడునెల్ల గర్భవతి. హత్యాప్రయత్నంవల్ల ఆమె మరణిస్తూ ఆ శిశువుని కన్నది. అంటే ఆమె జీవితం 1972 ని దాటలేదన్నమాట. అంటే 32 వ సం॥లో ఆమె జీవితం ముగిసింది.

కూతురు పుట్టగానే బంగారయ్య జెయిల్‌కి వెళ్ళి, ఆ పిల్లకి ఆరేళ్ల నడుస్తుండగా విడుదల అయ్యాడు. (329) అంటే నలభయ్యో ఏట జెయిల్‌కి వెళ్ళి 46 వ ఏట బైటకు వచ్చాడన్న మాట. స్పష్టంగా చెప్తే—

1968 - 1972 → బంగారయ్యకి 14 సం॥లు.

1972-1978 →జైలు జీవితం - మార్పు. 6 సం॥లు. ఇట్లా ఈ నవల లోని ఇతివృత్తం 1934-1952 వరకు ఒక భాగంగా, 1952-68 వరకు రెండవ కథా భాగంగా, 1968 - 72 వరకు మూడో కథాభాగంగా, 72 నుంచి నవలని

మొదలు పెట్టి ఉండిన (ఐహుశః) 1978 వరకు అంతగా వ్యక్తం కాని నాల్గో భాగంగా కన్పిస్తుంది.

నిజంగా కథ నడిచిన భాగం 1949 నుంచే. అంటే స్వాతంత్ర్య సముపార్జనానంతరమే బ్రిటిష్‌వారి వారసత్వంలో సర్వనాశనమైన పోలీసు వ్యవస్థ ప్రజాస్వామ్య వ్యవస్థకు అనుకూలంగా ఉద్ధరణ పొందకపోగా, బంగారయ్యలాగే రోజురోజుకీ అధఃపాతాళానికి పోవడం, అవినీతి, నేరం, మోసం, దోపిడీ, స్వార్థం, అమానుషత్వం మొదలైన దుర్లక్షణాలు స్వాతంత్ర్యానంతరం సమాజాన్ని చీడ పురుగుల్లాగా పట్టి పల్లార్చడాన్ని ఈ నవలలో రచయిత ఎంతో నైపుణ్యంతో చూపించారు నేరం నేపథ్యం నుంచి సమాజంలో 'పెద్దమనుష్యుల' స్థాయికి చేరి దోపిడీని పెద్ద స్కేల్‌లో చేసిన వాళ్ళ వ్యవహారం మనకి స్వాతంత్ర్యానంతరం బాగా కన్పిస్తుంది. దానికి ప్రతినిధి పాత్రగా బంగారయ్య కన్పిస్తాడు.

అందరూ బంగారయ్యలాగా 'అదృష్ట'వంతులు కారు. బంగారి గాళ్ళలో కొంతమందే అలా 'పైకి' రాగల్గుతారు. చాలామంది దూదిపులిగాడి కొడుకులాగానో, సిత్తర్లేక్కలాగానో శాశ్వతంగా అక్కడే ఉండిపోతారు. లేక చచ్చిపోతారు. సత్తరకాయలాగా కొంతమంది చాలా కొద్దిగా 'పైకి' వస్తారు. రంగాకింగులలాంటివాళ్ళకి గిరాకీ ఎక్కువ. సారా వ్యాపారంలో తటస్థించే ప్రమాదాల నుంచి తప్పించుకోవడానికి ఎక్సైజు అధికార్ల మీదా, పోలీసు అధికార్ల మీదా ఆధారపడితే లాభంలేక, ఒక ప్రైవేట్ ఫోర్స్ ఒకటి ఏర్పర్చుకొని, అందులో రంగాకింగులాంటి రౌడీలకు ఉద్యోగాలిచ్చే సారా రెంటర్లు మనకి స్వాతంత్ర్యానంతరం బాగా కన్పిస్తున్న విషయం. 1949 తర్వాతి భారతదేశంలోని ఒక పార్శ్వం పరమ వాస్తవంగా చిత్రణ చేశారు రచయిత. దేశంలోని దుష్టపక్షం 1949 తర్వాత ఎట్లా ఉందో చాలా వాస్తవంగా తెలిపే నవల ఇది. చివరకి ఆసుపత్రిలో గోడగడియారం పనిచేయకపోవడంగూడా చాలా ఆశ్చర్యకరమైన వాస్తవం. ఇట్లా స్వతంత్రభారతంలోని పెద్ద, చిన్నా విషయాలనేకం మనకి కాలవ్యవధిలో పరమ వాస్తవంగా చిత్రించారు రచయిత.

ఈ నవలలో అనకాపల్లి, శ్రీకాకుళం, ఆముదాలవలస, రాజమండ్రి, బెజవాడ, నెల్లూరు, మద్రాస్‌ల విషయం తక్కువగానూ, విశాఖపట్నం విషయం ఎక్కువగానూ వస్తుంది. ఐతే, కథలోని ఎక్కువ భాగం ఎక్కడ జరుగుతున్న

దనే విషయం చాలా తక్కువగా ప్రస్తావించారు రచయిత. ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డానికి ముందు కాబట్టి 1949 లో బంగారిగాడు మద్రాసుకి వెళ్ళడం చూపాడు కాని, హైదరాబాద్ రాజధాని అయినప్పటికీ 1956 తర్వాతి ఇతి వృత్తంలో ఒక్కసారైనా ఆ ఊరి పేరు ప్రస్తావించక పోవడం విశేషం! బంగా రయ్య రాజకీయాల్లోకి దూరకపోవడం కారణం కావచ్చును.

పాత్రల వయస్సులని జాగ్రత్తగా పరిశీలిస్తే చిన్నప్పుడు విమల తన వయస్సుకి మించిన సాహసం చూపిందనిపిస్తుంది. ఆసుపత్రి ఉద్యోగంలో ఆమె ఒంటరి. అటు ధనాల వజ్రం వంటి తక్కువస్థాయి ఉద్యోగస్తులతోనూ, డాక్టర్ల వంటి పైఉద్యోగస్తులతోనూ అవినీతి కారణంగా ఆమెకు సఖ్యత లేదు. నీతి మంతులు అట్లా బ్రతుకగల్గడం విశేషం. ముఖ్యంగా ఈ నవలా కాలంలో విమల తండ్రి లంచాలు తినని ఇంజనీరుగా బ్రతికిన స్వాతంత్ర్య పూర్వకాలం కన్నా నీతిపరులకి తర్వాతి కాలం ఎంతో గడ్డుకాలం! అయినా శాస్త్రిగారు ఆమె పాత్ర చిత్రణను హేతువుకి నిల్చేటటువంటిదిగానే చేశారు.

రంగా కింగుతో సీను జరిపించిన ఘట్టంలో బంగారయ్యకి అలాంటి నేర విషయాలలో కూడా పోలీసులు సాయం చేయడం అన్నది ఈ నవలా కాలంలో విచిత్రమేమీ కాదు! బంగారయ్య 'గారు' జెయిల్ ఘట్టంలో అన్న ఈ కింది మాటలు ఘరానా నేరస్తుల విషయంలో మనం రోజూ చూస్తూనే ఉన్నాము.

— "ఉండాలంటే నేను జెయిల్లో సుఖంగానే ఉండగలిగేవాణ్ణి.

కాని అందుకు నేను ఇష్టపడలేదు. నన్ను సుఖంగా ఉంచేందుకు వప్పు కోలేదు" (327).

ఈ మాటలు ఇలాంటి పెద్దమనుష్యులకి వ్యవస్థ ఎట్లా పాక్షికంగా ఉంటుందో తెల్పడమేకాక ఈ కాలపు ఆత్మని శాస్త్రిగారెట్లా పట్టుకోగలిగారో కూడా తెల్పుతాయి.

రెయిడింగ్ చేసిన ఇంకంటాక్స్ ఆఫీసర్ అన్న 'మా అందరికీ మరొక దారి లేకుండా చేసింది మీ భార్య' (325) వంటి మాటలు ఈ కాలపు గౌరవా లెలాంటి వ్యక్తులకు లభిస్తాయో తెల్పేవి. ఇవి చిన్న నేరస్తులకి లభించవు! సత్తర కాయ బంగారయ్యతో అన్న కింది మాటలు చోరన్యాయంలో కూడా ఎగుడు దిగుళ్ళని రక్షకశాఖ ఎట్లా కల్గిస్తుందో తెల్పుతాయి:

—"బంగారిగురూ, దినాలు ఎలా మారిపోనాయో చూసేవా?! మునుపు అవతల సందుకాడ ఏ అవాకాని ఎర్రటోపి అవుపిచ్చినా ఇవతల సందులోకి దూరేసేవోడివి; ఉప్పుడో? ఎయ్యి రూపాయిాల టోపీలు నువ్వు అవుపిస్తే సాలు నీకు సెల్లూట్ సేస్తన్నాయి!...." (236)

బంగారిగాడికీ, బంగారయ్యగారికీ ఈ కాలంలో అంత తేడా!

పైన చేసిన కాలం మీది ఆలోచనల్లవల్ల ఒకటి రెండు సాంకేతికమైన లొసగులు ఈ నవలలో తెలుస్తాయి. బంగారిగాడి కథ 1968 వరకే ముగిసింది. ఆ రచనేమో బంగారిగాడే స్వయంగా చెప్పుకొన్నది బంగారయ్య అవతారం చాలించాక 'కొన్ని ఘట్టాల్ని ఓ స్నేహితుడిచేత రాయింపిం'చింది. (170) బంగారిగాడికి సూర్రావు పెద్ద బైరాగి నాయుడి సీను జరిపించాక చెప్పిన 'హితబోధ'లో క్రయింబ్రాంచి పోలీసుల మీద ఈ మాట లంటాడు:

—"ఇట్టవొంటి....నా కొడుకులకి నువ్వు నిక్కపోయ్యేవో ...'లక్సలైట్లు సాయుద పోలీసులపై దాడి సెయ్యగా సాయుద పోలీసులు జరిపిచ్చిన కాల్పుల్లో అగ్గేతవెక్తి మరనం'గా పేరు లేకుండ పేపరెక్కుతావుగాని బంగారిగాడిగా మరిక్కమిగలవు!" (152) కాలరీత్యా ఈ సాదృశ్యం పొసగనిది. శాస్త్రిగారే కథనం జరిపితే తానుగా ఈ మాటలు రాస్తే పొసుగుతాయి.

వైట్‌హౌర్సు (డాక్టర్) ఆసుపత్రిలో బ్యాంగీ (బంగారయ్య)తో చమత్కారాల సంభాషణ సాగిస్తున్న ఒక తరుణంలో జనమంతా అక్కడ మూగగా వాళ్ళ వెనుకన బంగారయ్య తన బావ కూడా నిలబడి ఉండడం చూస్తాడు. విమల కూడా అతణ్ని గమనించి 'రామచంద్రయ్యగారూ, రెస్టు తీసుకోకుండా ఇక్కడ కెందుకొచ్చారు?' (258) అని అంటూ అతని దగ్గరకు వెళ్ళింది. అప్పుడు బంగారయ్య వర్ణన ఇట్లా ఉంది.

—'మా బావని విమల అలా పలకరించగానే అక్కడ చేరిన డాక్టర్లూ నర్సులూ అంతా కూడా కొంత చల్లబడ్డారు; హిప్పీలు నక్సలైటు ఖైదీని చూసినట్టుగా అతణ్ని వింతగా చూస్తూ అతనికి ఎడం ఎడంగా జరిగిపోయారు.' (258)

ఈ ఘట్టం జరిగింది 1971లో అప్పటికి నక్సలైటు ఖైదీలకుధర్మాత్ములన్న ఇమేజి ఇప్పటిలాగే లేదు— అందునా మధ్యతరగతి జనంలో. అతణ్ని వాళ్ళు వింతగా చూసి ఉండకపోవచ్చును కాని, పోలికమాత్రం పొసిగేది కాదు.

బంగారిగాడి కతలో ఇలాంటి ఇంకో లొసుగు ఉంది.

''తొండ ముదిరి ఊసరిల్లి అయినట్టు దొంగ ముదిరి దొరవతాదండి. దొర రంగుమార్చి రాసకీయ నాయకుడవుతాడండి. ఈళ్ళని పోలీసోడు కాపాడతాడండి. ఈళ్ళందర్ని దేవుడు దీవిస్తడండి. ఇదంత ఇలా కాకూడదన్నాడు నా దినంల కమ్యూనిష్టండి, మీ దినాల్ల లక్సలైటండి '' (108)

ఇక్కడ ఈ రెండూ కాలరీత్యా బాగా పొసిగే మాటలు. కాని, ఈ నవలలోనే పెరిగి పుష్టి సంపాదించుకొన్న మాటలు కావివి. ఈ రచనలో పైవిధమైన మాటలు ప్రాణం పోసికోలేకపోవడానికి కారణం అలాంటి వాతావరణం ఎక్కడా చిత్రణ కాకపోవడమే— సూచ్యంగా కూడా లేకపోవడమే. ఈ నవలలో ఏ పాత్రకీ ఈ నేపథ్యాన్ని చూపలేదు రచయిత. పోగా, అలవోకగా ఇలా రెండు మూడుచోట్ల అనిపించడమేకాని, ఏ పాత్రకీ ఈ కమ్యూనిస్ట్, నక్సలైటు సానుభూతిని పొరపాటున కూడా చిత్రించలేదు శాస్త్రిగారు. 75లోని ఎమర్జన్సీ జైలునివాసం రచయితమీద ప్రభావాన్నివేసి ఉండవచ్చు. దాన్నైనా రాజకీయ నేపథ్యంతో ఈ నవలలో చిత్రించకుండా, అవినీతి, పాపపుణ్యాలు, శ్రమ అవసరం అన్న సాధారణ అంశాలపై వివేచనకు వాడుకొన్నారు రచయిత. ఏ పాత్రకీ ఈ నవలలో వర్గదృష్టికాని, వర్గచైతన్య-సంఘర్షణ సానుభూతికాని ఉన్నట్లు చూపకపోగా, ఈ నవలలోని జీవితం తర్వాత బంగారయ్యకి అలాంటి ప్రేరణకల్గి ఇందులోని అతని అవ్యక్తజీవితంలో అదే ఆలంబనం అన్న సూచనైనా చేయలేదు శాస్త్రిగారు. చివరి సంభాషణైన ''దా బైరాగినాయుడూ దా! ధర్మంకోసం వెళ్దాం రా!'' అంటూ బంగారయ్య మనస్సులో 'దా, దొంగ ధర్మలన్నీ విరుద్దాం, మంచి ధర్మానికి నారి బిగిద్దాం, సారిద్దాం' (329). అని అనుకొంటాడు! కనీసం ఇంతమాత్రపు మాటైనా పైకి అనడు! అట్లా అని అవతలి పాత్రకు 'చైతన్యం' కల్గించడు. తానింకా పాపాత్ముణ్ణనే అనుకుంటున్నాడు కదా! బైరాగినాయుడిలాంటి పుణ్యాత్ముడికి అతడు కల్గించే 'చైతన్యం' ఏముంది? అని అంటే నిజమే. మరి బైరాగి నాయుడుకైనా 'ధర్మం' మీద ఊరకపు నక్సలైటు మొగ్గు ఉన్నట్లు ఎక్కడా సూచన లేదు!

అందుచేత నేరం, పాపం, అన్యాయం, అన్నవాటికి ఖండనచేసి సచ్ఛీలం, పుణ్యం, న్యాయం వెరశి ధర్మం అన్నదానికి ప్రతిష్ఠాపనం చేసే నవలగా మిగిలిన ఈ రచనలో కాలరీత్యానూ, నిర్మాణరీత్యానూ పైన చూపినటువంటి పోలికలు చిన్న లొసుగులుగానే నిల్చిపోతాయి.

# బంగారయ్య ఆత్మవిమర్శ

బంగారయ్య అని అంటున్నప్పటికీ బంగారు త్రయం అనే ఉద్దేశం. ఈ నవలలోని ఇతివృత్తాన్ని నడిపించి పైకి కిందికీ కదలించిన పాత్ర బంగారు పాత్ర. మూడవతారాలెత్తినా, ప్రతి అవతారంలోనూ అతడు చేసికొన్న ఆత్మ విమర్శ ఏకవ్యక్తి ఆత్మవిమర్శలాగానే కన్పిస్తుంది. చివరి రెండు పేజీలవరకు ఇంచుమించుగా నవల అంతా ఇతని కోసరమే, ఇతనిద్వారా తన ప్రధానోద్దేశ్యం వెలుగులోకి రావడం కోసరమే రచించారు శాస్త్రిగారు. పాత్రలు వశం తప్పి పోతే వాటిని పట్టుకొని ఆపడంలో తనకు కష్టమైందని రచయిత రాసిన వాటిల్లో ఈ పాత్ర ముఖ్యపాత్ర కావచ్చును. రచయిత నిగ్రహించకపోతే ఈ పాత్ర సర్వ వినాశకరమైన పాత్ర అయి ఉండేది. అందువల్ల దీన్ని నిగ్రహించడంలో రచయిత ఈ పాత్రతో చేయించిన ఆత్మవిమర్శ బాగా తోడ్పడింది.

బంగారు బాబు కథలో దీని అవసరం రాలేదు. తర్వాతి రెండు కథల్లోనే ఈ ఆత్మవిమర్శ కొద్ది కొద్దిగా కన్పిస్తుంది.

బైరాగి నాయుడి సీను జరిపించాక బంగారిగాడు అతడు చేసికొన్న ఆత్మవిమర్శ ఆ పాత్ర పరిణామానికి దోహదం చేసేది. సూర్రావు పెద్దు ప్రతివాదం చేసి అతణ్ని పాపాత్ముడిగానే ఉంచేయబోయినా, నవల చివరి వరకూ, బంగారిగాడిలోని ఈ సంక్షోభం కలవరపరుస్తూనే ఉన్నది. ''బైరాగి నాయిడి అపరేసన్ మేం జేసింతర్వాత నాకు మనసు ఇకలం వైపొయ్యి సెదిరి పొయ్యింది. ఏట్రా? నేనెక్కడ బుట్టేను? ఎందుకు బుట్టేను? ఎలా పెరిగేను? ఇల్లా ఎందుకయ్యేను? నేను మంచిగ ఉండి సెడిపొయ్యేను. సెడ్డగా మారి బాగు పడ్డాను. దేఁవుఁడే ఉంటె ఇలా జరగడం నాయెఁవా!? బైరాగి నాయిడి బతుకు బద్దల్జేస్సి నన్ను అందలం ఎక్కిచ్చే దేవుడు ఎల్లాటి దేవుడు? అని నేను పెస్నిచ్చుకున్నాను. పాపం పెంచడవేఁగాని నీతిని పెంచదా ఈ దేవుడు అని పిచ్చింది నాకు. బైరాగి నాయిడి బిడ్డ యేడుపు నా మనసుని ముక్కల్సేస్సింది.

దేవుడే ఉంటే ఆ బిడ్డ అలా ఎందుకేడాల? దేవుడు ఆ యేడుపుకి ఏటి సమాధానం జెప్తాడు, ఆ ఏడుపుని ఎలా సల్లారుస్తాడు? నా కేటి బోద పళ్ళేద్దు"(150)

ఇట్లా చాలా హేతుబద్ధంగా ఆత్మ విమర్శ చేసికొంటాడు. జరిగిన సంఘటననుబట్టి ఇట్లా ఆలోచించగల్గినవాడు తప్పక బాగుపడగల్గినవాడు, ముందుకు పోగల్గినవాడు. ఇలాంటి విమర్శచేత పాత్ర పారిపోయి విచ్చలవిడి కాకుండా నిలుస్తుంది. ఈ పాత్ర కొన్నిచోట్ల చాలా నిజాయితీతో పాపానికి దూరంగా ఉండాలని తీవ్రంగానే ప్రయత్నిస్తుంది పై విమర్శ చేసికొన్నాక, కొంతకాలానికి దొంగతనాలు మానేసి మంచివాడు కావాలనీ, దానికి ముందు తిరుపతి వెంకటేశ్వర స్వామికి దండం పెట్టి రావాలనీ బయలుదేర్తాడు. రైలు పెట్టెలో బంగారం చాలా ఉందనీ, దోపిడీ చేయమని దూదిపులి చెప్పినా - బంగారిగాడన్న మాట "....నేను దేవుడికాడికి ఎళ్తున్నాను. మనకి ఇలాటి ఊసులన్ని అనువుసురం" (158) అని! కాని, వెంటనే అతడు రైలు పెట్టెలో విధవరాలి వ్యామోహంలో పడి 'నాలాటి దొంగలం దేవుడు జెప్పినసరె మంచికి మారం అని జెప్పడవేఁ నా అసలు ఉద్దేసం' (160) అని అనుకుంటాడు! మళ్ళీ కొంచెంసేపు కాగానే అదే ప్రయాణంలో తన గతాన్ని (చిన్ననాటిని) స్మరించుకొంటూ—

—"నాకు నా పొద్దినాలన్ని, కళ్ళముందు కదిల్నాయి. నేను అలా ఉండిపొయ్యేను. ష్టార్టింగుల ఆ నా బతుకేటి! ఉప్పుడు ఈ నా బతుకేటి? ఆ సల్లగాల్లూ, ఆ లేతనవ్వులూ, ఆ కలవపువ్వులూ అయన్ని ఏట్రైపొయ్యేయి? ఈ సిల్లర కంపులూ ముదర నవ్వులూ దొంగనోట్లూ ఎక్కడకాణ్ణిచ్చి ఎందుకొచ్చినాయి? ఆ యెలుగంత ఎక్కడికి పొయ్యింది? ఈ సిమ్మసీకట్ల నేనెందుకు పడిపొయ్యేను?"(165) అని అనుకుంటాడు. దారిద్ర్యంలో మగ్గినా తన బంగారు బాబు నాటి దినాల్ని హాయి అయిన రోజులుగానే భావించడం, అప్పటి రోజుల్ని వెలుగు రోజులుగానే భావించడంతోపాటు ఇప్పుడు తాను గడుపుతున్న రోజుల్ని చీకటి రోజులుగా తెలిసికోగల్గడంతోపాటు తానిలాంటి బ్రదుకులోకి ఎందుకు పడిపొయ్యేను? అని విచికిత్స చేయడం గొప్ప లక్షణం. అప్పుడప్పుడు ఇట్లాంటి ఆత్మవిమర్శ చేసికొంటూ పాఠకునికి అతడు మారబోతున్నాడా అని ఆశ పెడ్తుంటాడు బంగారు. ధనాల వజ్రం చెప్పినట్టు, 'పది నిమిషాలు పట్టుమని ధరమరాజులుగ వుంటే, మనం మిగత రోజంత దురోదన దూస్సేసనుల్లాగ

యిజారించబించేస్తం. మన్తో ఉన్న దేంజిరే అది!'(201) ఈ మాటకి అవునని కానీ, కాదని కానీ చెప్పక పోయినప్పటికీ ఈ లక్షణం బంగారులో నిజంగా ఉన్నది. పోతే, దీన్ని తెంచుకొని చాలా మంచివాడు కావాలనే తపన అతనిలో ఉంది. అందుకని మంచివాళ్ళని చూసినప్పుడు అతడు వాళ్ళ మంచితనం ముందు తన నైచ్యాన్ని జ్ఞప్తి చేసికొంటూ ఉంటాడు విమల అతడేవృత్తి చేస్తాడని అడిగినప్పుడు—

"ఆమె కళ్ళు నల్ల దీపాల్లా ఉన్నాయి ఆమె పాలరాతితో చెక్కిన పావన మూర్తిలా ఉంది.

'నేను సారా వ్యాపారం చేస్తున్నాను' అని ఆమెతో ఆ సమయంలో చెప్పడానికి నాకు ఎందుకోగాని సిగ్గు వేసింది. నేను ఆమెముందు దేముడి గుళ్లోకి ప్రవేశించిన దొంగ దెయ్యంలా నిల్చున్నాను "(208)

అని అంటాడు! ఈ లక్షణం అతనిలో ఉంది. ఈ ఆత్మవిమర్శే అతణ్ని ప్రతి క్షణమూ మార్పుకి దగ్గర చేసింది. తాను లేకుండా తన విమల మాత్రమే తమ ఇంట్లో ఉన్న చివరి ఘట్టాల్లో ఒకచోట బంగారయ్య ఇలా అనుకుంటాడు:

"దూరంనించి నా మేడ మెరపుల్లో ఎత్తుగా ఓ గుడిలా నాకు కనిపించింది.
నా ఇంట్లోకి నేను దొంగలా వెళ్ళేను.
ఆ ఇంట్లో విమల మంచంమీద దేవీవిగ్రహంలా కూర్చుంది" (302).

మంచివాళ్ళముందు ఈ రకమైన ఆత్మవిమర్శా ఫలితంగా వచ్చే మాటలు అనుకొంటుంటాడు బంగారయ్య.

బంగారయ్య ఆత్మవిమర్శలో రెండంశాలున్నాయి. ఒకటి-తను ఇంతకు ముందటి జీవితం అట్లా ఎందుకు గడిపాడు? రెండు-ఆ జీవితం ఇప్పటి జీవితాన్ని కాటేయకుండా ఉండాలంటే ఏమి చేయాలి? తానొక మంచి మనిషిగా మారడానికి ఈ రెండు పార్శ్వాలూ తన ఆత్మవిమర్శలో ఉంచడం అవసరమే. గొప్పతనం ముందు, ధర్మం ముందు తాను సరళంగా, సాఫీగా ఉండలేని ప్రతి ఘట్టంలోనూ అతడు పై రకంగా విచికిత్స చేస్తుంటాడు. విమలకి తన వృత్తిని గురించి సజావుగా సమాధానం చెప్పలేనప్పుడు అతను లోపల లోపల ఇట్లా అనుకుంటాడు—

"ఛస్, నాకీ సిగ్గేంటి? ఛస్, నాకీ భయమెందుకు? ఛస్, నేనెందుకు పాపాల్చేసేను? ఛస్ ఛస్, నేనెందుకు హీనంగా బతికేను? నేనెందుకు ఎందర్నో క్రూరంగా హింసించేను? ఈమెలానే నేను కూడా ఎందుకు పవిత్రంగా ఉండలేక పోయేను?''

ఈ మాటల్తో అతనికి విమల ఆదర్శం కూడా అయిపోయిందని తెలుస్తుంది.

ఇక్కడినుంచి ఆమె ముందు తన నేరాల్ని, నేరమూలంగా ఉండే వ్యాపారాల వ్యవహాల్ని నిజాయితీగా ఒప్పుకొంటుంటాడు బంగారయ్య. ఐతే, అది అవసరం వచ్చినప్పడే చేస్తాడు. ఆమె ధర్మనేత్రానికి కనబడకుండా వ్యవహారాలను యుక్తిగా సాగిస్తుంటాడు. ఐనా, అతనిలో తాను పుణ్యాత్ముడు కావాలనే ఆశయాన్ని పసిగట్టి విమల తొలిరోజుల్లో ''నాకు ఎందుకు అలా అనిపిస్తుందో చెప్పలేనుగాని, నువ్వు చెడిపోయిన శ్రీరామచంద్రుడిల్లా నాకు అవుపిస్తున్నావు!" (214) అని అంటుంది. ఈమెనే కాదు-నేరగాడు సత్తెరకాయ (సీత్రాం) కూడా ''పర్లేదు, నీ రుదయం మంచిది. కిస్మత్ సిన్మాల యీరో లాటోడివి! మన సిన్నప్పటి కిస్మత్, అసోక్కుమార్ యీరో'' (234) అని అంటాడు బంగారులో మౌలికంగా ఉన్న మంచితనాన్ని ఈ పాత్రలు గుర్తించినవి. అంతేకాకుండా, నిజంగానే ఇతడు తానెందుకిట్లా అయినానని బాధపడ్తుంటాడు. మారడానికి ప్రయత్నిస్తుంటాడు. తన వివాహానికి కాస్తముందుగా బావ చేసిన ధర్మబోధ వినగానే ''అలనాడు నేను జారవిడిచేసుకున్న నా జాలిజాలి జాలితనం ఆనాడే అందులోనే పోగొట్టుకున్న నా బేలబేల బేలతనం, మురికి కాలువలోకి చేజేతులా విసిరి పారేసుకున్న అలనాటి నాది ఏ మాయా లేనితనం, నిజమన్నా, న్యాయమన్నా, ధర్మమన్నా, సోదర మానవుల యెడల ఉండవలసిన ప్రేమాభిమానాలన్నా నాకు ఉన్న నమ్మకాలన్నీ తెంపి పారేసుకున్న నా తొందరపాటుతనం నా తక్కువ బుద్ధితనం కూడా నా గుండెలు గుభేల్మనేలా గుర్తుకొచ్చేయి.'' (264).

ఇట్లా తనకు ఉండాల్సినవి, ఉండినవి, ఉండకూడనివీ స్పష్టంగా తెలివిడి అయినవి, బేలతనం, అమాయకత్వం, సత్యధర్మాలమీద, మానవత్వంమీద

ప్రేమాభిమానాలు- వీటిమీద తనకున్న నమ్మకాలని తెంపుకుని రాకానీలాగా అవడం బుద్ధితక్కువతనమనే విచికిత్స అతనికి కల్గింది. తాను ఈ విచికిత్సలో పడి ధర్మం వైపుకి ఆకర్షితుడౌతున్నాడు కాబట్టే ఒకచోట "పాపుణ్ని అయినప్పటికీ ఆమెని పెళ్ళేడేక కొంతకాలానికి పవిత్రుణ్ని అయిపోతానుకదా అని సరిపెట్టుకొన్నాడు" (227) అంటే తానుగా ప్రయత్నం చేయకుండా ఆమె మీద అందుకుగాను ఆధారపడ్డాడు. దీన్ని బలపరుస్తూ ఇంకోచోట ''నన్నామె మనిషిగా మార్చేరోజులు త్వరలోనే రాబోతున్నాయని ఆ రాత్రి నేను ఊహించలేకపోయాను'' (278) అని అంటాడు. తనలోని మార్పుకి ఆమెమీద ఆధారపడ్డాడు అతడు! కాని, ఆమె హత్యానంతరమే అతడు బాగుపడ్డాడు (బహుశః); తనని గురించి అధికార్లకి అంతా చెప్పేసి తన శిక్షకు కారణమయ్యి కూడా 'అది తప్పుకాదు, అలా చెయ్యడం అది ధర్మమేనని' ఆమె అభిప్రాయపడగా, 'అయితే సరే విమలా! నా అభిప్రాయం కూడా అదే! నేను ఒప్పుకున్నాను' (324) అని అంటాడు. విమలవల్ల అతని 'బంగారం' అంతా సర్వనాశనమయి పోయినప్పటికీ అతనికి విమల మీద రవ్వంత కోపం, ద్వేషం కల్గకపోగా, ప్రేమ తరగకపోగా జ్ఞానోదయం కూడా అయినట్లుంది. రామచంద్రయ్య ప్రబోధంతో చేసినదానికంటె కూడా విమల తన భార్యగా ఉంటూ 'చేసి చూపిన' ప్రవర్తన వల్లనే బంగారయ్యలో ఆత్మవిమర్శ - మంచికోసం మార్పు ఎక్కువగా కల్గినట్లు అనిపిస్తుంది.

ఈ పాత్ర పెరుగుదలకీ, పుష్టికీ, సజీవత్వానికి ఇతని ఆత్మవిమర్శే ఒక ప్రధాన కారణం.

# స్త్రీ పురుషులు – శీల విషయం

ఈ నవలలో శాస్త్రిగారు విమల పాత్రని, ఎక్కడా (సాంప్రదాయకమైన ఆలోచనా రీతిలోని విలువల ప్రకారం) పతనం పొందనీయలేదు. శీలం విషయికంగా ఆమె వ్యక్తిత్వాన్ని నిల్పుకోవడమూ, అవమానాన్ని భరించకపోవడమూ అన్న గుణాలతో ఉన్నట్లుగా కూడా చిత్రించారు రచయిత.

విమల బావ విమలని చెడ్డ దృష్టితోనూ భావంతోనూ పెళ్ళి చేసికొంటా నన్నప్పుడు ఎంతో ధైర్యంగా ఆమె తన బావకు మాటల్లోనే బుద్ధి చెప్పింది. పెళ్ళి పీటల మీద కట్నం కారణంగా తనని అవమానిస్తున్న వరహాలు మెళ్ళో తానే మంగళసూత్రం కట్టి, వాడి తమ్ముణ్ని తన్ని తన వ్యక్తిత్వాన్ని కాపాడుకొంది భార్యా బాధితుడైన డాక్టరొకడు ఆమె వెంట పడినప్పటికీ ఆమె జారిపోలేదు. శ్రీకాకుళంలో నర్సుగా పనిచేసినప్పుడున్నూ ఆమె సచ్ఛీలం కీర్తి అన్ని దిక్కులా వ్యాపించింది. వజ్రాల ధనం మాటల్లో చెప్పాలంటే '....కేరట్టరు విసయంల అమ్మ నిజ్జెవైన ఒజ్జిరం. సిగాకోలం నిచ్చి ఒచ్చిన వొర్త ఏటంటె, అమ్మ మొగసీవ(ని గూడ మంచ(వెక్క-నియ్యదూ అని! అమ్మ ఇక్కడికొచ్చి నాక అమ్మనిష్టెడీ సేసి సెప్పిన అందరి మాటకూడ అదేమాట....' (200) పురుషుల విషయంలోని హిపోక్రసీని, అవినీతి బుద్ధిని విమలచేత సరిగ్గానే అవగాహన చేయించారు శాస్త్రిగారు. అందుకే రత్తాలు రాంబాబు నవలలోకూడా రత్తాల్ని ఇట్లాగే రక్షిస్తూ వచ్చారు శాస్త్రిగారు. విమలని ఎట్టి పరిస్థితుల్లోనూ, చెడిపోవడానికి ఎంతో అనువైన వాతావరణంలో ఉంచికూడా, వయస్సు ముదుర్తున్నప్పటికిన్నీ జారిపోనీకుండా కాపాడడంలో శాస్త్రిగారెంతో దీక్షగా, శ్రద్ధవహించారు.

ఐతే, ఆమెనిట్లా తీర్చినా కామం అంశ లేనిది కాదామె. దాన్ని ఆమె సంతానోత్పత్తికే పరిమితం చేసిందా అన్నట్లుగా ధనాల వజ్రం బంగారయ్యతో మాట్లాడిన మాటల వల్ల అర్థం అవుతుంది. చావడానికి ముందు బంగారయ్యకు రాసిన లేఖలోనూ బోల్డు బిడ్డల్ని కందాం అని రాసింది విమల. ఆచరణలో

ఎట్లా ఉన్నప్పటికీ ప్రాచీనులు వివాహ ప్రయోజనంగా చెప్పిన అంశం ఇదే. సరిగ్గా విమల ఆచరణలోనూ, మాటలోనూ ఈ అభిప్రాయమే కల్గింది. విమల ఇలా అగ్నిలాగా ఉండడంలో ఆమె అక్క చిలకదాసులచేత మోసగించబడి ఆత్మహత్య కావించుకోవడం, ఒక బావ ఆమెని కామించడం, వరహాలనే వరుడు చవటలాగా ప్రవర్తించడం లాంటివి కారణాలు కావచ్చును. పురుషుల మీద ఆమెకి తీవ్రద్వేషం ఉన్నదని చెప్పలేము కాని, వారిని అంత తేలికగా ఆమె విశ్వసించలేని నేపథ్యమే ఉంది. బంగారయ్య కూడా ఆమెని చూసి ఎంత ఆకర్షితుడైనప్పటికీ, అతనికి తనమీద ఉన్న ప్రేమకానీ, ఆకర్షణకానీ చూసి ఆమె అతనికి లొంగలేదు. శారీరకంగా పూర్తిగా సమర్పించుకోవడమన్నది కూడా శాస్త్ర సమ్మతంగా, రాములవారి గుళ్లో వివాహం జరిగాకనే ఆమె చేసింది! ఇక బంగారయ్యకే లొంగిపోవడంలో ఆమె మనస్సులో ఎలాంటి ఆలోచన చేసిందో రచయిత చాలా తక్కువగా చెప్పినప్పటికిన్నీ, చెడిపోయిన శ్రీరామ చంద్రుళ్ళా ఉన్నావని అన్న ఒక్కమాట ఆమెకతనిపై కల్గిన అభిప్రాయాన్ని చక్కగా సూచిస్తుంది.

నిజంగా కూడా బంగారయ్య చెడిపోయినవాడు. లైంగిక సంబంధాల్లో కూడా అతడు బాగా చెడిపోయినవాడు. అమ్మల్ని లేవదీసికొని వెళ్ళి పూర్వావ తారంలో మోసగించినవాడు. రైల్లో విధవరాలితో అసమగ్రమైన సరసం సాగిం చినవాడు. ముండల కంపెనీ పెట్టి నడిపినవాడు. బంగారయ్య అవతారంలో కూడా స్త్రీ విషయంలో విమల ప్రవేశించేటంతవరకు సచ్ఛీలుడైనాడని దాఖలా లేదు. ఇలాంటివాణ్ణి విమల వివాహమాడింది. తనకి పిల్లల మీద ఉన్న ఇచ్ఛ వంటిదే అతనికి ఉండడమన్నది ఆమె అతన్ని వివాహమాడడానికి హేతువైంది. అంతేకాని అతని శీలం కాదు.

ఐతే శాస్త్రిగారు ప్రధాన పురుషుల పాత్రలలో పట్టించుకొనని ఈ శీల విషయం ప్రధాన స్త్రీ పాత్రలకి పట్టించుకోవడం విచిత్రంగా అగుపిస్తుంది. చిలకల దాసుతో చెడిపోయిన సరళని ఆత్మహత్మ చేసికొనేటట్లు చేస్తాడు. కాని అదే బంగారయ్య చేతిలో అగ్నిలాంటి విమలను పెట్టాడు! ఇతివృత్తాన్ని ఎక్కడా సరళవంటి స్త్రీలపై కేంద్రీకరించడం (ఎందుకోగాని) వారికి ఇష్ట మున్నట్లు లేదు. అక్కడక్కడ వ్యభిచారం చేసిన స్త్రీలను, జారిణులను చూపడని

కాదు. కాని అలాంటివారిమీదికన్నా, సచ్ఛీలం శారీరకంగా కూడా ఉన్న స్త్రీల మీదనే శాస్త్రిగారికి గౌరవం ఉన్నది. సామాజికంగా ఉన్న ఈ విలువ శాస్త్రిగారి మీద బలంగా పని చేస్తున్నది.

ఇట్లాగే పురుషుల విషయంలో కూడా సామాజికంగా ఉన్న ఆచారమే శాస్త్రిగారిమీద బలంగా పనిచేసింది. బావపాత్రకి రెండు వివాహాలు చేయడం ఇట్లాంటిది. విమల ఎట్లా బ్రహ్మచర్యంతో ఉండిందో ఒక భార్య మరణించాక బావని అట్లా ఉంచవచ్చు కదా! అందువల్ల ఈ రకంగా భావించాల్సి వస్తున్నది. స్త్రీ పురుషుల శీల విషయంలో ఇలాంటి భేదం ఈ రచనలో కనిపిస్తున్నది.

పోగా, విమల పాత్రని పేరు దగ్గరినుంచీ ఎంతో జాగ్రత్తగా తీర్చిదిద్దిన శాస్త్రిగారు మొదటి భర్త సంయోగంలో 'తుపానులా చెలరేగిపోయింది, సముద్రంలా పొంగిపోయింది, జలపాతంలా ఉరికిపోయింది, అగ్ని జ్వాలలా ఎగసిపోయింది, వెన్నలా కరిగిపోయింది, నీటి కాలవలా పారిపోయింది. పాములా బిగిసిపోయింది, పువ్వులా విడిపోయింది, మంచుగా కురిసిపోయింది. చివరికి చంద్రకాంతిలా నా గుండెలమీద ఉండిపోయింది' (278) అని బంగారయ్యతో అనిపిస్తూనే 'కన్నెచెర విడిపోడంలో అంతటి అమర పరమ సౌఖ్యం ఉంటుందని ఆమెకి అంతకిముందే తెలిసివుంటే ఆమె కన్నెచెరలోంచి ఏనాడో బైటకి వచ్చేసి ఉండునేమో?' (278) అని, అనిపించడం ఆ పాత్రని అంతకు ముందు తీర్చిన పద్ధతికి వ్యతిరేకంగా ఉంది. విమలను గురించి భర్త అట్లా అనుకోవడంలోని అనౌచిత్యం అట్లా ఉండగా, విమలకున్న మహదాశయానికి వ్యతిరేకంగా కాలు జారుడు వ్యవహారం ఆమెకి ముందే ఉండేదని భావించడం తప్పు. అది వివాహం ద్వారా కాగూడదా అంటే, ఆమె వివాహాన్ని అమర పరమ సౌఖ్యం 'కోసం' భావించనేలేదు. ఆ విషయం బంగారయ్యకి బాగా తెలుసు. ఆమెని వివాహం చేసుకోవడానికి అతడు వేసిన వ్యూహమే 'నాకు బిడ్డలు కావాలి' అన్న మాటతో ఆమెను ఆకర్షించడం! స్త్రీల శీల విషయంలో శాస్త్రిగారు సంప్రదాయిక పద్ధతికే కట్టుబడ్డారు. దాన్లో అనుమానం లేదు. అది మంచిది కూడా. కాని, పురుషులని కూడా అట్లాగే చిత్రిస్తే ఇంకా మంచిది. కట్నం, లంచం, అవినీతి, అధర్మం- ఇవి లేకపోవడంతోపాటు శీలవిషయకమైన స్వచ్ఛత కూడా కుటుంబాన్ని కాపాడ్డానికి చాలా అవసరం. జాతి ఆరోగ్యానికీ అవసరం. పురుషుల విషయకంగా కూడా విమలలాంటి ఏర్పాటు జరిగివుంటే ఎంతో హృద్యంగా కూడా ఉండి ఉండేది.

# ప్రయోజనాత్మకమైన వర్ణనలు

నవలలో కవితాత్మకమైన వర్ణనలు అందరూ చేయలేరు. చాలా తెలుగు నవలల్లో కవితాత్మకమైన వర్ణనలు ఎక్కువగా కన్పించవు. విశ్వనాథ, బుచ్చి బాబు, రావిశాస్త్రిగారి వంటి అత్యల్ప సంఖ్యాకులే కవితాత్మకమైన వర్ణనలు నవలల్లో చేశారు.

కవితాత్మకమైన వర్ణనలంటే ఏమిటి? నవలలోని పాత్రల మానసిక స్పందనలను, మామూలు మనుష్యులు లోకరీతిలో అనుకొన్నట్లుగా కాకుండా, ఆలంకారికంగానో, వక్రోక్తితోనో వర్ణించడం కవిత్వాభివ్యక్తి రీతులలో ఒక ప్రధానమైన పద్ధతి. దీన్నే ధ్వన్యాత్మకంగా స్థాయి పెంచి వర్ణించడం ఇంకొక పద్ధతి. పాత్రల రూపాన్ని చిత్రంలో దించినప్పుడుండే సౌలభ్యం సాహిత్య రచనలో ఉండదు కాబట్టి, పాత్రల రూపం కళ్ళకు కట్టడం కోసం రావిశాస్త్రిగారి లాంటి మహా రచయితలు ఉపమాలంకారాన్ని, అక్కడక్కడ రూపకాన్ని ప్రయోగించారు. ఇదికూడా కావ్యాలలో ఉన్న పద్ధతే.

మహా కావ్య రచన వేరు, ఖండ కావ్య రచన వేరు. మహా కావ్యంలో ఇతి వృత్తంలోని అన్ని అవయవాలు శిల్ప రీత్యా అఖండతను (ఏకతను) పొందడమే కాకుండా ఒకదాన్ని ఒకటి సూచిస్తే కావ్యానుభవం - రసానుభవం - గాఢంగా కల్గుతుంది. దీనికితోడు కావ్యంలో అక్కడక్కడా సందర్భవశాత్తు చేయాల్సి వచ్చిన ప్రకృతి వర్ణన కాని, పరిసరాల వర్ణన కాని ఉచితంగా చేయబడి, కావ్యానుభవాన్ని పెంచేదిగానూ, సూచించేదిగానూ ఉంటే ఆ కావ్యం అగ్రశ్రేణికి చేర్తుంది. నవలల్లో ఈ మహా కావ్య శిల్ప పద్ధతిని ఒకరిద్దరు మహా రచయితలే ప్రవేశపెట్టారు. నవల సామాన్య పాఠకుణ్ని దృష్టిలో పెట్టుకొని వచ్చిన ప్రక్రియే అయినప్పటికీ, కొందరు రచయితల ప్రతిభ ఈ స్థితిని దాటి ప్రసరించింది. కొందరు సిద్ధాంతాలు, వాదాలచేత సామాన్యుడికి పఠన సౌలభ్యాన్ని తగ్గించారు. వారికన్నా ఈ కవితాత్మక రచనా పద్ధతి మేలు! ఎందుకంటే, ఇందులో హృద్యత ఉండడమే కాకుండా, ఇది రచనయొక్క సాహిత్యత్వాన్ని రెట్టింపు చేస్తుంది

కాబట్టి. ఐతే, రావిశాస్త్రిగారు పాఠకుల సౌలభ్యాన్ని తగ్గించకుండా తన పోలిక కాని, వర్ణన కానీ ఎందుకో వాచ్యంగా కూడా చెప్తారు! అంటే వర్ణనలో కవిత్వ పరమైన తన ప్రతిభను చూపిస్తూనే, నవలా రచయితగా దాన్ని వాచ్యంచేసి పాఠకులకు సౌలభ్యాన్ని కల్గిస్తారన్నమాట. ఈ క్రింది రెండుదాహరణల్ని పరిశీలిస్తే ఈ అంశం స్పష్టపడ్తుంది.

I ''బంగారయ్య కుక్కకి ఎవరో విషాహారం పెట్టి చంపారు. దేనికీ చలించని అతను ఈ వార్తకి చలించిపోయాడు. అప్పుడతను అనుకొన్న ఊహలివి.

II. "మామూలీ రోజుల్లో ఒడ్డున వచ్చే కెరటాలు మనతో అయిదారేడుల పాపల్లా ఆడుకుంటాయి. మనవల్ల వాటికీ భయం లేదు. వాటివల్ల మనకి కూడా ఏ భయమూ లేదు. ఇష్టపడ్డ ఇరుగు పొరుగు వాళ్ళల్లా ఉంటాం మనమూ సముద్రమూ!

III. కాని మరో మూడురోజుల్లో తుఫాను రాబోతూందనుకోండి, అప్పుడు ఈ కెరటాలే, మూడురోజుల ముందుగానే, తమ పద్ధతి మార్చేస్తాయి; పొరుగింటి మంచిపిల్లల్లా కాకుండా పొరుగింటి రౌడీ ముఠాలా తయారవుతాయి; ఎగురుతాయి, దుముకుతాయి నిస్సాకారంగా. తలలు విసురుతాయి, అతి కోపంగా అరుస్తాయి. దాన్నిబట్టి, ముందుకి గాలివాన రాబోతోందని మనం గ్రహించుకోవచ్చు.

IV. ఆ విధంగా నాకు ఆ దినం (1) ముందుకి ఏదో ప్రమాదం జరగ బోతోందని నాకు కొంచెం భయం వేసింది. అరగని అన్నం కడుపులో బరువుగా కూర్చున్నట్టు నాకు గుండెల్లో ఆ భయం బరువుగా కూర్చుంది. (2) స్వంత **తోబుట్టువుల తప్పుల్నే క్షమించని ఈ వియత్నాం విమల నా తప్పులన్నీ ఆమెకి తెలిసిపోయిననాడు నన్ను క్షమించి నాతో కాపరం చేస్తుందా, నన్ను బతకనిస్తుందా?**" (294)

ఈ ఘట్టంలోని పై మాటలన్నీ కావ్యశిల్పంతో రాసినవి. IVలోని బొద్దు అక్షరాలున్న వాక్యం (2) అసలు భయం కల్గిస్తున్న విషయం. అసలా భయం అతణ్ణి కీడు శంకింపజేస్తున్నది. అదే (1)లోని ప్రమాదాన్ని శంకింపజేస్తున్నది. ఐతే, ఇది కేవలం భావనగానో, ఊహగానో పుట్టిన విషయంగా చెప్పకుండా,

I లోని తన కుక్కని ఎవరో విషంపెట్టి చంపిన సంఘటన తార్కికంగా కల్గిన 'ఆలోచన'గా మనకి బంగారయ్య తెల్పుతున్నాడు. ఇక్కడ తర్కం ఏమిటి? లౌకిక వ్యవహారంలో ఇది తర్కం కానేరదు.

* కుక్కని చంపారు కాబట్టి తనకి ఏదో ప్రమాదం కల్గనున్నది

** ఆ ప్రమాదం ఎలాంటిది? తన భార్య తన్ను (1) క్షమించదు (2) తనతో కాపురం చెయ్యదు (3) తనని బతకనివ్వదు.

ఈ మూడు ప్రమాదాలూ విమలవల్ల బంగారయ్యకు అక్షరాలా జరిగినవి!

మరి మామూలు రోజుల్లో ఉండే కెరటాల స్వభావం, తుఫాను రావడానికి మూడు రోజుల ముందటివాటి స్వభావం చాలా లోతైన కావ్యపద్ధతితో చేసిన వివరణాత్మక వర్ణన

* నిజానికిక్కడ శాస్త్రిగారు కెరటాల్ని కాని తుఫాను సముద్రాన్ని కాని వర్ణించడంలేదు. రానున్న ప్రమాదాన్ని సూచించడానికి వీటి సాదృశ్యాన్ని మాత్రమే చూపుతున్నారు. ఐతే, సాధారణంగా ఉపమలో ఉండని ధ్వన్యాత్మకత ఇందులోకి రావడంవల్ల, నవలా ప్రక్రియ స్పృహతో శాస్త్రిగారు ఆ ప్రమాదంలో ఇమిడివున్న పై మూడంశాలను (**) వాచ్యంగానే తెలిపి ఈ కవిత్వ ధోరణి రచనను ఆపేసి మామూలు సంఘటనాసృష్టిలోకి వెళ్ళిపోయారు.

ఈ పై రచనలో రామణీయకం రావడంకి బాగా దోహదపడిన అంశం సముద్రవర్ణనను యుక్తిగా చేయడం! ఎప్పుడూ వర్ణ్యం ఉపమేయమే అవుతుంది కాని ఉపమానం కానేరదు. ఉపమేయాన్ని వర్ణించడానికి ఉపమానం కేవలం ఒక సంక్షిప్త పరికరం మాత్రమే. కాని, ఇక్కడ శాస్త్రిగారు ఉపమేయాన్ని (వర్ణ్య విషయాన్ని) కేవలం IV లో మాత్రమే చెప్పి II, III లలో ఉపమానాన్ని గొప్పగా వివరించి, దాన్ని సాదృశ్యంగా నిలిపారు. ప్రతిభలోని సంశ్లిష్టతే ఈ అల్లికకు కారణం! అదే రచన సౌందర్యాన్ని, పాఠకుడిలో అనుభూతి గాఢతనూ పెంచుతున్నది.

పై నాల్గింటిలోనూ మరొక కవిత్వ రచనా పద్ధతి ఏమిటంటే - శాస్త్రిగారు సముద్ర కెరటాలను సాదృశ్యంగా నిల్పుతూ సాదృశ్యానికి ఇలాంటి

సాదృశ్యాలను వేయడం. మామూలు సాదృశ్యానికి ఇలాంటి సాదృశ్య సాదృశ్యాలకూ భేదం పై వాక్యాల్లోనే జాగ్రత్తగా చూస్తే కన్పిస్తుంది.

—'అరగని అన్నం కడుపులో బరువుగా కూర్చునట్టు (1), నాకు గుండెల్లో ఆ భయం బరువుగా కూర్చుంది. (2) .... 2 లోని అన్ని అవయవాలకూ 1 లోని అన్ని అవయవాలూ సాదృశ్యంగా చూపారు రచయిత.

— కడుపులో → గుండెల్లో
అరగని అన్నం → ఆ భయం
బరువుగా → బరువుగా
కూర్చున్నట్టు → కూర్చుంది } సమాన ధర్మం + ఉపమావాచకం

సాదృశ్య రచనలో ఇది సరళమైన నిర్మాణం. దీన్ని జటిలం చేయడం III లో కన్పిస్తుంది. II లోని కెరటాలు ఐదారేడుల పాపల్లా ఆడుకొంటాయి. కాని III లోని కెరటాలు మంచి పిల్లల్లా కాకుండా రౌడీముఠాలా తయారవుతాయి. దీనికింకా వివరణ ఎగురుతాయి, దుముకుతాయి, తలలు విసురుతాయి, అతి కోపంగా అరుస్తాయి.

జీవితంలో విధి చేసే అనూహ్యకార్యాలు ఇవి. ఐతే, వీటికి సూచన లభిస్తుంది తెలిసికోగల్గిన గుండె ఉంటే. కళాత్మక రచనా పఠనకు భావుకత ఎట్లా అవసరమో జీవిత పఠనంలో కూడా దాని అవసరం అట్లాగే ఉంటుంది. సంశ్లిష్ట రచన భావుకతను పదునెక్కిస్తుంది. దుర్విధికి కెరటాలు సాదృశ్యంగా ఉంటే, మళ్ళీ ఆ కెరటాలకు మంచి పిల్లలూ, రౌడీముఠాలు సాదృశ్యంగా నిల్పుతున్నారు మహా రచయిత.

నవలంతా శాస్త్రిగారిట్లా రాయలేదు. కేవలం రెండు మూడు చోట్ల మాత్రమే వారి ప్రతిభాప్రసారం ఇట్లా జరిగింది. అది రచనను కావ్యస్థాయికి పెంచింది. ఐతే, తాను రాస్తున్నది సామాన్య పఠితకు కూడా అందాల్సిన ప్రక్రియ కాబట్టి ఇలాంటి చోట్ల ఆ పఠితకు సౌలభ్యాన్ని కూడా శాస్త్రిగారు సిద్ధం చేసి పెట్టారు. ఈ కింది వర్ణన చూడండి:

—నర్సుగా ఉన్న విమలపై బంగారయ్యకు ప్రేమ కల్గింది. ఆమెను పెళ్లాడాలనుకున్నాడు. ఆమె అతనిమీద వైముఖ్యం చూపలేదు. కాని, తన జీవితంలోకి అంతవరకు అడుగు పెట్టనివ్వలేదు. ఆమె అడుగు పెట్టనిచ్చేట్లుగా

తాను ఏదైనా సంఘటనా సృష్టి చేయాలి. ఈ సందర్భంలో బంగారయ్య నోట శాస్త్రిగారు చేయించిన వర్ణన ఇది.

I—"ఉప్పుడు ఇల్లుంటది, ఇంటి చుట్టూ తోటుంటది. నీనుప్పుడు కుక్కల బెడద లేకుండ తోట్లో దిగినానన్నమాట అంటె ఆ యమ్మకి ఏ కోపం రప్పిచ్చకండ ఆ యమ్మతో పరిసెం సంప్పాదిచ్చినా నన్నమాట! తోట్లో దిగినాను గాని ఇంట్లోకి ఎల్లాలిగదా! ఇల్లు ఆ యమ్మ! మెట్లకాడ మనల్ని దించ్చినీనాది గాని ఇంటి అల్లోకి మనం ఇంక ఎక్కలెద్దు. మెట్లెక్కనిచ్చి అల్లోకి ఎళ్ళేం అంటె మనకి అమ్మతో పరిసెం అమ్మతో దోస్తిగ మారిందన్నమాట! అల్లోకి దూరనిచ్చినాక అన్ని గెదులూ సూసేస్తాం. ఆయెనకినిచ్చి ఒంట గెదిల బూర్లె బుట్ట అంక్కిచ్చుకుంటాం. ఒంటె గెదిల బూర్లెబుట్లా అంటె అది ఆ యమ్మ."

II—"బూర్లబుట్టంటె అది ఆయమ్మ రుదయం" (అని స్మితకాయ వివరణ) (235) I మొత్తానికి విప్పి చెప్పే వ్యాఖ్యానం II లోని వాక్యం. కుక్కల బెడద లేకుండా తోట్లోకి దిగడం అన్న దానికి వ్యాఖ్యానంగా అంటే ఆ అమ్మకి ఏ కోపం రానీయకుండా ఆమెతో పరిచయం సంపాదించడం అని వివరణ. తోట బైటిదే. అంటే అది పైపై సంబంధం మాత్రమే. ఆ పరిచయంలో ఇంకా గాఢత కావాలి. పరిచయం స్నేహంగా, అది పరిణయంగా మారాలి. దీన్నంతా పైవిధంగా శాస్త్రిగారు తోట, ఇల్లు, హాలు, వంటగది, బూర్లెబుట్టా ఇత్యాది వస్తువులమీద ఆరోపించి చెప్పారు. మధ్యలో అన్నమాట, అంటె అన్న వాటితో వివరణలు చేశారు.

ఇదంతా కావ్యపద్ధతి ఆధునికీకరణం జరిగి పొందిన మార్పు— అందునా నవలకి అనుగుణంగా.

కవిత్వ పద్ధతిలో రచించడం పాత్రలకు గాఢ అనుభూతి కల్గిన సందర్భాలలో శాస్త్రిగారు ఎక్కువగా చేశారు. మృత్యువు, ప్రేమ, సౌందర్యదర్శనం, అవమానం, భయం, క్రోధం లాంటివి గాఢ అనుభూతికి ప్రేరకాలు. తనకి భయం కల్గిందని చెప్పి ఎవరూ ఎవరికీ ఆ భయానుభూతిని కల్గించలేదు— సన్నివేశ కల్పన, చిత్రణ తదనుకూలంగా ఉంటే తప్ప. రావిశాస్త్రిగారి ప్రతిభ ఇలాంటివి సంపూర్ణంగా కల్గించగల్గడంవల్లనే ఎక్కువ కీర్తిని పొందగల్గింది.

మనిషి ఆశ్చర్యపడినప్పుడు (షాక్ తిన్నప్పుడు) దాన్ని పఠితకెట్లా అందించాలి? రావిశాస్త్రిగారి ఈ కింది రచన చూడండి. తొలినాటి రాత్రి నైష్ఠికురాలైన భార్య (విమల) భర్తను సారా కావాలని అడిగిన సన్నివేశం ఇది.

—"అంటించుకుందికి నాకు నాలుగు ఊదొత్తులిద్దూ" అని అగ్గిపెట్టె ఇచ్చి మనల్ని అడిగితే మనం ఆశ్చర్యపడం. అది అడిగిన నాలుగు ఊదొత్తులే కాదు మరో నాలుగైనా దానికి ఇస్తాం.

కాని అదొచ్చి ''నాకు ముట్టించాలని సరదాగా ఉంది మూడూళ్ళు చూపిద్దూ'' అంటే మనం షాక్ అయిపోతాం.

తెలుపుదో నలుపుదో ఎరుపుదో, ఏ రంగుదైనాసరే ఆవొచ్చి ఉప్పూ బెల్లం చిట్టూ తవుడూ కలిపి ఉడికించిన ఉలవలకుడితి అడిగితే మనం ఆశ్చర్యపడం. ఆ కుడితి దానికి నొసట కుంకంపెట్టి మరీ సమర్పించుకుంటాం.

కాని ఆవే వెళ్ళి ''నాకు మేకమాంసం తినాలని మనసుగా ఉంది, నాలుగు మేకల్ని నరికేసి ఉడకబెడుదూ'' అని అడిగితే, అది విన్న పులికైనా చెమటలు పట్టేస్తాయి.'' (273, 274)

తనకు కల్గిన దిగ్భ్రాంతి (షాక్)కి చెమటలు పట్టడం లాంటి సాత్త్వికోదయం ఎవరైనా చెప్పగల్గుతారు. కాని ఆ దిగ్భ్రాంతి ఎట్లాంటిదో కవితాత్మకంగా వర్ణించడం అందరివల్లా (నవలాకారులు) అయ్యేది కాదు. సహజంగా, స్వభావ సిద్ధంగా సాత్త్వికులైనవాళ్ళు వినాశకరమైన (తమోగుణ సంబంధమైన) పనికి సిద్ధం కావడం అనూహ్యం. ఇలాంటి విపరీతాన్ని పఠితకు అనుభూతిలోకి తెస్తే తప్ప బంగారయ్య ఆనాటి రాత్రి పొందిన ఆశ్చర్యానుభూతి పఠితకు కల్గదు. అందుకుగాను పైవిధంగా శాస్త్రిగారు వర్ణించారు.

ఆశ్చర్యమూ, భయమూ రెండూ ఒకే వేళలో కల్గినప్పుడు శాస్త్రిగారి వర్ణన ఈ కింది విధంగా ఉంది :

—దూదిపులి కొడుకు తండ్రివాటా అని బంగారయ్య ఇంట్లో అర్ధరాత్రి దొంగతనానికి వచ్చి అతనికి చిక్కి తండ్రి వాటా, దూదిపులితో సంబంధం మొదలైన బంగారయ్య గత జీవిత ఘట్టాల్ని మాట్లాడ్డం, వాటిని రహస్యంగా వచ్చిన విమల వినడం అన్నది సన్నివేశం.

—"కదిలే నీలి రంగు తెరముందు నిశ్చలంగా నిల్చున్న విమల— కదిలే నీలి మబ్బుల్లో మెరిసి మరి కదలకుండా నిలబడిపోయిన మెరుపులా ఆశ్చర్యకరంగా ఉంది; మహా సముద్రపు అడుగు నీటి వరదల్లో అచంచలంగా ఉండిపోయిన తెల్లటి తిమింగిలంలా భయంకరంగా ఉంది.

ఆ సమయంలో ఆ నా విమల నిర్మలంగా నిశ్చలంగా మనోహరంగా భయంకరంగా మూర్తీభవించిన మృత్యుదేవతలా ఉంది.

మృత్యుదేవతని ఎంతోసేపు చూడ్డం చాలా కష్టం ..."(300) ఆమె భీతిని, ఆశ్చర్యాన్ని కల్గిస్తుందని మామూలుగా చెప్పడం కాదిది. పాఠకుడిలో ఆ భావాను భూతి కల్గడం కోసం పై విధంగా శాస్త్రిగారు నిలబడిపోయిన మెరుపు ఒక అద్భుతం కాబట్టి ఆ సాదృశ్యంలో ఆశ్చర్యాన్ని, అచంచలంగా ఉన్న తెల్ల తిమింగలం భయానకమైంది కాబట్టి ఆ సాదృశ్యంతో భయాన్ని కల్గిస్తున్నారు. వెరసి ఆమె మృత్యుదేవతలా ఉంది. చనిపోయింది ఆమెనే కాని, ఆమె నిజానికి ఇతని అధర్మ జీవన విధానాన్ని చంపగల్గింది. అట్లాకూడా ఈ వర్ణన సమంజసమే కాకుండా పాఠకుని అనుభూతి సాంద్రతకు తోడ్పడుతున్నది.

సౌందర్యానుభూతిని పాత్ర పొందుతున్నప్పుడు, ఒక మృత్యువుని చూసినప్పుడు శాస్త్రిగారి కవితాత్మక రచన నవల పరిమితుల్ని దాటిపోతుంది. నవలలోంచి ఈ ఘట్టాల్లోని శాస్త్రిగారి రచనను తొలగించి విడిగా చదివితే వాటిని నవలలోని భాగాలుగా ఎవరూ గుర్తించలేరు - గొప్ప కవితా ఖండాలుగానే వాటిని భావిస్తారు.

వియత్నాం విమలను మలి జీవితంలో మొదటిసారిగా చూసినప్పుడు బంగారయ్య నోట రచయిత చెప్పించిన ఈ కింది మాటల్ని చూడండి—

—"ఒకే ఒక్క మనిషి బొమ్మలో అంతటి అందం చూసేసరికి నాకు గుండెపోటు వచ్చినంత పని అయింది. నేను నిలువునా నీరైపోయేను, నిలువునా గడ్డకట్టిపోయేను". (177) ఈ మేరకు ఇలాంటి రచనను సామాన్యుల రచనల్లో కూడా అక్కడక్కడ అప్పుడప్పుడు మనం చూడగల్గుతాము. ఒక పాత్ర అందానికి మరో పాత్రలోని స్పందన ఇది. ఐతే, ఇంతమాత్రంతో ఆగక సౌందర్యానికి స్పందిస్తున్న పాత్ర (బంగారయ్య) ఆ స్పందనని కవితాత్మకంగా వివరించడం అన్నదాన్ని సాధారణంగా చేయరు. ఈ నవలలో శాస్త్రిగారిలాంటి రచన ఎంతో ప్రౌఢంగా చేశారు - పై మాటల వెంట ఈ కింది రచన ఉంది :

—."ఆ అందం గురించి నేను ఏమని చెప్పను?

I అర్ధరాత్రి పున్నమి చంద్రుణ్ని అకస్మాత్తుగా నిద్రలేచి చూసినట్టు, ఉదయించే సూర్యుణ్ని జీవితంలో మొదటిసారి చూసినట్టు, డార్జిలింగు ఎండలో మంచుకొండల్ని చూసినట్టు, వరద గోదావర్ని రాజమండ్రి గట్టుమీంచి చూసినట్టు, ఏరాడ కొండమీంచి సాగరతీరాలని దూరాలని చూసినట్టు నేను ఆమెని నివ్వెరపోయి నిర్ఘాంతపడిపోయి చూసేను" (178).

లోకంలో వేటివేటిని చూసినప్పుడు నివ్వెరపోయి నిర్ఘాంతపడిపోయి చూస్తామో వాటినన్నింటినీ ఇక్కడ ఆమె అందానికి ఒకరకంగా సాదృశ్యం చేసి చూపుతున్నారు రచయిత. ఈ రచనలో ఉపమానం (సాదృశ్యం), ఉపమేయం రెంటినీ విడివిడిగానే ఉంచుతున్నారు కవి. దీనికిందనే కొనసాగిస్తున్న ఈ వర్ణన చూడండి—

II (1) "అహో! అందమా, నువ్వు శరత్కాలపు చల్లచల్లని పూర్ణ చంద్రుని రేఖవే!

(2) ఓహో! అందమా, నువ్వు మాఘమాసపు ఉదయకాలపు సూర్య కిరణ శోభవే!

(3) అవునందమా, నువ్వు ఎండవేళల పంచరంగుల మంచుకొండల వన్నెవన్నెల వెలుగువే!

(4) అందమా, నువ్వు వేయిరాత్రుల నీలివెన్నెల మంచుసోనల జల్లువే!

(5) అవునందమా, పొంగిపొర్లే నువ్వు ఎర్రనెర్రని గోదావరి ఎర్రనీటి వరదవే వరదవే!

(6) అందమా అందమా, నువ్వు పూలకోటి తోటవే, కోటితోటల పూలవే!

(7) ఓ అందమా, నువ్వు చీకటికి కాంతినిచ్చే కంటి కాటికరేఖవే!

(8) అవును, అవునవును, ఔనౌనహో, ఓ అందమా అందమా, అవును సుమా, నువ్వు నీలాల నింగిని కూడా వెక్కిరించి ధిక్కరించే నీలి మహా సముద్రానివే! ఓహో అందమా, ఓ అందమా. .." (178)

ఛందస్సు ఛాయలు కూడా అగుపించే ఈ వర్ణనలో విశిష్టాంశం ఒక స్త్రీని వర్ణించడం కాకుండా స్త్రీయొక్క అందాన్నే (అందం=సౌందర్యం అన్నది

గుణం - నైరూప్యం) ప్రత్యక్షంగా సంబోధించడం. ఇది వినూత్నమైన వక్రోక్తి. శరత్కాలపు చల్లని పూర్ణచంద్ర రేఖామలను ఈ అందం పోలిఉండడం అన్న దానికి ప్రత్యామ్నాయంగా కవి ఓ అందమా నీవే ఆ చంద్రరేఖవు, ఎర్రనీటివరదవు, తోటలపూలవు, కంటి కాటికరేఖవు ఇత్యాదిగా అనడం. ఇది మరొక చక్కని వక్రత 8 లోని ప్రయోగాలన్నీ (అవును, అవునవును మొ॥నవి) మూర్తీభవించిన అందంతో ప్రత్యక్షంగా మాట్లాడం, అభివ్యక్తిలో ఇదొక నూత్నత 5 లోని వరదలే వరదలే అన్న పునరుక్తి, చల్లచల్లని అని 1 లో విశేషణానికి విశేషణం వేయడం, 5లోని 'ఎర్రనెర్రని గోదావరి ఎర్రనీటి' అని ఎరుపుకి ప్రాధాన్యం ఇవ్వడంకోసం అదే విశేషణాన్ని పునఃపునః వేయడం, 6 లో పూలకోటి తోటవు, కోటి తోటల పూలవు అని అవే శబ్దాలను సార్థకంగా మార్చడం, 8 లో 'వెక్కిరించి ధిక్కరించే' అనడంలోనూ 3 లోని 'వన్నెవన్నెల' అనడంలోనూ శబ్దాలంకార ప్రయోగం చేయడం, మహాసముద్రమన్న విశేషణ పూర్వపదకర్మధారయానికి మరో విశేషణాన్ని-అదిన్నీ తెలుగు శబ్దంతో-వేయడం రావిశాస్త్రిగారి ప్రత్యేక పద్ధతి. వారి చాలా రచనల్లో ఈ లక్షణం బాగా కనబడ్తుంది. వీటన్నింటికి తోడుగా ఎండవేళల /3 + 4/
పంచరంగుల /3 + 4/
మంచుకొండల /3 + 4/
వన్నెవన్నెల /3 + 4/

లాంటి మిశ్రగతి మాత్రాఛందఃప్రయోగాలు ఇలాంటి వర్ణనలను కేవలకవిత్వంగా మార్చివేస్తున్నాయి.

కవిత్వానికి మూలధాతువైన భవ్యఆవేశం I, II లలో హృద్యంగా మనకు కనిపిస్తున్నది 1 నుంచి 8 వరకు. అన్ని పాదాలలోనూ మిశ్రగతి ప్రయోగాలు ఈ కవితా రచనకు సొగసుని పెంచుతున్నాయి. బంగారయ్య ఒకే ఒక్క మనిషి బొమ్మలో ఇంతటి అందం చూసేటప్పటికి అతడు నిలువునా నీరైపోవడం, నిలువునా గడ్డకట్టిపోవడం అన్న అనుభూతిని పాఠకుడుకూడా పొందగల్గడానికి ఈ రకమైన కవితాత్మక రచన ఎంతో అవసరం. ఈ అవసరాన్ని తీర్చగల్గిన ఉత్తాలమైన హిమశృంగస్థాయి ప్రతిభ రావిశాస్త్రిగారిది. స్త్రీ యొక్క అంగాంగ వర్ణనను కాకుండా కేవల సౌందర్యానుభవాన్ని పవిత్రంగా వర్ణించగల్గిన తొలి తరం భావకవుల స్థాయికి ఏ మాత్రమూ తగ్గని ప్రతిభ శాస్త్రిగారిది. ఐతే, వారి

కన్నా గుణాధిక్యం పీరిలో ఏమిటంటే–వారిది కేవలం ఆత్మాశ్రయమైన అను భూతి, అభివ్యక్తి కాగా, శాస్త్రిగారిది తమ పాత్రలలోకి పరకాయ ప్రవేశం చేసి పరకాయ అనుభూతులను కూడా స్వాయత్తం చేసుకుని కథాశిల్పంలోకి ఇలాంటి కవితాఖండాలను ఇమిడిపోయేటట్లుగా పొసగించడం.

పైన ఉదాహరించిన అందం యొక్క వర్ణనలో I, II అన్న అంశాల పద్ధతిని రావిశాస్త్రిగారిదే నవలలో చివరి ఘట్టంలో కూడా పాటించారు. I లో అందాన్ని గురించి, ఆ అందం ప్రకృతిలో ఎక్కడెక్కడ అట్లా ఉన్నదో సాదృశ్యాలలో చెప్పగా, II లో ఆ అందాన్నే ప్రత్యక్షంగా సంబోధిస్తూ సాదృశ్యానికి దానికీ అభేదాన్ని తెల్పడం - అన్నది మనకు కనిపిస్తున్న విశేషం. సరిగ్గా ఇట్లాంటి పద్ధతినే పాటిస్తూ చివరి ఘట్టంలో కొండమీది గుడికి విమలతో వెళ్తున్నప్పుడు ఉదయశోభని, బంగారయ్యతో వర్ణిస్తారు రచయిత.

I (1) "మబ్బులు తేలిపోయేయి, వాన వెలిసిపోయింది. ఆకాశం ఎలా ఉంది? ఉతికి వేసి, సాగదీసి, ఆరవేసిన నీలిరంగు పట్టు పంచెలా ఉంది.

(2) భూదేవి ఎలా ఉంది? తల్లి అవని తల్లిలా ఉంది.

(3) సూర్యుడు ఎలా ఉన్నాడు? లోకంలో ఎన్ని రంగులున్నాయో అన్ని రంగుల్నీ వెలిగిస్తూ ఉన్నాడు.

(4) గాలి ఎలా ఉంది? ఆఫీసర్ల అమ్మాయిల చేతుల్లా మెత్తగా ఉంది. ఆఫీసర్ల ఫ్రిజ్జుల్లోంచి తీసినట్టుగా చల్లగా ఉంది.

(5) చెట్లూ చేమలు ఎలా ఉన్నాయి? ఇరవై నాలుగు గంటల కిందట పుట్టిన పాపలు నూనె దీపాన్ని చూసినట్టు సూర్యుణ్ణి నిశ్చలంగా చూస్తున్నాయి.

(6) నిలబడిపోయిన ఆ చెట్లవి చక్కటి చిక్కటి ఆకుపచ్చటి ఆకులు ఎలా ఉన్నాయి? నూనె దీపాన్ని చూసి చంటి పిల్లలు కాళ్ళూ చేతులూ ఆడించినట్టుగా సూర్యుణ్ని చూసి ఆడుకొంటున్నాయి. (315) (ఈ ఆరింటినీ కలిసి ఒకే పేరాగా రాశారు శాస్త్రిగారు.) ఈపై ఆరుఖండాల్లోనూ ఉన్న గొప్ప విశేషం ఏమిటంటే - పంచభూతాలనీ వర్ణించడం (1, 2, 3, 4లు). (సూర్యుడే అగ్ని ఇక్కడ.) 5, 6లలోని అప్పుడే పుట్టిన శిశువుల ప్రస్తావన విమలకు మరొక గంటలో శిశూదయాన్ని సూచించడం. ఇలాంటి వర్ణనలు— అంటే కావ్య

వస్తువుతో కలిసిపోయేట్లుగా వర్ణించడం, కావ్యవస్తువును సూచించేట్లుగా వర్ణించడం అన్నది మహాకవుల పద్ధతి. ఇక్కడ ప్రభాతశోభని వర్ణించే వ్యాజంతో కవి పంచభూతాలను వర్ణించడం విమల పంచభూతాలలో కలిసిపోబోతున్న ఘట్టాన్ని సూచించడానికే. విశ్వనాథ సత్యనారాయణగారు వర్ణనలను గురించి రాసిన ఈ కింది వాక్యాలు శాస్త్రిగారి పైవర్ణనలకు (అందంమీది వర్ణన, ప్రభాత శోభ వర్ణన) బాగా అన్వయమవుతాయి.

—"కవియొక్క శక్తి మరియొక విధముగా మహాకావ్యములయందు కన్పించుచున్నది. వర్ణనాదులు కావ్యమున కందమిచ్చును. కాని యావర్ణన అచ్చట వర్ణ్యముతోనో, వస్తువులోనో కలిసిపోవునట్లు చేయుట మహాకవుల ప్రతిభ.... ఇచ్చటి ప్రధానమైన విషయము ప్రకృతికి, వస్తువునకు నభేదాధ్యవసాయము కల్పించుటయే. ఈ రీతిగా కావ్య వస్తువునకు, బహిఃప్రకృతికి తాదాత్మ్యము నా కావ్యములందు సర్వత్ర యుండును. "వేయిపడగల"లో నిది యెందుపడిననందే కలదు. ఇది యుత్తమ రచన" (నా గొప్ప రచన - విమర్శిని 2-పు 9 ) విమల అందాన్ని వర్ణించినచోట వర్ణ్యం వస్తువుతో కలిసిపోవడం కన్పిస్తుంది. పై ఉదయకాల శోభావర్ణనంలో ప్రకృతికి వస్తువుకీ అభేదం కన్పిస్తుంది. పోగా, కావ్యవస్తు సూచన కూడా ఇందులో కన్పిస్తున్నది. విశ్వనాథ సత్యనారాయణగారు పైన చెప్పినట్లు ఇలా రాయగల్గడం మహాకవుల ప్రతిభ. పై ప్రాభాత వర్ణనను కొనసాగిస్తూ శాస్త్రిగారు—

II "అహో, ఆకాశమో, నువ్వు మా తండ్రివే తండ్రివే!
అవునవని తల్లీ, నువ్వు మా తల్లివే తల్లివే!
ఓహో సూర్యుడా, సూర్యుడా, ఈ మా అందరి పుట్టుక్కీ
కారణం అసలు కారణం నువ్వే నువ్వే!
పవనమా పవనమా, నువ్వు మా ఊపిరివే ఊపిరివే!
నీరమా నీరమా, నువ్వు మా ప్రాణం ప్రాణం కదటే కదటే!
పిట్టలారా, చెట్టులారా, క్రిమికీటకములారా, సరీసృపములారా,
సర్వజీవరాశులారా, మీరంతా మా సోదరులే సోదరులే! (315)

ఏదో ఉపనిషత్తులోని రచనలాగా ఉంది. సర్వ జగత్తునీ, పంచభూతాలనీ, సమస్త జీవులనీ ఒక్క కుటుంబంగా చూడగల్గుతున్న మహోన్నత హృదయం లోంచి వస్తున్న కవితాధార - సత్య దర్శనము - ఇది. అందువల్లే "శాస్త్రిగారు

రచనా వేళలో దివ్యమానవ దర్శనం అయినవాడు" అని ఈ గ్రంథకర్త ఒక చోట రాశాడు (సామాజిక సాహిత్యవ్యాసాలు - పు. 130). ఐతే, విచిత్రం ఏమిటంటే - పై II లో సాధారణ అలంకారం ఏదీ లేదు! భవ్యావేశమే ఈ పాదాల్ని కవిత్వంగా మలుస్తున్నవి.

దీనివెంటే శాస్త్రిగారు కొండనీ, (కొండమీది గుడినీ) వర్ణించి ఈ కావ్యానుభవాన్ని ధ్వనింప చేశారు.

—"కొండంతా ఏడు రంగుల్లోనూ, రంగురంగుల కలల్లాంటి కల యికల్లోనూ, భగవంతుడు ఇక్కడ నా శిఖరం మీద కాక ఇంకెక్కడ ఉంటాడు అన్నట్టుగా గర్వంగానూ, నిర్మలాకాశం కింద నిశ్చలంగానూ, నిర్మలం గానూ మరలా ఎంతో వినయంగానూ, కదిలే చెట్ల ఆకులతో అది కట్టుకున్న బట్టలు గాలికి కదుల్తూన్నట్టుగానూ మందహాసం చేస్తూ ఆహ్వానించే దైవ ద్వార పాలకుళ్ళా ఉంది." (315) ఈ నవలలో ఈ వర్ణనకి కాస్త అటుగా విమల హత్యాఘట్టం ఉంది. విమల హత్య జరిగినా బంగారయ్య దుఃఖించలేదు. చస్తూ కూడా విమల "నా బిడ్డకి తల్లి లేకుండా చేస్తున్నందుకు వాడే (భగవంతుడు) క్షమించమని అడగాలి నా బిడ్డనీ నన్నూ" (322) అని చెప్పి బతుకులోంచి చావులోకి ఇంకి పోయింది విమల వెన్నెలంతా ఎండలోకి ఇమిడిపోయినట్లు" అని బంగారయ్య అనుకొంటాడు. ఈ చావు చీకటిని తెచ్చేది కాదు. ఇది సూర్య ప్రకాశాన్ని తెచ్చేది. ధర్మ ప్రేరణ కల్గించేది. అందుకే పై వర్ణనలోని గర్వం, నిశ్చలం, నిర్మలం, వినయం, మందహాసం అన్న ధర్మవీరుడి లక్షణాలు కొండని వర్ణించే వ్యాజంతో రచయిత పొందుపరిచారు. ఇదే మహాకవి ప్రతిభ

కరుణ రస నిర్వహణానికి పనికి వచ్చే వర్ణనలు కూడా శాస్త్రిగారిదే స్థాయిలో చేశారు. చెవి దుద్దులకోసం హత్య కావింపబడి దొరికిన తన చెల్లెలి శవాన్ని చూస్తూ బంగారుబాబుతో చేయించిన వర్ణనతో సదృశమైన రచన చాలా మంది రచయితల్లో మృగ్యం.

I—"మా చెల్లి నాకు దొరికింది. కాని, కష్టైగా దొరికింది. ఊరిపోయి, ఉబ్బిపోయి అదేదో దెయ్యప్పిల్లకాని మా చెల్లి కాదు కాదన్నట్టుగా దొరికింది.... అవుగా పూజించేది పాముగా మారిపోతే చూసి భయపడ్డట్టు గుడ్లు ఎక్కొచ్చి ధొరికింది. ... ఈ లోకంలో దెయ్యాలు దెయ్యాలే తప్ప దేముడు లేడు.

లేదన్నట్టుగా దొరికింది. పీక పిసుక్కుపోగా నాలిక ఎక్కొచ్చి చచ్చిపోయిన కాళికాదేవిలా దొరికింది" (85) వంటి భయానక బీభత్సాల నేపథ్యంతో కరుణాన్ని సృష్టిస్తూ శాస్త్రిగారు —

II "తోటలోని ఆకులకీ కొమ్మలకీ సూర్యుడు తెగిపోయి తెగిపోయి మా చెల్లిని తాకడానికి చేతుల్లేకుండా అయిపోయేడు మా చెల్లిని తాకి వెళ్ళే చల్లగాలి చావు గాలిగా చెదిరిపోతుంది. మా బావ.... నన్ను కౌగిలించుకొని భోరుమని ఏడ్చేడు. నిప్పులు నీరుగా మారేయా అన్నంత వేడిగా ఉన్నాయతని కన్నీళ్ళు" (85).

అని రాశారు. ఇట్లా అనుభూతిని ముద్ద కట్టించడంలో దక్షులు శాస్త్రి గారు. చల్లగాలి చావుగాలిగా మారడం, నిప్పులు నీరుగా మారడం అని ఆ వేళ లోని సూక్ష్మసూక్ష్మాంశాలను కూడా కవితామయంగా చెప్పడంచేతనే పఠితకు రచయిత అనుభూతి సాంద్రతను కల్గించగల్గుతున్నాడు. సూర్యుడి కిరణాలు తెగిపోవడానికి కవితాపరంగా హేతువుని చెప్తూ, (II లో మొదటి వాక్యం) అందు వల్లే తన చెల్లెల్ని తాకలేకపోతున్నాడాయన అని చెప్పడంలో కరుణం పొంగి పొర్లుతున్నది. I లో చెప్పినట్లు ఈ లోకంలో దెయ్యాలు దెయ్యాలే తప్ప దేముడు లేదన్నట్లుగా ఆ చెల్లెలు దొరికిందనడం తీవ్ర దుఃఖితుడి లక్షణం. వాళ్ళ బావ ఏడ్చినాడని చెప్తున్నాడే తప్ప బంగారిబాబు నోటమాత్రం రచయిత

"నేను మాత్రం ఏడవలేదు.

నాకు ఏడుపు రాకపోడం నాకు గుర్తుంది. నా కళ్ళు మండిపోవడం, నా వళ్ళంతా వేడెక్కిపోవడం నాకు గుర్తుంది. ఎడారిలో నా బిడారం ఎగిరిపోడం నాకు గుర్తుంది...." (86)

అని అనిపిస్తూ శోకం క్రోధంగా మారడాన్ని సూచిస్తారు. బంగారిబాబు శోకాన్ని వాచ్యంగా చెప్పకపోయినా, అతని ప్రవృత్తి క్రోధానికి మళ్ళడానికి ముందుగా అతని స్థితిని మన ఊహకే వదలివేస్తున్నారు రచయిత. పోగా, నేనే మాత్రం ఏడ్వలేదని కూడా చెప్తున్నారు. ఆ శోకాన్ని బావపాత్రలోనే చూపిస్తున్నారు. కారణం - ఈ అనుభవం కారణంగానే బంగారిబాబు బంగారిగాడుగా, బంగారయ్యగారుగా పతనం పొంది లేవాల్సి ఉన్నది. అందుకే ఈ ఘట్టంలో 'నేను దయ్యంగా మారిపోడం కూడా నాకు బాగా గుర్తుంది' (86) అని అని

పిస్తారు. ఈ ప్రధానమైన మార్పు పాత్రలో కల్గడానికి వ్యతిరేకమైనదాన్ని శాస్త్రి గారు చిత్రించలేదు బావ పాత్ర ధర్మవీరుడు కాబట్టి నిప్పులు నీరుగా మారాయా అన్నంతగా అతని కన్నీళ్ళున్నాయంటాడు. బంగారిబాబులోమాత్రం బావలో లాగా శోకక్రోధాలు కాకుండా కేవలం క్రోధాన్నే వర్ణిస్తాడు.

ఇట్లా రావిశాస్త్రిగారు శోకం, ప్రేమ, సౌందర్యానుభూతి భయం, అసహ్యం, క్రోధం అన్న మౌలిక అనుభూతుల్ని పాఠకులకు అందించడం కోసం కావ్య శిల్పంతో, కవితాత్మకమైన అభివ్యక్తితో ఈ రచన చేశారు. నవలలో కథకి మొదటి ప్రాధాన్యం దాన్ని తీర్చిదిద్ది పాఠకుడికి దాన్లో తాదాత్మ్యం కల్గడం రెండవది. రెండవది కల్గకపోతే మొదటిది వ్యర్థమవుతుంది. ఈ రెంటినీ సమగ్రంగా చేయడానికి ఇలాంటి వర్ణనలు, శిల్పదృష్టి అవసరం. బాహిరమైన పరిస్థితుల వర్ణనతో నవల ఎంత శోభిల్లుతుందో, అంతర ప్రవృత్తుల్ని వర్ణించినప్పుడు అంతకన్నా ఎక్కువ శోభిల్లడమే కాకుండా ఎక్కువ ప్రాణాన్ని పోసికొంటుంది కూడా. బాహిర ప్రకృతి వర్ణనం అంతస్సులోని రహస్యాలు తెలిపేది అయినప్పుడు సాహిత్యపరంగా రచన అగ్రశ్రేణికి చేరుతుంది. శాస్త్రిగారి ప్రజ్ఞ ఇలాంటిదే పాఠకుడికి కథలో ఏకత లేనప్పుడు కథలోని సమాచారం మాత్రమే మెదడుకి అందుతుంది తప్ప అతని హృదయానికి అందులోంచి ఏమీ అందదు. అందువల్లనే కథాంశాల ఏకతను రచయిత ప్రతిభ సాధించినప్పుడే అది మంచి శిల్పం అవుతుంది. ఈ ఏకతను నాయకుడు సూచించడం పూర్వ రచనా పద్ధతి. ఈ నవలలో వియత్నాం విమల కథాప్రయోజనాన్ని కల్గించడంలోనూ, పాఠకునికి హృదయానుభూతి కల్గించడంలోనూ ప్రధానమైన పాత్ర. ఆమె ధర్మ వీర. ఆమె ప్రభావంలోకి రాబోతున్న పాత్రగా బంగారిబాబు త్రయ చిత్రణ జరిగింది. నవలలో చేసిన వర్ణనల్లో రావిశాస్త్రిగారు ఈ ప్రధానాంశాన్ని దృష్టిలో పెట్టుకున్నారు. అందుకే వర్ణనలన్నీ కావ్య శిల్పంతో నిండి ఉన్నవని చెప్పడం. కాకపోతే నవల ప్రారంభంలోనే (26వ పేజీ) విమల తన అక్క సరళ ఆత్మ హత్య చేసికొన్నప్పుడు తన తల్లితండ్రుల్లాగా దిగాలుపడి కుంగిపోయిందని చెప్పకుండా ఆమెలోని ధీరగుణాన్ని (ఇది వీర రస నాయకులకు మౌలికంగా ఉండాల్సిన గుణం) స్పష్టంగా వర్ణిస్తూ (వాచ్యంగా కాదు) శాస్త్రిగారిట్లా రాయరు—

"అటు చూస్తే కొండ బండలు, ఇటు చూస్తే రాక్షసి డొంకలు, కాని ఇది విమల.

అటు చూస్తే పెద్ద పులుల కోరలు, ఇటు చూస్తే పడగలెత్తిన పాములు. కాని ఇది విమల. అటు చూస్తే సెగలు సెగలు, ఇటు చూస్తే పొగల సుడులు. కాని ఇది విమల .... అటు చూస్తే ఎత్తు దొరకని మంచు మహాపర్వతాలు, ఇటు చూస్తే లోతుచిక్కని చీకటి అగాధాలు. లేదా ఒడ్డులేని మహాసముద్రాలు. అవు నవును కాని ఇది విమల....కాని ఇది విమల విమల!" (26)

విమలకి అటూ ఇటూ ఉన్న కష్టాలను కవితాత్మకంగా చెప్తూ శాస్త్రిగారు- కాని ఇది విమల అన్న మాటల్తో ఆమె వాటికి చెదరిపోదని ఆమె ధీర గుణాన్ని సూచిస్తున్నారు. ఈ పాత్రని ఇట్లా చిట్టచివరి పుటవరకూ చెదరిపోకుండా నిలి పారు శాస్త్రిగారు. ముందుమాటలో వారు చెప్పుకున్న నిలబెట్టి ఆపడంలో కష్టం ఈ రచనలో మనకు కానవస్తుంది. పాత్రలని దేనికి నిలబెట్టారన్నమాట? పాత్ర లను నవల ప్రధాన ప్రయోజనానికి - ధర్మానికి - ప్రధాన అనుభూతికి - ధర్మ వీరానికి-అని అర్థం. కొన్ని వర్ణనలు ఈ రెండవ ప్రయోజనానికి ఎంతో అను కూలంగా చేశారు మహా రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు.

# ఆకర్షకమైన అలంకారసృష్టి

మంచి నవలలో ఇతివృత్త నిర్వహణ, పాత్ర చిత్రణ, ఒక ముఖ్య జీవిత కాల చిత్రణ - సమకాలీన సామాజిక చరిత్రను కళాత్మకంగా చిత్రించడం ఉంటాయి. గొప్ప నవలలో వీటికి తోడు ప్రయోజనాత్మకమైన సందేశం కూడా ఉంటుంది. ఐతే, ఇవన్నీకూడా పూర్వ కావ్యాలలోనూ ఉంటూనే వీటికితోడుగా అలంకారాభివ్యక్తి ఉంటుంది. అలంకారం అన్నది ఆధునిక కావ్యాలకు ప్రధానమైన అభివ్యక్తి పద్ధతి. నవలలో అన్ని ప్రక్రియలలోని అంశాలను - పద్ధతులను రచయితలు శిల్పం కోసం వాడుకొనవచ్చును. అలంకారాన్ని సార్థకంగా వాడుకొన్నప్పుడు ఆ నవల చాలా ఆకర్షకంగా ఉంటుందనడానికి శాస్త్రిగారి రచనలకు మించిన ఉదాహరణలు దొరకవు.

శాస్త్రిగారు అలంకార సృష్టిని ఒక నియమంగా పెట్టుకొని రాశారని పిస్తుంది! వారి అలంకార సృష్టిని పరిశీలిస్తే ఏయే సందర్భాల్లో వాటిని సృష్టించారో కూడా మనం స్పష్టీకరించుకోగల్గుతాం. అలంకారం కోసమే అలంకారాన్ని వారెక్కడా వేయలేదు. అది తప్పక వారి రచనాశిల్పానికి తోడ్పడినప్పుడే అలంకార సృష్టి చేశారు శాస్త్రిగారు. పొడి మాటల్లో ఒక పేజెడు వివరాలు రాసిందానికంటే ఒక్క అలంకార సృష్టితో అందంగానూ, పాఠకుని హృదయంలోకి చొరబారేటట్లుగానూ రాయడం ప్రతిభావంతుని లక్షణం. రావి శాస్త్రిగారు చేసిందిదే. వారి అలంకార సృష్టి ఈ కింది సందర్భాలలో జరిగినట్లుగా మనం గమనించగల్గుతాం :

1) పాత్ర రూపాన్ని పరిచయం చేయడం.
2) పాత్ర గుణాన్ని పరిచయం చేయడం.
3) రెండు పాత్రల మధ్యన రూపంలో భేదాన్ని తెల్పడం.
4) రెండు పాత్రల నడుమన గుణంలో భేదాన్ని తెల్పడం.
5) సిగ్గు, కోపం, అసహ్యం, బాధ ఇత్యాది భావానుభూతులను తెల్పడం.
6) వాతావరణం, సన్నివేశం మొ॥న వాటిని తెల్పడం.
7) ముందు జరుగబోతున్న సంఘటనను సూచించడం.

## పాత్రల రూపానికి అలంకారసృష్టి

రచనలో పాత్రల ద్వారానే ఇతివృత్తం నడుస్తుంది. అందువల్ల పాత్ర పాఠకుడికి కన్పించాలి. చిత్రలేఖనంలో ఉన్న సౌలభ్యం సాహిత్యంలో లేదు కాబట్టి, ఆ లోప పూరణం అలంకార రచన ద్వారా అగ్రశ్రేణి రచయితలు చేస్తారు. ఒక పాత్ర రూపాన్ని కేవలం పఠిత ఊహకి వదలివేయకుండా రచయిత ఆమె రూపం ఇలా ఉన్నదని హృద్యంగా నిర్దేశించడానికే అలంకారసృష్టి. రావిశాస్త్రిగారు ముఖ్యపాత్రలను తమ నవలలో మొదటిసారిగా ప్రవేశపెడ్తున్నప్పుడల్లా చాలావరకు అలంకారసృష్టి చేసి పాఠకులకు మనోనేత్రం ముందు వాటిని అగుపించేటట్లు చేశారు.

విమల పేరు నవల ప్రారంభంలో, మొదటివాక్యంలోనే వచ్చినప్పటికీ ఆమె ఇతివృత్తం 25 వ పేజీలోకాని మొదలు కాలేదు. 26 లో ఆమె చిక్కిన సమస్యలను 'అటుచూస్తే కొండలు ఇటుచూస్తే రాకసి దొంకలు' అన్న వర్ణనతో రచయిత చూపించారు. నిజానికి విమల కార్యాచరణకు పూనుకోవడం 28 వ పేజీలో కాని మొదలు కాలేదు. అందువల్ల ఆమె అసలు ప్రవేశం ఇక్కడేనని చెప్పాలి. ఆమెని వర్ణిస్తూ రచయిత—

—"విమలకి అప్పటికి పదహారేయేళ్ళు కాని, ఆమె అరవయ్యారున్నర అంగుళాల ఎత్తుకి ఎదిగిపోయింది. (1) అశోకవృక్షం అడ్డైనట్టుగా ఆమె ఆ చిన్నగదికి చాలా పెద్దదిగా ఉంది. (2) వెండి బంగారాలతోనూ రంగు రంగుల పువ్వుల్తోనూ తయారుచేసిన విగ్రహంలా ఆమె ఆ సమయంలో చాలా వింతగా ఉంది.

(3) వంటింటి వాసనలతో ఆమె ఎంతో రుచిగా ఉన్నట్టు కూడా ఉంది."

1 లో ఆమెసైజు, 2 లో ఆమె సౌందర్యమూ పవిత్రతా తెల్పే పోలికలు. ఆమె బావ ఆమెని కామించి అడగబోతున్న సందర్భం కూడా కాబట్టి, రచయిత తాను involve కాకుండా ఆమె రుచిగా ఉన్నట్టు కూడా ఉంది అని మూడులో వర్ణిస్తారు. విమల రూపాన్ని, అందాన్ని (గుణాన్ని కూడా) ఇట్లా వర్ణించారు శాస్త్రిగారు. రూపంతోపాటు గుణాన్ని కూడా చేర్చి చివరి కథలో సత్తరకాయతో "అందానికి లేడి, కోపానికి పులి! ఆ యమ్మేనా?" (233) అనిపిస్తాడు రచయిత.

ఐతే, పై రెండు వర్ణనల్లోలోనూ విమల స్థిరంగా ఉన్నప్పటి మూర్తి. కదలికలో పాత్రరూపానికి ఈ కిందిది మంచి ఉదాహరణ:

''కాళ్లూ చేతులూ ఉన్న గులాబి పువ్వు పనసాకు నెత్తికి అడ్డుపెట్టుకొని గునగున నడుచుకు వెళిపోతూన్నట్టు వెళిపోతోంది వర్షంలో వియత్నాం విమల'' (240) అందుకే గులాబీకి కాళ్లూ చేతులూ!

రైలు పెట్టెలో ఒక విధవరాలు పాత్ర ప్రవేశంలో శాస్త్రిగారు చేసిన అలంకార సృష్టి ఇట్లా ఉంది:

—''మనిసి మిగత వోళ్ళల్లా దుక్కపోతులా కాకండ సళాగ్గోపతలాగ్గ ఉంది. తీరుగనే ఉంది కాని కునింత ఎలాగున్నదంటే కునింత సల్లారిపోయిన పెసరట్టులాగ్గ ఉంది. పెసరట్టు బాగా సల్లారి పోయ్యిందంటే సూపుకే బాగుండదు, రుసికీ బాగుండదు. అయితే ఆ మనిసి పూరాగా సల్లారి పొయ్యిలెద్దు. 'సూపుకి బాగుండ 'క పోలెద్దు, రుసిక్కూడ బాగానే ఉండొచ్చు' అని పిచ్చిద్ది నాకు.'' (159)

ఉపమానం కాస్త సర్దుబాటు చేసి ఇట్లా శాస్త్రిగారు అక్కడక్కడ ఇట్లా రాస్తుంటారు! ఉపమానద్రవ్యాలు కూడా కొన్ని చోట్ల చాలా కొత్తవి (అంటే ప్రాచీన కవులు వేసినవి కాకుండా) వేస్తుంటారు. ఆధునికులు వాడుకొనే సామగ్రిలోంచి ఉపమానాలను రాబడ్తుంటారు శాస్త్రిగారు. నారాయణ అనే దుర్మార్గ పాత్రను ప్రవేశపెడ్తూ శాస్త్రిగారు ''ఆడు శాయకి అమ్మామ్ సబ్బులా ఆకు పచ్చగ ఉన్నాడు గాని ఆడి జుట్టు పియర్స్ సబ్బులా మాడిన ఇటిక రంగులా ఉంది.'' (115-116) అని అంటారు. ఈ ఉపమానాలు కొత్తవని చెప్పక్కర్లేదు.

విమల భగ్నవివాహవరుడైన వరహాలుని ప్రవేశంలో రచయిత-"తండ్రికి డబ్బు తినడం ఎంత ఇష్టమో ఆ తండ్రిగారి పెద్దకొడుక్కి తిండి తినడం అంత ఇష్టం. ఆ తిండి అతనికి బరువూ లావూ ఇచ్చింది. అందువల్ల అతను భారీగానే కనిపిస్తాడుగాని మెత్తమెత్తగా అప్పడాల పిండితో చేసిన మనిషిలా కనిపిస్తాడు. సున్నాకి చెవులు తగిలించినట్టు ఉంటుంది అతని ముఖం" (39). ఇట్లా ఒక పాత్ర ప్రవేశంలోనే అతని రూపంలోని విలక్షణత్వం ప్రత్యేకత మన కళ్ళకి కనబడేలా చెప్పడానికి అలంకారసృష్టి చేశారు శాస్త్రిగారు. (మొదటివాక్యం వక్రోక్తి).

పాత్ర ఇతివృత్తంలో చాలా కొద్దిసేపే ఉన్నప్పటికీ దాని ప్రాముఖ్యం చాలా ఉన్నప్పుడు అది ప్రధాన పాత్ర మీద ప్రభావాన్ని వేసినప్పుడు శాస్త్రిగారు ఎంతో హృద్యమైన అలంకార సృష్టి చేశారు. బైరాగినాయుడి వెంటవున్న అతని చిన్న కూతురిని వర్ణిస్తూ—

"సిలక సిన్నపిల్లగ మారినట్టుంది ఆ పాప" (143)

అని అంటారు. ఈ పిల్ల ఏడ్పే తర్వాత బంగారిగాణ్ణి కలిచివేస్తుంది. అందుకని ఈ హృద్య అలంకార సృష్టి. ఈ బైరాగినాయుడు పాత్ర కూడా చాలా కొద్దిగానే వస్తుంది. కాని బంగారిగాడిలోనూ, బంగారయ్యలోనూ ఉన్న భూతాన్ని తొలగించే స్పందన కల్గించిన పాత్ర ఇది. అందువల్ల అతణ్ణి ప్రవేశ పెడ్తూనే అనితరసాధ్యమా అన్నట్లుగా ఉన్న ఈ కింది అలంకార సృష్టి—

"బిడ్డ బతుకోసరం పాతిరొచ్చేం సెరుపుకున్న తల్లిలాగ ఉన్నాడా బైరాగినాయుడు." (142)

ఈ పోలిక చెడకూడనివాడు తప్పనిసరిగా చెడిపోవాల్సిరావడమన్న పరిస్థితిని కూడా చెప్పక చెప్పినట్లయింది. ఇలాంటి రచనచేత సాధించేది ఇదే.

## రూపభేద పరిచయం

పై విధమైన సృష్టి ఒక రకం. మరొక రెండు పాత్రల రూపాలలోనూ గుణంలోనూ పోలిక చూపడానికి అలంకార సృష్టి. ఇలాంటి రచనకెంతో నైపుణ్యం అవసరం. రెండు పాత్రల మధ్యన సమానత్వం ఉండి కూడా ఈషత్ భేదం ఉన్నప్పుడు, చాలా భేదం ఉన్నప్పుడు, అసలు పోలికే లేనప్పుడు ఈ రకం రచన చేశారు శాస్త్రిగారు.

I "ఆ ఇంట్లో మా అక్క బూజు పట్టిన పాత ఫ్రేములో పంచ రంగుల కొత్త ఫోటో పెట్టినట్టు ఉండేది." (57). ఒక పేద టీచర్ యొక్క దారిద్ర్య నేపథ్యం మనకు కల్పించడానికి ఇలాంటి పోలిక. ఈ పాత్రని ఆమె చెల్లెలి పాత్రతో (బంగారుబాబుకి ఒకరు అక్క, మరొకరు చెల్లి) పోలుస్తూ—

II "మా చెల్లికూడా చాలా అందంగా ఉండేది. గొల్ల కృష్ణుడు తెల్ల పిల్లగ మారినట్టు జిగజిగలాడుతూ ఉండేది. గాజూ, బంగారం, వెన్న ముద్దలూ,

మల్లెపువ్వులూ, నల్ల మబ్బులూ అన్నింటినీ తీసుకొచ్చి చేసిన మాయ బొమ్మలా ఎంతో మనోహరంగా ఉండేది." (58)

I లో అక్క పాత్ర ఉనికికి ప్రాధాన్యం. ఆ ఉనికి యొక్క బలహీనత వల్ల ఆ పాత్ర రూప సౌందర్యం ఎక్కువగా బైటపడటం లేదు. అందువల్ల అక్కడ అంతంత మాత్రంగానే రూపాన్ని పరిచయం చేసి, II లో పాత్ర రూపాన్ని వివరంగా అలంకరించి చూపారు. ఒక్క ఉపమ సరిపోక 5 ఉపమా ద్రవ్యాలను చూపడం ఆ రూప ఉత్కృష్టతను తెల్పడానికి. దేముడు ప్లీడరూ, అతని గుమాస్తా (బంగారిబాబు తండ్రి)ల నడుమన ఉన్న తారతమ్యాన్ని తెల్పుతూ చేసిన అలంకార సృష్టి—

"దేముడు ప్లీడరుగారు బక్కగా పొడుపుగా కొంగకి పాగా పెట్టినట్టు ఉండేవారు. మా నాన్న అంతగా పొట్టివాడు కాకపోయినప్పటికీ ఎందువల్లనో గాని పిల్లికి పాగా పెట్టినట్టు ఉండేవాడు" (54). పాఠకుల మనో నేత్రానికి రెండు పాత్రల మధ్యన ఉన్న భేదం ఎంతో స్పష్టంగా తెలుస్తుంది ఇలాంటి అలంకార రచనతో.

భేదం చాలా ఉన్నప్పటి రచనకు ఈ క్రిందిది మంచి ఉదాహరణ. కర్రి పంతులికీ, బైరాగినాయుడికీ తేడా "ఈ లంజకొడుకుని (కర్రిపంతుల్ని) జూస్తె ఈడు తోక తెగ్గిపొయ్యి కాళ్ళిరిగిపొయ్యి తాటికాయ నెత్తిమీద పడిపొయ్యిన కునుకు నక్కలాగ్గ ఉన్నడు. ఆడు (బైరాగినాయుడు) జూస్తె ఆదిసివుడు అన్నవడుక్కుంటున్నట్టు అడున్నడు." (142)

నక్క, ఆదిశివుడి పోలికల్తో వాళ్ళిద్దరి మధ్యన ఉన్న హస్తిమశకాంతరం తెలుస్తుంది.

పోలికను వెంటవెంటనే చెప్పకపోయినా పాత్రకీ పాత్రకీ మధ్యనుండే భేదాన్ని వ్యవధితో చెప్పడం కూడా చేశారు శాస్త్రిగారు. బంగారుబాబు బావ రెండో పెళ్ళి చేసికొన్నప్పుడు అతడు తన అక్క ఇలా ఉన్నదని అక్కడ చెప్పకపోయినా ఈ అక్క సవతి ఎంతో భేదంగా ఉన్నదో సూచిస్తూ-

"ఆవిడ మా అమ్మలాగే ఓ వంటావిడకి వంటరి కూతురు. దిబ్బ రొట్టెలా ఉండేది. కాని తెల్లగా కొబ్బరికాయ ముక్కలా ఉండేది. అయితే బాగా

ముదిరిపోయిన కొబ్బరిముక్కలా ఉండేది. కొరకడం కష్టం. నవిలితే రుచి తక్కువ.'' (71)

అని రాశారు శాస్త్రిగారు. వంటావిడ కూతురు కావడంవల్ల దిబ్బరొట్టె, కొబ్బరిముక్కల్తో పోల్చడం ఉచితం! వీటిని ఆధారంగా చేసికొని తెల్లగా ఉండి కూడా అందంగా లేదని ఎంతో నిపుణంగా చెప్తున్నారు శాస్త్రిగారు.

ఒకే పాత్రలో రెండు విభిన్న అవస్థలలోని భేదాన్ని చెప్పడానికి కూడా కొన్నిచోట్ల శాస్త్రిగారు అలంకార రచన చేశారు. బంగారిబాబు తల్లి మెళ్ళో పుస్తెలతాడు ఉన్నప్పుడూ లేనప్పుడూ ఆమె ఎలా ఉందో వర్ణిస్తూ—

"మెళ్ళో పుస్తెలతాడు లేనప్పుడు మా అమ్మ పువ్వులన్నీ తెంపేసిన బంతి మొక్కలా బోసిగా ఉండేది. పుస్తెలతాడు మెళ్ళో వేసికోగానే మాత్రం మా అమ్మ హరివిల్లుతో ఆకాశం వెలిగినట్లు వెలిగింది.'' (61)

ఈ సాదృశ్యాలతో అవస్థాభేద స్థితిలోని ఒకే పాత్రయొక్క రూపం మనకి స్పష్టంగా కళ్ళకి కడుతుంది.

ఇట్లా శాస్త్రిగారు పాత్రని రూపు కట్టించడానికీ, రెండు పాత్రల మధ్యన భేదాన్ని లేక సామ్యాన్ని కూడా రూపుకట్టించడానికీ అలంకార సృష్టి చేశారు. ఒక్కో పాత్ర ప్రమేయం ఒక్క పేజీ మాత్రమో, ఒక్క సంభాషణ మాత్రమో అయినప్పుడు కూడా వారు అలంకారంతో ఆ పాత్రల రూపు మనకు తెలిపారు.

రైలు పెట్టెలో పెండ్లి గుంపులో ఒక స్త్రీని వర్ణిస్తూ 'ఆళ్ళల్ల పాతికేళ్ళ ఆడమనిసి ఒకుర్తె పరవతం లాగ్గ ఉంది .... ఆ యమ్మ కళ్లు స్క్రోల్లాగ ఉన్నాయి.'' (159)

ఒక స్టాఫ్ నర్సుని ప్రవేశపెడ్తూ ''ఆవిడ గేదెలా ఉంది'' (250) అని అంటారు శాస్త్రిగారు. కేవలం ఒకే ఒక్క సంభాషణ మాట్లాడి నిష్క్రమించిన తొంభై యేళ్ళ మునిలమ్మను వర్ణిస్తూ—

(i) "టోపీని తల వెనక్కివంచి ఉంచినట్టు తాటాకు గొడుగుని వెనక్కి వంచి, వంగిపోయిన నడుంని కొంచెం మీదికి లేపి ఒక ముసలి ముసలి ముస్సాలి ముఖం తొంభయ్యేళ్ళ ముదతల్తో పళ్ళులేని నోటితో నవ్వుతూ నన్ను చూస్తోంది.

(ii) ఆమె కళ్ళు గాజు గాజుగా కాకుండా నీరు నీరుగా చచ్చిపోయిన కళ్ళు శ్మశానంలోంచి తిరిగొచ్చినట్టుగా ఉన్నాయి'' (244) అంటారు శాస్త్రిగారు. ఇతివృత్తంలో పాత్ర ప్రమేయం ఎంత అన్నది చూడరు శాస్త్రిగారు. ఆ పాత్ర పాఠకుల మనో నేత్రానికి రూపుకట్టడమే వారికి కావాల్సింది. గుంపులుగా ఉన్న జనంలో కూడా ఒక్క డైలాగ్ ఉన్న పాత్రని రూపుకట్టించే రచన చేశారు శాస్త్రి గారు. (చూ. 48)

## గుణాన్ని పరిచయం చేయడం

రూపాన్నీ రూపభేదాన్నీ అలంకార సృష్టితో యెట్లా పరిచయం చేశారో, అట్లాగే గుణాన్నీ ఇరుపాత్రల నడుమన ఉండే గుణభేదాన్నీ కూడా శాస్త్రిగారు అలంకార రచన ద్వారా పరిచయంచేశారు విమల తండ్రిని ప్రవేశ పెడ్తూ అతని సౌశీల్యాన్ని ఇట్లా తెలిపారు శాస్త్రిగారు:

"అతను కడిగేసిన జీతపురాళ్ళు తప్ప మరేమీ ముట్టుకోలేదు. అతను నిప్పురవ్వ, వజ్రపు తునక, నిర్మలాకాశం నిప్పురవ్వలూ వజ్రపుతునకలూ మనకి కనబడతాయి, దొరుకుతాయి. కాని నిర్మలాకాశం ఎప్పుడో కాని మనకి కనిపించదు. ఏదో ఒక మేఘశకలం - అంటే అదే, ఏదో ఒక మబ్బు మరక- ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. కాని విమల తండ్రి ఏ కళంకం లేకుండా ఉద్యోగంలోంచి రిటైరయేడు." (9,10)

జీతపురాళ్ళు ధర్మంతో సంపాదించినవి కాబట్టి. అవి కడిగేసినవి! అతని పావిత్ర్యం, సౌశీల్యం, స్వచ్ఛతకు పోలికలు నిప్పురవ్వ, వజ్రపుతునక, నిర్మలా కాశం. కాని వీటిల్లోనూ నిర్మలాకాశం నిజంగా ఎప్పుడూ నిర్మలంగా ఉండదని చెప్తూ ఈ ఉపమాద్రవ్యాలలో ఒక్కటి సరిపోవడం లేదని చెప్పడం వైచిత్ర్యం కోసం - తన పాత్ర గొప్పతనాన్ని ఇంకా స్పష్టంగా తెల్పడం కోసం.

బంగారిబాబు తండ్రియొక్క గుణాన్ని తెల్పుతూ శాస్త్రిగారు—

"మా నాన్న .... ఎందువల్లనోగాని పిల్లికి పాగా పెట్టినట్టు ఉండేవాడు. పిల్లులు కొన్ని దర్జాగా డాబుగా ఉంటాయి. కొన్ని పిల్లులు క్రూరంగా కఠినంగా ఉంటాయి. మరికొన్ని అందంగా సుకుమారంగా ఉంటాయి. కాని మా నాన్న బోడబాపనమ్మ ఇంట్లో మజ్జిగ మెతుకులు తినే ముసలి పిల్లిగా జాలి

జాలిగా ఉండేవాడు. అతన్ని చూస్తే ఈ పిల్లి ఎలుకతో చెలగాటాలాడ గలిగిన పిల్లి ఎన్నటికీ కాదని ఎవ్వరికైనా సరే తెలిసిపోతుంది." (54)

అని అంటారు. ఇట్లా తన ఉపమా ద్రవ్యాని అప్పుడే వివరణలిచ్చి వ్యాఖ్యానించడం శాస్త్రిగారి ప్రత్యేకత. ఈ ప్రత్యేకతవల్లనే నవలల్లో కూడా అలంకార రచన ఇముడుతున్నది. సామాన్య పాఠకుడికిది సౌలభ్యం. పాత్ర యొక్క లక్షణాన్ని ఇలా ఆలంకారికంగా-వివరణతోసహా చెప్పడం హృద్యంగా ఉన్నది.

ఒక పాత్ర గుణాన్ని తెల్పడానికే కాకుండా, ఆ పాత్ర మాట్లాడిన మాట గుణాన్నో, చేతయొక్క గుణాన్నో తెల్పడానికి కూడా శాస్త్రిగారు అలంకార రచన చేశారు 'విమల తండ్రి కత్తిలా ఖచ్చితంగానూ, ఎండాకాలము యేటి నీటిలా జాలిగానూ కూడా చెప్పేడు' (35) వంటిచోట్ల శాస్త్రిగారు చేసిందిదే.

ఒక పాత్ర గుణాన్ని మరో పాత్ర ద్వారా చెప్పించడానికి కూడా శాస్త్రిగారు ఈ పద్ధతిని అక్కడక్కడ అనుసరించారు. 'రాముడికి భక్తుడివిగా ఉండవలసినవాడివి శకునికి సేవకుడివో స్నేహితుడివో అయేవు' (23) లాంటి వాక్యాలిట్లాంటివి.

జీవిత సంఘటలను వివరించే ఘట్టంలో కూడా అలంకార రచనతో శాస్త్రిగారు సంక్షిప్తతనీ, హృద్యతనీ సాధించారు. బంగారుబాబు తన తండ్రికి అప్పులున్నాయని తెలిసినప్పుడు ఎట్లా భావించాడో తెల్పుతూ శాస్త్రిగారు "అప్పులున్నాయని తెలియడంతో మా ఇంట్లో అందరికీ కుష్ఠురోగం ఉంది అని తెలిసినట్టుగా నేను చీకట్లో భయంతో ఏడ్చేను." (59)

అప్పులున్నాయన్న విషయం తెలిసినప్పుడు సాధారణంగా ఇంట్లోని చిన్నవాళ్ళకి ఈ బాధ, భయం సహజం. ఐతే, దీనికి వేసిన సాదృశ్యం ఈ భయాన్ని పాఠకుడి గుండెలోకి చిటికెలో చేరుస్తుంది. ఇట్లాంటి రచనే తన బావ సంసారాన్ని గురించీ, ఇంటిసీ గూర్చి చెప్పుతున్న బంగారుబాబు కథనంలో చేస్తూ శాస్త్రిగారు—

"గోడలకి చాలా చోట్ల చెక్క సున్నం పోయి ఇటికలు ఎర్రెర్రగా గాయాల్లా కనిపించేవి." (57)

తర్వాతి ఘట్టంలో అక్కా బావలు పొందబోతున్న తీవ్రవైరాశ్యం ఆ ఇంటిని గాయపర్చింది కూడా. అందుకే ముందుగానే ఇలాంటి సాదృశ్యం వేస్తున్నారు శాస్త్రిగారు.

ఒక దొంగ బంగారయ్య ఇంట్లోని గోడల్లో ధనం రహస్యంగా దాచారని చీకట్లో వెతుకుతున్నటువంటి అతిసామాన్య ఘట్టాన్ని కూడా— పాఠకుల మనోనేత్రం ముందు స్పష్టంగా కన్పించడంకోసం—శాస్త్రిగారెలా అలంకృత వాక్యాలతో వర్ణించారో పరిశీలిస్తే ఆశ్చర్యం కల్గుతుంది.

''తప్పించుకొంటోన్న కప్పకోసం పాము తొందర తొందరగా మెలికలు తిరిగినట్టు వాడు ఒక్కోసారి అటూ ఇటూ మెలికలు తిరిగిపోతున్నాడు. కొత్త వస్తువుల్ని కుక్కలు మూజూస్తూ కాలితో రాసినట్టు వాడు - చేతిలో చిన్న గునపం అనుకున్నాను - దాన్తో గోడని నెమ్మదిగా కాని తొందరగా కొడుతూ గోడలకి చెవి ఆనిస్తున్నాడు. నేలని వడి తిరిగి గబగబా గోడ ఎక్కేస్తున్న బల్లి కోసం పిల్లి వెనక్కాళ్ళ మీద నిలబడి ముందు కాళ్ళతో గోడని బక్కిరేసినట్టు వాడు తనకి అందని గోడ భాగాల్ని ఆ గునపంతో బక్కురుతున్నాడు, పొడుస్తున్నాడు.'' (296)

పాము, కప్ప, కుక్క, బల్లి, పిల్లి - వీటి లక్షణాలు మనకు నిత్య జీవితంలో బాగా పరిచయం. వీటినే సాదృశ్యాలుగా చేసి దొంగ గుప్తధనం కోసం ఎలా వెదికిందీ చెప్పడం ఈ ఘట్టాన్ని మనోనేత్రం ముందు బొమ్మ కట్టించడంలో ఎంతగానో తోడ్పడడానికే.

కోపం, సిగ్గు, బాధ ఇత్యాది అనుభూతుల్ని తెల్పడానికి కవిత్వ పద్ధతి రచన ఎంతో చక్కగా అతుకుతుంది. ఇలాంటిచోట్ల శాస్త్రిగారు అలంకార రచన ఎంతో సహజమైన సాదృశ్యాలతో చేశారు. చిన్నత్త బంగారుబాబుమీద కోపం చూపిన ఒక ఘట్టంలో—

"రెయిలింజను మీదకి కాకుండా కిందికీ కాకుండా ఆవిర్ని అంతా ఓ పక్కకి చిమ్మినట్టు మా చిన్నత్త తన కోపాన్నంతా నామీదికి చిమ్మింది." (81)

అని రాశారు శాస్త్రిగారు. కోపం అన్న నైరూప్య విషయాన్ని ఒక దృశ్య వస్తువుతో పోల్చడం ఇక్కడి ప్రత్యేకత.

సిగ్గుని, అందునా నడివయస్సు మొగవాడి సిగ్గును వర్ణిస్తూ రచయిత—

''పెరట్లో మల్లె పువ్వుల్ని దొంగచాటుగా తెంపుకుపోతోన్న పొరుగింటి పడుచుపిల్ల ఇంటర్మీడియేట్ చదివే ఇంటబ్బాయికి దొరికిపోయి సిగ్గుపడ్డట్టు....'' (217).

ఇక్కడీ సాదృశ్యం సందర్భానికి కూడా బాగా అతికినట్టిది. బంగారయ్య ఒకరకం దొంగపనిచేసి విమలకు పట్టుపడినఘట్టం ఇది!

విమల ఎక్కడో ఒకటి రెండుచోట్ల తప్ప సామాన్యస్త్రీలాగా అగుపించదు. (ఒకటి రెండు పాత్రలు ఆమెని అజ్ఞానంచేత పిశాచం, రాక్షసి అని కూడా అనక పోలేదు.) అలాంటి స్త్రీ బావపాత్ర ఆమె కళ్యాణం ప్రసక్తి తెచ్చేటప్పటికి సిగ్గు పడిందని చెప్పడానికి శాస్త్రిగారు—

"ఆ మాటకి విమల సిగ్గుపడి పైటచెంగుది మరోపొరతో గుండెలు మరోసారి కప్పుకుంది, సిగ్గుపడ్డ కొబ్బరిచెట్టు మట్టల్తో గెలల్ని కప్పుకున్నట్టు!" (259)

అంటూ ఎంతో సహజమైన ప్రకృతిలోని వస్తువులనే సాదృశ్యంగా నిలిపి వర్ణించారు. ప్రకృతిలోని ప్రతిదాన్నీ సాదృశ్యంగా వాడుకోగల్గిన ప్రతిభ శాస్త్రిగారిది.

శోకాన్ని వర్ణిస్తున్నపుడు శాస్త్రిగారు చేసిన ఈ కింది అలంకార రచన చిరస్మరణీయమైనది. బైరాగినాయుడు బంగారిగాడి బృందంతో మోసగింపబడి అతని చిన్నకూతురి ఎడంచెయ్యి పట్టుకొని హతాశుడై పోతున్న ఘట్టం—

"ఆ సయ్యింకాలం, దెబ్బతిన్న ఎదో పిట్టో ఎదో పువ్వో ఏడ్చుకు పోతా పోతా ఉన్నట్టు అనిపిచ్చిఁది నాకు ఆ బిడ్డ యేడుపు యింటుంటే!" (146)

ఉపమా ద్రవ్యం ఏదో ఖచ్చితంగా చెప్పక పోవడం (ఏదో) శాస్త్రిగారి ప్రత్యేక పద్ధతి. పువ్వుకి ఏడ్పుని కల్పించడం గుండెల్ని పిండి వేస్తుంది. ఈ రెండు సాదృశ్యాలు ఆ పసిపిల్ల ఏడ్పుకే కాక, ఆ పిల్లకి కూడా అతికేవి. ఇది కాకుండా చెల్లి హత్య కావింపబడినప్పుడు బావ శోకాన్ని, సరళ ఆత్మహత్య చేసికొన్నప్పుడూ శాస్త్రిగారు అనేక వక్రోక్తుల్ని ప్రయోగించారు. 120 అలంకారాల పట్టికలోకి చేరేవి కాకున్నా, అవికూడా అలంకృత వాక్యాల్ని మించినవే (చూ. 25). చెల్లి శవం ముందు బావ పాత్ర శోకం బంగారుబాబు ఫీలింగులూ ఇంతకుముందే వేరే వ్యాసంలో ప్రస్తావించాను. అతని ఫీలింగులను తెలిపే మాటల్లో ఒక ఉత్ప్రేక్ష కన్పిస్తుంది - 'తోటలోని ఆకులకీ, కొమ్మలకీ సూర్యుడు

తెగిపోయి తెగిపోయి మా చెల్లిని తాకడానికి చేతుల్లేకుండా అయిపోయేడు' (85) లోనూ, సరళ ఆత్మహత్య చేసికొన్నప్పుడు—

(1) మర్నాడు తూర్పు సముద్రంలోంచి - అందరికి బతుకిచ్చే సూర్యుడు భగవంతుల్లా ఉదయించేడు. అతని బంగారపు కిరణాలు సముద్రపు అలల మీద మిలమిల్లాడేయి.

(2) ఇంతటి శుభసమయంలో ఇంతటి ప్రాణ సంపద నాకు ఉండగా ఈ దావు సంపద నాకెందుకు మీది మీరే తీసికోండి అన్నట్టుగా కెరటాల్తో ఒడ్డుకి కొట్టేసింది ఆ తెల్లవారు జాముున సరళ శవాన్ని సముద్రం. 1 ఉపమాలంకారం 2 ఉత్ప్రేక్ష. ఇక్కడ ఇది శోకవర్ణనలకు నేపథ్య రచన మాత్రమే.

మొదటిసారిగా తన గాంభీర్యాన్నీ, సంకోచాన్నీ, అనుమానాల్నీ వదలి బంగారయ్య కౌగిలిలోకి పోయినప్పుడు విమలకి ఏడుపు వచ్చింది అది ఎలాంటి శోకమో చెప్పలేము. గతంలోని కష్టాలు, బాధలు, మోసాలు, దౌర్భాగ్యాలు-ఏవి జ్ఞాపకం వచ్చి ఏడ్చిందో చెప్పలేమని బంగారయ్యే అంటాడు. తర్వాత ఆమె—

"పైట చెంగుతో కళ్ళు తుడుచుకొంది. తరవాత, పైట సర్దుకొంది. తరవాత, మంచం దిగింది. తరవాత, తుపాను దెబ్బకి తట్టుక నిలబడగలిగిన చెట్టులా నిబ్బరంగా నిలబడింది." (254)

బంగారయ్యతో సంసారం చేసినప్పటికీ విమల ఈ ఘట్టంలో కరిగిపోయి నట్టు ఎక్కడా కరిగిపోయిన దాఖలా ఈ నవలలో లేదు- సంయోగ శృంగార ఘట్టాన్ని, తర్వాత రచయిత చాలా మర్యాద పద్ధతిలో రాసినప్పటికీ ఈ ద్రవీ కరణ మనకు కన్పించదు. ధర్మవీర లక్షణమే కన్పింస్తుందామెలో. అందువల్లనే ఇక్కడ రచయిత ఆమె కొబ్బరిచెట్టులా నిలబడిందని రాస్తున్నాడు.

శాస్త్రిగారు సాధారణంగా ఉపమాలంకారాన్ని వాడుకొంటారు. అక్క డక్కడా ఉత్ప్రేక్షలు కూడా కన్పిస్తాయి వీటిని రచించడంతో పాటుగా, శాస్త్రి గారు ఇదీ ఈ అలంకారం అని చెప్పలేని వక్రోక్తుల్ని పుంఖానుపుంఖంగా రచించారు. ఈ నవలలో శోకాన్ని అభివ్యక్తీకరించడానికి బంగారుబాబు తండ్రి మరణఘట్టంలో 'మా నాన్న బతికిఉండాలని అనుకున్న వాళ్ళం అతను చనిపోయి ఉండిపోతాడేమోనని భయపడ్డాం' (63) అన్న వాక్యమూ, '(మా నాన్న కోటూ పంచె పాగా పెట్టుకొనే వాలు కుర్చీలో ఉన్నాడు. అతని కళ్ళు మాత్రం దెయ్యాన్ని చూసి జడుసుకున్నట్టుగా విప్పారి ఉన్నాయి.) జీవితం అతనికి ఏమి చూపించిందో చావుకూడా అదే అతనికి చూపించినట్టుంది.'(62)అన్నవాక్యమూ వాళ్ళమ్మ నూతిలోపడి చచ్చిపోయినప్పుడు - 'బతికి ఉన్నప్పుడు కళ్ళంటే నీరు కార్చేది కాని చనిపోయిన తరవాత ఆ నడవలో మా అమ్మ వళ్ళంతా నీరు

కార్చింది.' (66) అన్న వాక్యమూ గొప్ప ప్రతిభాస్ఫోరకమైన వక్రోక్తులు కావడంతో శోకాన్ని పఠితకు కూడా గాఢంగా కల్గించగల్గుతున్నాయి. కొన్ని చోట్ల శాస్త్రిగారు సామెతల్ని సృష్టించి రచనను అలంకరించారు. 'పీనుగులా పడిపొయ్యినా ఏనుగులా మళ్ళా లెగసిపోగల్డు' (139) పాత్ర లక్షణాన్ని తెల్పడానికిలాంటివి బాగా తోడ్పడ్డాయి.

జరుగబోతున్న సంఘటనను సూచించేట్లుగా ఉండే అలంకార రచన మహా రచయితల లక్షణం. శాస్త్రిగారి ఈ నవలలో ఈ లక్షణం కన్పిస్తుంది విమల పెళ్ళి భగ్నం కావడానికి ముందు రాములవారి గుడి ముందు, సందులోకి పఠిత దృష్టిని తిప్పడానికి కాస్త ముందు శాస్త్రిగారు - 'రాత్రి పదకొండున్నర గంట దాటింది. ఆకాశంలోని చంద్రుడు వృద్ధిచంద్రుడే కాని, వృద్ధ చంద్రుళ్ళా రాములవారి గుడిగోపురం వెనక్కి దిగిపోతున్నాడు. చుక్కలు చచ్చిన చేపల్లా తేలిపోతున్నాయి. శవాలు కొరడబారి బిగిసిపోయినట్టు గాలి బిగిసిపోయింది. చిన్న ఇన్ఫెంటు క్లాసు చదివే కుర్రవాడి చవక పలకలా ఆకాశం నీలంగా కాకుండా, నల్లగానైనా కాకుండా బూడిద బూడిదగా ఉంది. రాములవారి కోవెల ముందున్న సందు బుగ్గి బుగ్గిగా ఉంది.' (46)

అని రాశారు. ఆ సందుని 'బుగ్గి బుగ్గి'గా ఎందుకు ఉంచారు. జరుగబోయే సంఘటన అలాంటిది కాబట్టి. దీనికి గుడిమీది ఆకాశం, అందులో చుక్కలు, చందమామలను పనికి వచ్చేటట్లుగా వాటిలోని క్షీణ పక్షాన్నో, నిర్జీవ పక్షాన్నో రచయిత అలంకార రచనలో తెల్పుతున్నారు.

ఇట్లా రావిశాస్త్రిగారు తమ ఈ నవలలో అలంకారాభివ్యక్తితో గొప్ప సౌలభ్యాన్ని తాము పొందడమే కాకుండా, నవలని ఆకర్షంగాచేసి పాఠకుని అనుభూతి గాఢతను పెంచగలిగారు. ఇలాంటి రచనచేత ఈ నవలకి కావ్యస్థాయి కల్గింది. ఆధునిక కవితలో కథని తీసేసి కేవలం కవిత్వ రచన జరుగుతుండగా కథల్లో నవలల్లో కావ్యలక్షణమైన అలంకారితను తీసికొని రావడం ఏ మంచి పరిణామానికో! మహాకావ్య రచనకు విముఖమై, నవలలకు ఆకర్షితులవుతున్న ఈ రోజుల్లోకి మళ్ళీ మహాకావ్యంలోని ఆత్యాకర్షకమైన అలంకారాభివ్యక్తిని ప్రవేశపెట్టడం విచిత్రమైన మంచి విషయమే. ఇలాంటి ప్రయోగాన్ని మహా ప్రతిభావంతుడైన రచయిత చేసినపుడే అది సాహిత్య సంస్కృతిలో ఒక భాగంగా నిలువగల్గుతుంది. అందుకే ఈ అంశాన్ని ప్రత్యేకంగా ఎత్తిచూపుతూ ఈ వ్యాస రచన.

# ఉపసంహారం

కేవలం శిల్పం ఉత్తమోత్తమంగా ఉన్నంత మాత్రంలో ఏ రచనా గొప్పది కాలేదు. శిల్పంతో పాటుగా రచనా వస్తువు కూడా ఉత్తమోత్తమమైనది అయినప్పుడే అది గొప్పది అవుతుంది. రావిశాస్త్రిగారు ఈ రెండు రకాలైన గొప్పతనాలను ఇమిడ్చి రాసిన నవల ఈ మూడు కథల బంగారం. రచయితల సంఘాలలో, అందునా రాజకీయ గ్రూపుల ఆధిపత్యంలో ఉండే సంఘాలలో రచయితలు దురదృష్టవశాత్తు సభ్యులు కావడంచేత వారి రచనల మీద నిష్పాక్షికమైన నిర్ణయాలను చేయడానికి తీవ్రమైన వ్యతిరేకతను ఆ సంఘాలవాళ్ళు చూపే అవకాశం ఉన్నది. వాళ్ళవల్ల ఆరకంగా సాహిత్యవిద్యకు నష్టం వాటిల్లుతున్నది.

అట్లా జరగడానికి వీలులేదన్న భావంతో ఈ గ్రంథ రచన జరిగింది. రచయిత ఎన్నుకొన్న వస్తువు, సృష్టించిన పాత్రలు, ఇతివృత్తాన్ని తీర్చిదిద్దిన వైఖరి మొ॥న ముఖ్యాంశాలను ఈ గ్రంథంలో సాహిత్య దృక్కోణం నుంచి చర్చించడం జరిగింది. వస్తువూ, దాన్ని ప్రతిపాదించే శిల్పమూ - ఈ రెండింటి మీదా ఈ గ్రంథంలో చర్చించాడీ రచయిత. ఈ రకంగా పరిశీలించడం వల్ల మూడు కథల బంగారం నవల ఎట్లా ఉత్తమోత్తమ నవలగా ప్రపంచ సాహిత్యంలో నిలబడగల్గుతుందో నిరూపణ అవుతుంది. విశ్వనాథ వారి ఈ క్రింది మాటలు మనకెంతో సంతృప్తి కల్గిస్తాయి.

-"మొత్తం మీద నిష్పాక్షికంగా చదివే పాఠకుడికి తెలుగు నవల గొప్ప స్థితిలో వుందని తెలుస్తుంది.

పాక్షిక దృష్టికల వాళ్ళు తనుకు నచ్చినదే నవలనుకుంటారు. ఈ తెలుగు నవల వాఙ్మయాన్ని గురించి చాలా చెప్పవలసి వుంది. మరీ గడచిన యీ రెండు దశాబ్దులలో తెలుగు నవల ఏ యితర దేశ నవలా సారస్వతంతోనైనా పోల్చదగిన స్థితికి వచ్చింది."

(విశ్వనాథ అసంకలిత సాహిత్యం - 1; వ్యాసాలు) ఈ మాటల్ని వారు 1965 లో అన్నారు. ఈ మూడు కథల బంగారం నవల మన నవలాసాహిత్యాన్ని ఖచ్చితంగాఅంతర్జాతీయరంగంలో కూడా అగ్రశ్రేణిలో నిలబెట్టుతున్నది. ఆధునిక తెలుగుదేశపు సాంఘిక జీవనంలో (స్వాతంత్ర్యానంతర కాలంలో) ఉన్న అనేక అంశాలను రావిశాస్త్రిగారి నవలలో పునఃసృజించారు. ఈ సృజనలో పాక్షికత కన్పించదు. మొత్తం సంఘ ఆరోగ్యానికి పనికివచ్చే ధర్మదృష్టి మాత్రమే కని పిస్తున్నది. నైతికతను, పుణ్యాచరణను లక్ష్యంగా చూపుతున్నదీ నవల. ప్రాణం పోతున్నప్పటికీ వాటికోసం బ్రదకాలన్న మహదాశయం ఈ నవలలో కన్పిస్తు న్నది. చెడ్డవాడు ఎప్పుడూ చెడ్డవాడుగానే ఉండాల్సిన అవసరం లేదు. విమల, రామచంద్రయ్యల వంటి ఉత్తముల ప్రభావంపడ్డే వారు కూడా బాగుపడే అవకాశం ఉన్నదని ఈ నవలలోని బంగారయ్య పాత్ర నిరూపిస్తుంది. ఇట్లాంటి సద్వస్తువుకు తోడుగా శాస్త్రిగారి సత్ప్రతిభ ఈ నవలకు చిరంజీవిత్వాన్ని కల్గి స్తున్నది. ఈ నవలలోని శాస్త్రిగారి ప్రతిభ కేవలం ప్రదర్శనం కోసం మాత్రం కాదు. సాహిత్య, సాంఘిక లక్ష్యాలకు ఈ ప్రతిభ లొంగి, వాటిని చక్కగా సాధించింది.

## గ్రంథకర్త ఇతర రచనలు

1. శివయోగి 1963
2. తెలుగు కవిత - సాంఘిక సిద్ధాంతాలు 1980
(ఆం. ప్ర. సాహిత్య ఎకాడెమీ పురస్కృతం)
3. అనుభూతి కవిత్వం (సైక్లోస్టైల్ ముద్రణ) 1982
4. వేయి పడగలు - ఒక పరిశీలన 1984
5. శ్రీ జిడ్డు కృష్ణమూర్తి తత్త్వం - చివరకు మిగిలేది నవల 1985
6. నా దేశం - నా ప్రజలు విప్లవ కావ్య విమర్శ 1985
7. సామాజిక సాహిత్యవ్యాసాలు 1986
8. శేషేంద్రుని కవిత్వంపై కవిత్వం (పుస్తిక) 1987
9. కొందరు మానవతా కవులు - ఒక పరిశీలన 1989
10. విమర్శ మౌలిక లక్షణాలు 1990
11. సంజీవదేవ్ వ్యాసాలు - 1 & 2 సంపుటులు (సంపాదకత్వం) 1990
12. కళాతత్త్వ శాస్త్రం - మౌలికాంశ వివేచన 1993
(తులనాత్మక అధ్యయనం)
13. మను వసు చరిత్ర రచనా విమర్శనము (పెన్నేటి రామచంద్రరావు)
(సంపాదకత్వం) 1995.
14. మను వసు ప్రకాశిక (కాశీభట్ల బ్రహ్మయ్య) (సంపాదకత్వం) 1995.
15. పింగళి సూరన (పి. దక్షిణామూర్తి) (సంపాదకత్వం) 1995.
16. పింగళి సూరనార్యుడు (వింజమూరి రంగాచార్యుడు) (సంపాదకత్వం)
1995.





## రచయిత

అతడు ఉన్మత్త కోకిలగా గానం చేస్తాడు అతడు నిబద్ధ సాహితీ వేత్తగా నిక్కచ్చిగా మాట్లాడతాడు. విద్యార్థినుండి విద్వాంసుని దాకా ఎదిగిన వీరభద్రయ్య నిటారున నిలిచి ఉన్నాడు నేడు నీడ పడని దీపంలా

—జి. వి. సుబ్రహ్మణ్యం

రావిశాస్త్రిగారి పాత్రల చిత్రణలో, కథాక్రమ పరిణామంలో ఉపమాన ఉపమేయాల ప్రయోగాలలో వున్న 'ధర్మచింతన' అన్న ముడి వస్తువును విడివిడిగా తీసి మన ముందుంచిన ఈ విమర్శనా గ్రంథం చాల సాహసోపేతమైనది, కొంత మందికి అప్రియమే అయినా సత్యం గనుక దానిని చెప్పితీరాలి అన్న పట్టుదలని, పాండిత్యాన్ని ప్రతిబింబించేదీను..... నిజం తన పక్కన వుందని తెలిసిన వారిలో వుండే నిబ్బరం ఈ రచన పుట పుటలో పొటమరించడంలో అబ్బురం ఏమీ లేదు.... సువిశాల గగన విహారి అయిన గరుత్మంతుడంత రావిశాస్త్రి అంతరాంతరాలను ఎక్స్‌రే తీశారు ముదిగొండ వారు.... ఈ నవ్య సృష్టి తెలుగు సాహిత్య విమర్శలో ఒక Quantum-Leap గా భావిస్తున్నాను.

—వాకాటి పాండురంగరావు

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd.